గాద్గద్యము కలిగెనఁట. కారణము ? నిండు సౌందర్య భాండారమ్మగు పరమాత్మదర్శనము కలుగుటయే. ఈ పద్యము చదువుకొనుచుండ, వసుదేవునకు భక్తివలన కలిగిన సాత్త్వికభావములు రక్తివలన నే పాఠకునకుఁ గలుగకుండును ? ఎంత మనోహరమగు భావము !

పూతన వ్రేపల్లెకు వచ్చినది. 'వ్రజకాంతలెల్ల నెవరే యీనాతి ? యను నంతలోఁ జేసేతన్ నిన్నెత్తికొని హసించుచు నిలిచె' నఁట. అంత 'అది నట్టింటను గూరుచుండి నిను మాయాడింభకున్ జొమ్మునన్, గదియంజేయుచు నల్లనయ్యా! కడు నాఁకొన్నావు, పాల్ద్రావు మం చది చూపించెడునట్టి వత్సలరసమ్మౌ హావభావమ్ములన్, ముదితల్ తత్తఱమొంది కాదనక యేమో చూచి రాశ్చర్యమై' యఁట. ఏమో చూచిరి అనుప్రయోగము ప్రౌఢము. ఇందలి స్వభావోక్తి సుందరము. ఆ మాటలలోని వత్సలరసము ప్రత్యక్షము.

శకటాసుర భంజనగాథయందు-

"ఆఁకటఁ జిక్కి పాలకని యాకులుఁడై తన చిన్నిపాదమే
మో కదలించినాఁ డితఁడు ; నొయ్యన నయ్యది తాఁకి, వ్రయ్యలై
యీకడఁ గూలె బండి, తిలకించితి నే నిది నే నటంచుఁ దా
మేకముఖమ్ముగాఁ బలికి రెల్లరు గోపక బాలకుల్ ప్రభూ!"

అని - శకటమును బసివాఁడు కాలఁదన్ని ముక్కలు చేసినాఁడు చూచితిమని గోపబాలురు చెప్పిరఁట. అంత పెద్ద లా మాటలు విని,

"అననుగతంబు, సుంత నిజమంటకుఁ గాదిది - ముక్కుపచ్చలా
అని నిసువుల్ భయంపడి యిటాడెద రంతియకాని వేఱు కా
దని రటఁ గొంద ఱందుఁగల యయ్యలు ; కొందఱు పూతనాగతిన్
గని యగునేమొ కాదనుట గాదని సందియ మంది రచ్యుతా !"

ఇందలి సంశయములు, వికల్పములు, స్వభావసిద్ధములై మనోహరములై దీపించుచున్నవి. 'పూతనాగతిన్ గని' అనుదానిలో 'కని' యను క్త్వార్థకము ఇట హేత్వర్థమున నుపయుక్తమై వ్యాకరణ మార్మికత వెల్లడించుచున్నది. 'వాన కురిసి, త్రోవయంతయు బురదయయ్యెను' అను వాక్యమందు త్రోవ రొంపి యగుటకు హేతువు వానకురియుట. ఆ యర్థము నా వాక్యమునందలి 'కురిసి' అను క్త్వార్థకము తెలిపినట్లే - పూతనాగతిన్ గని అనఁగా - పూతనయొక్క నడతను, కని-చూచిన కారణమున' అని యర్థము దెలియఁ దగును. మచ్చున

కిది వివరింపఁబడినదే కాని యిట్టి వ్యాకరణ చిత్రములు దీక్షితకవివరుని వైదుషీ విలసిత భాషితములం దసంఖ్యాకములు.

కవితాగుణములలో ముఖ్యమనిపించుకొన్న సౌకుమార్యము మూర్తి మైనట్లున్న యీ రెండు పద్యముల నిందుదాహరింపక విడువ మనసొప్ప కున్నది.

"ఇది పవడంబు డంబు హరియించు పద మ్మిటు గంటువోయె నో
ప్పిదము దొఱంగి, కందినవి బిడ్డనిచేతులు తమ్మిపూవులం
చదిర! కృపాతరంగిత హృదంతరలై తరలాక్షులెల్ల ని
న్నెదఁ గదియించి మేన్పులకరింపుల ముద్దులు వెట్టిరంతటన్."

"అమ్మక చెల్ల! చిన్నశిశు వప్పరమేశు కృపాతరంగ పా
తమ్మిటు నెట్టి నంతటఁ గదా యొక యొడ్డును బట్టి దక్కెనాఁ
'డిమ్మిటు తె' మ్మటంచు నిను నెత్తి కవుంగిటఁ జేర్చి నందుఁడ
బ్రమ్మగు హర్షముం బడసె నమ్మెయి నెమ్మెయి పుల్కరింపఁగన్."

మల్లెపూలు మాలికగాఁ గ్రుచ్చినట్లు సుకుమారములగు నలఁతిపదములతో నిగుంఫితములగు నీ పద్యద్వయము సుందరమే కాదు, సురభిళముగూడను.

"స్తనకుంభమ్ములఁ బాలుచేపఁగ యశోదాదేవి నా తండ్రి! ర
మ్మనుచున్ నిన్నొడిఁ జేర్చి పాలొసఁగుచో నంతంత లేనవ్వు లిం
పెనయన్ వచ్చియు రాని పల్వరుస నెంతేనిన్ నిగారింపు చెం
దిన నీమోమ టు చూచి గోపి మురియున్ నీతోడిదే లోకమై.

ఇందు ప్రతిపదమును వత్సలరసము జిల్లునఁ జల్లుచున్నది. ప్రసాద సౌకుమార్యములు పెనవేసికొని మెఱయుచున్నవి. ఈరీతిగా ప్రసాద,సౌకుమార్య, మాధుర్య, కాంత్యాది సకల కవితాగుణములతో గాంగయురీ సదృశముగా నడచిన శ్రీ సుబ్రహ్మణ్యదీక్షిత కవివరుని యిమ్మహాకావ్య రత్నాకరమున నెన్నియని రత్నముల నెత్తి చూపఁ గలము ? గుణగ్రహణ ధురీణులగు సహృదయు లామూలాగ్రము చదివి యానందవైవశ్య మొందవలసినదే. కాని సికతాకూప ఖననమునకు దిగి యత్నప్తినొందుట యుచితము కాదని యొకటి రెండు ఘట్టములు మాత్రము చూపింపక మానఁజాలకున్నాను.

గోపికా వస్త్రాపహరణ ఘట్ట మొకటి ముఖ్యమేకదా ! అందు కాత్యాయనీ వ్రతము నాచరించుచున్నవారు గోపకన్యలేకాని ప్రౌఢలగు గోపికలు

కారు. 'దారికా శ్శీత వేపితాః' అను భాగవతశ్లోక వ్యాఖ్యానమున శ్రీధర పండితులు "దారికాః, అక్షతయోనీ రిత్యర్థః" అని సెలవిచ్చిరి. వారు కన్యలు కుమారికలు అనుమాట మఱువరానిది. కృష్ణుని తమకు భర్తను చేయుమని కాత్యాయనీ దేవిని ప్రార్థించుచున్నారు. వారు ప్రౌఢలు కాఁగూడదా? యందు మనిన వారు దిగంబరలైన యవస్థలో చీరలు దొంగిలుట గాని, వారిని నీటనుండి బయటికి రమ్మనుటగాని యౌచిత్యమునకు దూరమగును. బాలలు గావున పరిహాసార్థము హరించినట్లు చీరలను హరించుట మార్దవమును దాటని కృత్యము. భగవంతుఁ డిట్టి యల్పతకుఁ బాల్పడవచ్చునా? అని సంశయము కలుగక మానదు. కాని తనయెడ ననురక్తలై, భక్తలైన గోప కుమారికల యెడ భగవానునకు పరిపూర్ణ కరుణ కలిగినది. అయినను వివస్త్రలై యమునా నదీ స్నానమొనర్చు నధర్మమునఁ గలిగిన పాపము తొలఁగనిదే తాను స్వీకరింపఁడు గానఁ గృష్ణపరమాత్మ వారిని గాఢమగు చలిలో జలన్యాస రూపప్రాయశ్చిత్తమున పరిశుద్ధలను గావించి, దేహాభిమానముఁ గూడఁ దొలఁగింపఁ జేతులెత్తి మ్రొక్కుఁడని మ్రొక్కించుకొని తన హృదయాంతరమున వారికి స్థానమిచ్చి మన్నించినాఁడు.

హేమంతే ప్రథమే మాసి నందవ్రజ కుమారికాః
చేరు ర్హావిష్యం భుంజానా మాసం కాత్యాయనీవ్రతం."

... ... ...

తతో జలాశయా త్సర్వా దారికా శ్శీత వేపితాః.

ఇత్యాది భాగవత విషయము చూచిన సర్వ మవగతమగును. శాఖా చంక్రమ మగునని, యది విడిచి నారాయణీయము నరయుదము గాక.

"చారు విలోకనల్ నదికిఁ జాగి యుషఃప్రభ వెంబడింప శృం
గారము లొల్క నీ కతలు గానము సేయుచు గౌరిఁ గొల్చి యొ
య్యారము భక్తిఁ గొల్చి యుపహారశతమ్ములు నిల్పి యంబికన్
గోరిరి నందసూనుఁ దమకుం బతిసేయు మటంచుఁ బొందికన్."

"ఈవిధి నొక్క మాస మొనరించిన నోము"—అది. "కన్నియ లావ్రతమ్ము తుదఁ గట్టిన చీరలు విప్పి గట్టునన్, గ్రన్ననఁ బ్రోవు వెట్టి యమునా సలిలమ్ముల నోలలాడుచున్" ఉన్నారు. అట్లు విస్త్రలై నదిలో స్నానమాడుట ధర్మోల్లంఘనము. వా రెఱుఁగక యుత్సాహమునఁ జేసిన యీ యకార్యజనిత పాపము తొలఁగింప దయాళువై నీవు రాఁగా,

"ము న్నినుఁ గాంచి సిగ్గువడి మోములు వంచినవేళ చీర లీ
వన్ని హరించి పొన్నతరు వక్కొనకొమ్మకు నెక్కి" "ఇచ్చటి కీరు వచ్చి కొనుఁ డెవ్వరి చీర యదేదొ యెంచికొం డిచ్చెదఁ జారులోచన లివే యనుచున్" పరిహాసనుచేయ కన్య లెల్ల... "వారిఁ దొలంగి గట్టునకు వచ్చి కరమ్ములు దోయిలించి... వల్వ లిమ్మనన్, వారు పవిత్రలౌటఁ గని వస్త్రములెల్ల నను గ్రహించి"నాఁడవఁట—

గోపకుమారికలు పవిత్రలగు దాఁక వారిని క్లేశపెట్టి ప్రాయశ్చిత్తపూర్తి కాంగానే వస్త్రము లిచ్చి యాదరించినాఁడు శ్రీకృష్ణపరమాత్మ. ఈ ధర్మ సూత్రము నిందు వాచ్యము చేయకుండుట కావ్యత్వమును వెల్లడించుచున్నది. భాగవతమున కన్యకలు చేసిన తప్పు వాచ్యముగా నిట్లున్నది.

"యూయం వివస్త్రా యదపో ధృతవ్రతా
వ్యగాహ తైతత్తదు దేవహేళనం
బద్ధ్వాంజలిం మూర్ధ్న్యపనుత్తయే ఽంహసః
కృత్వా నమో వో వసనం ప్రగృహ్యతాం.
(వ్యగాహత – ఏతత్ – తత్ + ఉ.)

మీరు ధృతవ్రతలయ్యును వివస్త్రలై నదీజలములందు స్నానముచేయుట దేవుని హేళన మొనర్చుట యగును. ఆ దేవహేళనజనిత పాపము తొలగుటకై శిరస్సున అంజలిపట్టి నమస్కరించి మీ బట్టలను తీసికొనుఁడు" అని. అట్లే వారు చేసి పవిత్రలై చీరలను దీసికొనిరని యిందు ధ్వనితమని యెఱుఁగఁ దగును.

కృష్ణపరమాత్మ భక్తపరాధీనుఁడు. కావున "వ్రతపూర్తిఁ గాముని గోపికా మణులకుఁ వాగ్దానముఁ జేసి (యచ్యుత) కందర్ప మహోత్సవము"—అది చెల్లింపవలదా? అనునట్లు వేణుగానమున శరద్రాత్రియం దాకర్షించి వారి ననంగకేళీ ప్రపంచమున రంజించుచు

"వలువలు హరించినప్పుడు, వలువలు హరియింతు ననిన వాగ్దాన మ్మి
వ్వలనఁ రసవివశస్వాం, తల కింతుల కప్పగించి" తనియించినాఁడు. సరస మగు కల్పన! ఇంతకంటెను ఆంధ్రీకరింపనలవిగాని యీ క్రింది పద్యమువలన దీక్షితకవి రచనానైపుణి యుచ్చైఃకోటి కెక్కినది.

"విరహే ప్వంగారమయః శృంగారమయశ్చ సంగమే త్వం
నితరా మంగారమయ స్తత్రపున స్సంగమేపి చిత్ర మిదం!"

విరహకాలమున అంగారమయుఁడవు (అగ్నికణములవంటి వాఁడవు) అయి అనగా తాపకారివైనను, సంయోగమున శృంగారమయుండవౌచు ఆనాఁటి సంయోగమునందును (అంగారమయః) అంగారమయుఁడ వగుట చిత్రము అని విరోధము, దానికి అంగ + ఆరమయః. అంగ + (ఓయి కృష్ణ !) ఆరమయః (ఆనంద పెట్టితివి) అని విరోధపరిహారము. ఇట విరహమున గోపికలకు తాపకారివైనను సంయోగమున శృంగారస్వరూపుఁడవై ఓయీ వారిని బరిపూర్ణముగా ఆనందింపఁ జేసితివని భావము. ఈ భావము సభంగశ్లేషయుక్తమగు విరోధాభాసాలంకారమున నున్నది. అట్టిదానిని విడువవీలుగాదు, గ్రహింప నసాధ్యము. ఈ విరోధము పరిహరించుటకు దీక్షిత కవివరుడు 'సంగేప్యంగా రమయ స్తత్ర' యనంగా అని యనుకరణమున నా వాక్యము నిబంధించుట మిగుల ప్రౌఢ మనక తీఱదు. 'అనుకృతే స్తి వాక్యంతు' అనికదా శాస్త్రము—ఇది కవితాశక్తికి నికషము. అది యటుండ నిచ్చి మఱియొకగాథ నరయుదము. రాసక్రీడ — ఈ ఘట్టమున శృంగారరస భంగిమలే కాక, నాట్యభంగిమల కనువగు లయానుకూల చ్ఛందోభంగిమను స్వీకరించుట యెంతయు నౌచిత్యాధాయకముగా నున్నది. మూలమున నున్న వృత్తమే యనువాదమునను గ్రహించుట యెంతయు సముచితముగా నున్నది.

మొదటిపద్యమున శ్రీకృష్ణపరమాత్మయొక్క మధురశృంగార స్వరూపము వర్ణింపఁబడినది. కేశాదిపాదాంతవర్ణనము అది. వేనలిఁ నెమిలిపించియము, వీనుల మకరకుండలములు, (హృదయమున) సరసీజహారములు, అంగరాగమునఁ గల్గు సర్వాంగసౌరభము, (మొలను) కనకకాంచికాంచిత వికంపి పీతవసనము, (పాదముల) మణి మంజు నూపురములు వెలుఁగ కమలాలయాప్రాణవల్లభుఁడు దర్శన మిచ్చుచున్నాఁడు.

తరువాతి పద్యమున

"మండితోరుపరిమండలానఁ గుచమండనాకలిత కంచుళిఁ
గండలోలమణి క్రమకుండలినిఁ గామినీ కలిత మండలిఁ
దండి నొక్కొకతె దండ నొక్కఁడయి దాను మారమణ ! నిండిరే
యెండఁ గాయ జరియించి నీవు నటియించినా వచట రాసముఁ,

అని - కుచమండలమునఁ గంచుళీమాత్రమును దాల్చి, గండభాగముల మణి కుండలములు నటింప మండలాకారముగా నిల్చిన గోపకన్యల నడుమ నొక్కొ

కతె కొక్కొ౯కఁడుగాఁ గృష్ణభగవానుఁడు విశ్వవ్యాపన విలాసము మెఱయించును. 'నాట్యమునఁ బయ్యెదలేకుండ కంచుళీ (కంచెల) మాత్రమే నటి దాల్చు' నను సంప్రదాయము చక్కఁగా నిముడ్చుట రుచిరము.

తరువాతి పద్యమున ఆకాశమున నిల్చి దేవత లరయుట మనోహరముగా వర్ణింపఁబడినది.

అనంతరపద్యమున - "ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః సంజగౌ వేణునా దేవకీనందన"యనినట్లు మండలమధ్యమున నిలిచి పరమాత్మ వేణువు నూఁదుచుండ "పిల్లగ్రోవి వినిపించు తానసమ వేదగానకలరాగలీలోల్లసద్గతుల" కనువుగా "ఉచ్చలత్పదపయోజతాళలయ భంగిమ"లచే మణికంకణాళి ఘల్లు మనుచుండ, నొండొరుల మూపులందు కరకంజము లానుకొని శ్రోణిచలదంబర లగుచు గోపాంగనలు ఝుణంఝుణఝుణలను నెఱపి రనిన వర్ణనము ఎంత మనోహరము ! ఎంత స్వాభావికము !

అనంతర పద్యమున - తారస్వరమున వెలువడు గానమున కనువగు తాళముతోడి గోపికాకృష్ణుల లాస్యతాండవములఁ గాంచి ముగ్ధులై దేవతలు పూలవానలు సించిరి. సచ్చిదానందమయుఁడగు భగవంతునిలో లీనమైపోయి మూర్ఛిల్లిరి అని వర్ణింపఁబడెను. మనస్సుచే నూహించుటకేని యలవికాని యా జగన్మోహనదృశ్యమును గాంచి దేవతలేకాదు- ఏ ప్రాణి యానందరసాప్లావితమై మూర్ఛవోవదు ?

ఈ క్రింది పద్యమున నొక విచ్ఛిత్తి విశేషము రసప్లుతమై కనఁబడును. ఒక తీవబోణి, మెయితీఁగను గ్రొంజెమట గలుగ శ్రమచే సోలుచు, కనులు మూఁతవడఁగా కృష్ణుని కేలూని నిల్చియుండఁగా—ప్రక్కనున్న యొక గోపిక యా యవకాశము కనిపెట్టి, కృష్ణుని పటీరరస నిస్స్రుతితోఁగూడిన భుజము నల్లనఁ జేరి యాతని మోవి ముద్దుగొని పులకితగాత్రి యయ్యెనని వర్ణింపఁబడెను. ఈ ఘట్టమున కంతకు నిది రత్నదీపమనిన నతిశయోక్తి కానేరదు. భగవానుని యెడఁగల గోపికల ప్రేమ మెంత మధురమో ! ఎంత నిరవధికమోకదా !

క్రమముగా రాసము హ్రాసము నొందుట ననంతరపద్యద్వయమున వర్ణింపఁబడెను.

ఒక కాంత కర్ణాభరణములు చెదరిపోయిన తన చెక్కును కృష్ణుని చెక్కున నాని తదాస్యపూగరసచర్వితము నాస్వాదించె నఁట. ఎంత పుణ్యాత్మ

రాలో కదా! అంతలో 'ఆఁగె గానము, వాద్యము నాఁగె'— ఆ యంగనలు బ్రహ్మానంద రసానుభూతిలో మైమఱచి నాట్యముచేసిరే కాని ఎడలు నీవినిగాని, విరియు వేణిని గాని, ప్రిదులు రైకను గాని యావేగమునం దెఱుఁగనే యెఱుఁగరఁట. ఇంతకంటెను చిత్రము. సకలదిశలనలమిన వెలుఁగును నాఁగిపోయెనఁట. ఇట్లు మదనోన్మాదలగు నా సుందరుల పురాకృత సుకృతమున నందఱ కన్ని రూపులఁ దాల్చి వారిని, మాన్మథోత్సవమునఁ దేల్చెనఁట. ఆ కేళీస్వరూపము తరువాతి పద్యమున నిట్లు వర్ణింపఁబడెను.

"వింత కేళి మురిపించి ముచ్చటలు వించి లాలనము నించి నీ
వంత యామునవనాంత కేళుల లతాంత సౌరభ నితాంత శ
య్యాంతపాళుల వసాంతలీలల సుహాసినీ రత విమోహన
మ్మెంతొ సేసితి వొకించుకై విసరి యించు చల్లనగు తెమ్మెరఁ."

ఆహా! ఇందు భావమెంత మృదువో రచన మంతకంటె మృదుతరమే కాదు. మధురతరమును—కవిత్వమున కింతకంటె సాఫల్య మేమి కలదు?

ఈ ఘట్టమున శృంగారము పిక్కటిల్లియున్నట్లు లౌకికదృష్టికిఁ గనఁబడును గాని పరమార్థ మారయ—భగవదనుగ్రహము మాత్రమే యని విశదమగును. భగవంతునకు జగత్తంతయు శరీరమనియు, నందేకదేశములగు నా యువతుల యాలింగనాదికము స్వాంగాలింగనమే యనియు, అందు కామప్రసక్తి లేదనియుఁ బురాణాంతరమునఁ జెప్పిన

"స్వాంగాలింగే రతి ర్న స్యా: దంగనాలింగనే రతిః
యస్యాంగం జగ దీశస్య, తస్య రాగాదయః కుతః"

అను సూక్తికి స్ఫోరకముగా 'సకలదిశల నలముకొనిన వెలుఁగు' అను వాక్యమును జక్క రచించిన యీ రచయిత సంస్తుత్యుఁడు. త్రికరణశుద్ధిగాఁ దన్ను భజించువారిని దనయందుఁ జేర్చుకొనువాఁడు భగవంతుఁ డనుటకు నీ ఘట్టము ముఖ్యోదాహరణము. పరంజ్యోతిస్స్వరూపుఁడగు శ్రీకృష్ణపరమాత్మ యా కన్యల కంతర్బహిర్వర్తియై, యానందక్రీడన మొనరించినాఁడను నర్థము కాంతాసమ్మితముగాఁ దెలుపఁబడినదని కావ్యమర్మజ్ఞులు గ్రహింపకపోరు.

ఇఁక నీ స్తోత్ర కావ్యమున తుట్టతుదిని శ్రీ నారాయణభట్టపాదుఁడు బ్రహ్మానందసాగరమున నోలలాడుచుఁ దన కఠినతపోనియమయుక్తధ్యానమునకు వశంవదుఁడై ముకుందుఁడు తనముందు సాక్షాత్కరించినట్లు "అగ్రే

పశ్యామి" "కనుచున్నా నదిగో" అని యా నారాయణుని దివ్యరూపమును కేశాది నఖావధిగా వర్ణించిన వర్ణన మపూర్వము. అందు భక్తిచేతను, రచనా రామణీయకముచేతను నా వర్ణనము పరకోటి కెక్కినది. త్రిలోకసమ్మోహనమగు నా పరమేశ్వరుని మంగళరూపమును జతుస్సుచే (అనిన నేఁటివారు నమ్మరేమో) జ్ఞానచతుస్సుచేతను వీక్షింపకున్న ననితర సాధ్యమగు నట్టిఫక్కిలో భట్టపాదుఁడు రచింపఁగలఁడా? "తత్సర్వం తపసా సాధ్య"మ్మనియు, "తపసా దుష్కరం నాస్తి" యనియుఁ బల్కిన యార్ష వాక్యము లసత్యము లగునా? అసత్యములని ధార్ష్ట్య మునఁ బలికినచో నంతకంటె ఘోరమని యుండునా?

ఆతఁడొనర్చిన కవిత్వతపస్సు తుట్టతుదికిఁ బండినదన్నమాట. అట్టి పరిపక్వ తపశ్శక్తికి భగవంతుఁడు పాదసేవకుఁడయి తీరవలసినదే. తనకు ప్రత్యక్షముగా లేడు. కనుక నమ్మమమవారి కొక నమస్కృతిజేసి, భగవత్స్వరూపవర్ణన ఘట్టము పరిశీలింతము.

"కనుచున్నా నదిగో కలాయసుమరేఖా కోమలమ్మైన వె
ల్గును బీయూషరసాప్లుతుండనయి యాలో దివ్యకైశోర మూ
ర్తిని శ్రీనారదముఖ్యు లయ్యుపనిషచ్ఛ్రీసుందరీబృందముల్
వినుత బ్రహ్మసుఖానుభూతిఁ బులకల్ నిండారు నెమ్మేనులన్
దనచుట్టున్ గొలువన్ జెలంగు నుదయత్తారుణ్యలావణ్యునిన్".

అదిగో కలాయమువలె గోమలము నీలమునగు తేజఃపుంజమును, దాని లోపల నారదాది పరమర్షులును, ఉపనిషత్కాంతలును బ్రహ్మానుసంధాన జనితానందానుభవముచే గగుర్పాటొందిన శరీరములతోఁ దన్నుఁ జుట్టుకొని సేవింప దీపించు నంకురత్తారుణ్యలావణ్యమగు దివ్యకిశోర విగ్రహమును (బాలకృష్ణుని) కనుచున్నాను. అని భావమున పొంగిపోవుచున్నాఁడు. ఆ లేఁ బ్రాయపు వెలుఁగును నిదానించి చూడఁగా

"ఘననీలప్రభ నుంగరాల్ దిరిగి, చక్కన్ జిక్కువోదువ్వి నిం
చిన యక్కొంజెసిగన్ గనన్నవమణీ శ్రీమత్కిరీటమ్ము, నం
తనగాఁ జెర్విన నెమ్మిపింఛియము మందారప్రసగాబద్ధమై
యనువౌ నీకబరీభరమ్ము మతి నీదౌ ఫాలశాలేందు వీ
థిని దర్శించుచు నుంటి శ్వేతతర తత్స్నిగ్ధోర్ధ్వపుండ్రద్యుతిన్."

అందూర్ధ్వభాగమున చిక్కువోవఁ జక్కఁగా దువ్విన - యుంగరాలు దిరిగిన - నీలవర్ణమున నిగనిగలాడు కురుల కొండెసిగ, నవరత్న ఖచిత కిరీటము, చక్కఁగాఁ జెక్కిన నెమిలిపింఛము, మందారమాలలు చుట్టిన జుట్టుముడి. బాలచంద్రునివంటి ఫాలము. అందు ధవళము స్నిగ్ధమునగు నిలువునామము. ఆహా ! ఏమి నీ సొగసు ! నా తండ్రీ కృష్ణా ! కరుణాసాగరతరంగమువంటి కన్బొమలతో, సుందరములై నీలములగు పక్ష్మములతో నలంకృతములై చిఱు నగవుచే మొగవిరిసిన చల్లని నీ కృపారసము జల్లు చూపుల నియ్యనాథునిమీఁద నొలయింపుము."

ఆహా ! ఎంత సమ్మోహనమగు స్వరూపమో కదా యనిపింప వర్ణించును. క్రమముగా నాసికను, శ్రవణములను, అరుణాధరమును, కౌస్తుభాలంకృత కంఠమ్మును, శ్రీవత్సమును, వనమాలను, వర్ణించి, వర్ణించి, పీతాంబర, రశనాకింకిణుల నగ్గించి, యూరుజానుజంఘలను జిత్రముగా నుత్ప్రేక్షించి, పరమప్రార్థ్యములును ప్రాప్యములును నగు పాదాంబుజములను విభాగములతో నిట్లు స్తుతించును.

"గురుమంజుశ్రుతులఁ బదాగ్రభజనఁ గొండాడు మంజీరముల్
బరమశ్రాంతినిమజ్జదానతజనప్రత్యుక్త ధీమందరో
ద్ధరణప్రౌఢము కూర్మమూర్తి ప్రపదమ్మాతామ్రరోచిర్నఖ
స్ఫురితేందుప్రభ నాశ్రితార్తితమముల్ బోకార్చు కళ్యాణసం
భరిత మ్మాకలిత మ్మొనర్తును భవత్పాదాంగుళీ సంతతుల్."

పరమేశ్వరుపాదసేవ యుత్తమోత్తమ మని మనోహరములగు ధ్వనులచే స్తుతించునట్టి వఁట మంజీరములు. శ్రమలో మునిఁగిపోయిన భక్తజనుల బుద్ధి యనుమందరగిరి నెత్తునట్టి కూర్మములే యఁట యాయన మీఁగాళ్లు. ఇఁక కాలి యంగుళులలో ఎఱ్ఱనికాంతి గలిగిన నఖము లనెడు చంద్రులయొక్క వెన్నెలలచే భక్తుల యార్తియను చీఁకటులను బోకార్చి శుభము లొసఁగునవియఁట. ఎంతటి భావన ! ఎంతటి భక్తి ! ఏమి మధురమగు భావము ! ఎంత సొగసైన కల్పన !

ఈ రీతిగా నానంద బాష్పములతో, రోమాంచ కంచుకితాంగములతో డగ్గుత్తికతో భగవంతుని దివ్యసుందరాకారమును గానముచేసిచేసి యపశుఁడై నారాయణభట్టపాదుఁడు తుట్టతుది కోర్కిగా -

మ. నిరతిఁ యోగులకుఁ ద్వదంగతతి నెంతేఁ దియ్యనై, ముక్తిమం
దిరమై భక్తుల కోర్కులఁ గురియుచో నీపాదమూలమ్ము స్వ
స్తరుపాళిఁ జిగురౌచుఁ గృష్ణ! వెతయంతఁ బాపి నాభావమం
దరుణజ్యోతి స్ఫురించి కూరుచుత బ్రహ్మానంద రాజ్యేందిరఁ.

అని యోగులకు నీ సకలాంగములకంటెను మధురముగాఁ దోఁచునదియు, ముముక్షువులకు మందిరమగునదియు, భక్తులకుఁ గోర్కులను గురియు కల్ప వృక్షపుఁ జిగురాకుగ వెలయునదియు నగు నీ పాదమూలము కృష్ణా! నా చిత్తమున నిత్యముగా నుండి, సకల తాపములను హరించి బ్రహ్మానందము నొసంగునుగాక! యని ముముక్షువునకుఁ బరమప్రార్థ్యమగు పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మానందమును మాత్రము కోరి, నిష్కామ కర్మస్వరూపము భాసిల్లఁజేసి— "అరయన్నెరక నీ మహత్త్వ మెది యే నన్నానొ విశ్వేశ! య ప్పరుషమ్ముఁ క్షమియింపు—"అని తన పొరఁబాటెందేని గలిగెనేమో, దానిని క్షమింపుమనుచు—నా సూక్తి నీ దయకుఁ బాత్రమగుఁగాక యని తా నుచ్చ రించిన స్తోత్రరూపవాణి కంగరక్ష గోరుచు మంగళాంతముగ గ్రంథము ముగించెను— జన్మము ధన్యమొనరించుకొనెను, జగత్తును ధన్యమొనర్చెను. ఇఁక నా మిత్రము సుబ్రహ్మణ్యదీక్షిత కవిరత్నము అక్షరాక్షరముగ నారాయ ణీయము మూలమునంతయుఁ జదివి తనలోఁదానే మురియుచు నూరకుండక, యాద్యంతము నాంధ్రీకరించి, యాంధ్రుల స్థిరకృతజ్ఞతకుఁ బాత్రుఁడగుటవలన ధన్యజీవనుఁడయ్యె. ఈ కావ్యకన్యను దత్తపుత్త్రికగా స్వీకరించి, సంజ్ఞాదేవి రమణుఁడగు సూర్యభగవానునకు భేదబుద్ధి కలుగనట్లు మెలఁగు ఛాయాదేవి వలె మెలంగుమని నారాయణభట్టపాదకృతి కన్యాపతియగు తిరువాయూరు దేవునకే పత్నిగా నర్పించిన శ్రీశ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ధన్యత ముఁడు. కృతికన్యాదాన శుభవేళఁ బరమేశుని పాదములు తన భర్త కడుగు చుండ బంగరు కలశమున నుదధారవోసిన శ్రీ రామకృష్ణారాయుని ధర్మపత్ని యనంతలక్ష్మి ధన్యాతిధన్య. ఇది స్తవమనుకొందురేమో! కాదు. వాస్తవము. ఈ భావమును గృతి నర్పించుచు రామకృష్ణారాయఁడే

"అన్వ్యల్‌గారు కవుల్ సగోత్రజు, లనన్యప్రీతి మాచేత నీ
కన్యాదాన మహోత్సవమ్ము జరుగంగాఁ గోరి, రెంతేనియుఁ
ధన్యమ్మయ్యెను మా సతీపతులదౌ దాంపత్యము"

అనినప్పుడు అన్యథా వ్యాఖ్యానింపఁ బనియేముండును ? నిజముగా ఆ దంపతు లతోఁబాటు బూర్గులవారందఱును ధన్యచరితులు.

శ్రీ దీక్షితకవికి నీ కావ్యరచనమునకుఁ బురికొల్పి, కృతికన్యాదత్త స్వీకారమున కనుసంధాతయై, సౌభ్రాత్రమున మాత్రమే కాక సౌహార్దమునఁ గూడఁదోడునీడయై, తర్క వేదాంతశాస్త్రము లధిగమించి, సకలపురాణములఁ గరతలామలక మొనర్చుకొని, గానవిద్యానదీష్ణుఁడైన పండితవతంసుఁడు దీక్షిత కవి యనుఁగు తమ్ముఁడగు శ్రీ వీరభద్రశాస్త్రి మఱియు ధన్యుఁడు. భూమికారచనా ప్రసంగమున నామూలచూడము నీ కృతిని బరికించుచు, నీ నాలుగు దివసములులేని 'పదేపదే' కృష్ణనామ పునశ్చరణముచేయు మహా భాగ్యము నెనసిన నేనును ధన్యజీవనుఁడనే యనుకొనఁబోవ నహంకారమగునని జంకి విరమింపక తప్పనిదయినది.

పురుషార్థనిదానములై రసమయములైన యీ జాతి యుత్తమ నిబంధ ములను, దమ్ము లిరువురును జక్రరక్షకులై తోడుసూప మాదీక్షిత కవీంద్రు డింకను నెన్నియో రచించుగాక ! ఆ యుత్తమచరితుని సతీసుతాదులు నిరామ యాయుష్మంతులై యభ్యుదయము నెనయుదురుగాక ! కవితాధురంధరుఁడగు శ్రీ రామకృష్ణారాయప్రభువు సరస్వతీపాదారవిందపూజాసుమములుగాఁ దన కావ్యములను, కృతిస్వీకృతులచే నితర కవిసింహుల కావ్యములను, రచించి, రచింపఁజేసి రాష్ట్రముతోపాటు ఆంధ్రవాఙ్మయమును గూడ విశాల మొన రించుచు నభ్యుదయపరంపరలొందుఁగాక ! గురువాయూరుపురాధినేతయగు శ్రీమన్నారాయణస్వామిదేవుని యవ్యాజకరుణాకటాక్షచంద్రికాప్రసారమున ప్రసాదగుణభరితమై, మాధురీధురీణమై యాంధ్రవాఙ్మయమున కొక నూత నాలంకారముగా నవతరించిన ఈ నారాయణీయము జగద్వ్యాప్తినొందుటయే కాదు, కేరళదేశమున సంస్కృతనారాయణీయమువలె నాంధ్రదేశమున నింటింట నాబాలగోపాలమునకు నిత్యపారాయణగ్రంథమై, సకలతాపనిర్వా పణమై, కల్లూరు, బూర్గులపావనవంశద్వయీ యశఃపతాకయై యాచంద్ర తారార్కము మిన్నుముట్టి విలసిల్లుగాక ! స్వస్త్యస్తు, సెలవు.

ఇట్లు
విద్వద్విధేయుఁడు
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

అమలాపురము
విలంబి భాద్రపద పూర్ణిమ

# పరిచయము

బ్రహ్మశ్రీ విద్వాన్ దువ్వూరి వేంకటరమణశాస్త్రి
ఆంధ్రవిశ్వకళాపరిషత్తు.

కేరళదేశీయుఁడును బదునాఱవ శతాబ్ది యుత్తరభాగమువాఁడును నగు 'నారాయణభట్ట మహాకవి' తనకు సంక్రమించిన వాతరోగమును బాపికొనుటకయి "గురువాయు పురాధీశుఁడగు నారాయణు" నుద్దేశించి సంస్కృత భాషలో నారాణీయమను స్తుతిప్రబంధ మొకటి రచించెను. ఇది నూఱుదశకములుగా సుమారు వేయి శ్లోకములలో విరచితమయినది.

భాగవతసారమనఁదగిన యీగ్రంథమును కమ్మని తెనుఁగులో ననువదించి నారాయణభట్టమహోదయుని భావనాలాలిత్యమును ఆంధ్రుల కందించు భాగ్యము మా సుబ్రహ్మణ్యదీక్షితులకు లభించుట ఆతనికి ధన్యతాపాదకము. మాదృశులకు ఆనందదాయకము—

శ్రీ దీక్షితులు అనేక రచనలద్వారమున ఆంధ్రులకు సుపరిచితులు. సంస్కృతాంధ్ర కవితాపాటవముతోపాటు నైష్ఠికజీవితము నలవఱచుకొన్న ధన్యజీవి. ఈయన యధ్యాపకమార్గము నవలంబించి చాలినంత తీఱిక లేకున్నను సహజసిద్ధమయిన కవితాసాధనతో ఆంధ్రశారద నారాధించుచు బుద్ధిని, వాక్కును, జీవితమును బవిత్ర మొనరించుకొనుచున్న సహృదయుడు. ఇందులకీ నారాయణానువాదమే ప్రబల నిదర్శనము.

ఈ యనువాదము కడుంగడు కౌశలముతో నిర్వహింపఁబడినది. కంఠోక్తిగాఁ జెప్పినఁగాని యియ్యది యనువాదమని తెలియనంతటి సహజ సుందరము. సలక్షణమగు పదప్రయోగము, సరళమగు సమాసప్రక్రియ, సరసమగు వాక్యరచనయుఁ గలిగి ప్రసన్న గంభీరమగు శైలిలో నడచిన యీ రచనను ఆమూలచూడముగ ముదమార, చవులూరఁ బరికించి, అమితానందము నందితిని.

ఏనాఁడో బాల్యమున మాయిద్దఱకును ఉల్లాసకరమయి అత్యల్పకాల మేర్పడిన విద్యాసంబంధము ఈనాడు నాకెంతటి యాహ్లాదము గూర్చినదో నాకే యెఱుక.

ఆంధ్రుల జిహ్వారంగముల ననుపదము నాట్యమాడు తెనుఁగు నుడికారపు సొంపులు, శ్రీనాథుని సీసపాదముల యొయ్యారపు నడకలు, పెద్దనార్యుని యల్లిక జిగిబిగులు, ముక్కువారి ముద్దుపల్కుల సొబగులు, సూరనార్యుని చమత్కృతి సోయగములును నీయన రచనలో నడుగడుగునఁ బొడసూపు చుండును. అట్టి పట్టులు కొన్నిటిని నేను జూపి చెప్పుటకన్న రసికులకు అన్నిటిని బరికించి యానందించుట సరసమార్గము.

మా దీక్షితు లిట్టి రసవద్గ్రంథము లనేకములు రచించి సరసులగు నభిజ్ఞుల సత్కృతి గౌరవములందుఁగాక అని యాశింతును.

"సమానానా ముత్తమశ్లోకో అస్తు" అని యాశాసింతును—

## మఱొక్కమాట

సహృదయాగ్రగణీయులు కేరళాధీశులు శ్రీ రామకృష్ణులు ఈ కృతికి స్వీకర్త లయినారు.

సువర్ణమునకుఁ బరిమళమబ్బినది.

కోమలమగు కృతికి సుకుమారుఁడగు పతి లభించుట సుకృతములలో సుకృతము.

---

# స మీ క్ష - ౧

'విద్యాప్రవీణ - ఉభయభాషాప్రవీణ'
బ్రహ్మశ్రీ చివుకుల సుబ్బరామశాస్త్రి

నారాయతత్త్వమును నిరూపించు నారాయణీయమను కావ్యమును కేరళదేశవాసియగు నారాయణట్టు అను కవి సంస్కృతమున రచించెను. ఇది సర్వపురాణసారమనదగు శ్రీమద్భాగవతమునకు సంగ్రహరూపము. వైయాకరణియగు కవియొక్క ప్రౌఢిమ కావ్యమునఁ గానబడుచున్నది. విషయమును విడువక భాగవతతత్త్వమును కరతలామలకము గావించెను.

కవి గ్రహించిన యితివృత్తమహత్త్వమున కావ్యము చిరస్థాయియగును. భాగవతమున వైదిక భక్తిస్వరూపము భూమికాభేదమున నిరూపింపఁబడినది. జ్ఞేయబ్రహ్మము ప్రాప్యమగు తత్త్వము. ఇందు వర్ణింపఁబడిన భగవల్లీలావిశేషములకు ఇచ్ఛామాత్రమైన చిద్రూపిణియగు ప్రకృతి ఉపాధి. కావుననే శ్రీకృష్ణదర్శన స్పర్శనాది మాత్రముననే భక్తులు కృతార్థులైరి. ఈ గాథ లీకావ్యమునకు ఇతివృత్తము. నిత్యమగు నితివృత్తముతో కావ్యము స్థాయినందుననిన ప్రామాణికోక్తి పాటించి తలచిన శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారు నారాయణీయమును దెలుఁగున ననువదించిరి. కర్మోపాసనావిశేషములఁ బవిత్రమైన వంశమున జన్మించిన శ్రీ దీక్షితుల సహజ భక్తిభావనాభావితమైన చిత్తమున కీ గ్రంథము హత్తినది. పలువురు కవులు సంస్కృత కావ్యముల నాంధ్రీకరించియు నీ గ్రంథము నంటకుండుట శ్రీ దీక్షితుల పుణ్యవిశేషము. శ్రీ పోతన సహజపాండితీమహిమచే దన జన్మము సార్థక మొనరించిన విధమున వీరీ కృతిచే తనకబ్బిన కవిత్వాదిసంపదల జన్మసాఫల్యము నందిరి. ఈ రచనచే చిద్విషయభావితమైన చిత్తము శ్రీ కృపావిశేషపాత్రమై ఉత్తరభూమికనందికొనినది. తత్ఫలముగ "గురుకృపాలహరి" అను సంస్కృత స్తోత్రము వీరి ముఖమున నవతరించినది.

కవికి స్వతంత్రరచనకంటె అనువాదము శ్రమసాధ్యము. మూలాను సరణమున ధారావాహికమగు శైలి కుంటుపడుచుండును. ఈ అనువాదము స్వతంత్ర రచనగా సాగినది. శ్లోకమునకు సరియగు పద్యమును వ్రాసినను

భావమును భావించి తెలుఁగుదనమునూహించి పదశక్తిని పరిశీలించి ప్రసాద మాధుర్యాది గుణముల పాటించి గ్రంథమునందు స్వత్వమును సంపాదించు కొనెను.

నామరూపాత్మకమైన ప్రపంచమున ముందు శబ్దమును పిదప అర్థమును గ్రహించుట జీవి స్వభావము. శబ్దార్థముల అవినాభావస్థితిని ప్రకృతి పురుషుల సామ్యస్థితిగ గుర్తించుట సమ్యగ్దర్శనము. రెండు నొకటియనితెలియుట జ్ఞానము. భాగవతమున శ్రీకృష్ణుఁడు చిత్ప్రకృతియగు పరదేవతయనియు పురుషుడనియు శ్రీ వ్యాసభగవానులు వర్ణించిరి. ఈ యలౌకిక జ్ఞానమునకు వ్యక్తనామరూపములుప్రథమసాధనములు. నామరూపముల సూక్ష్మదశ యగు నాదవృత్తుల యద్వైతస్థితిని చూరగొనిన సిద్ధుల వాక్కును వెన్నంటి అర్థము పరుగిడును. వారు బోధింపఁదలఁచిన అర్థము స్వభావ మధురము. దానికి తోడై శబ్దమాధుర్యము స్ఫురించుచుండును. ఈ శబ్దార్థప్రతిపత్తినే కవికుల తిలకుఁడగు కాళిదాసు "వాగర్థావివ సంపృక్తౌ" అనుచు నాకాంక్షిం చెను. శ్రీ జయదేవ, లీలాశుక, నారాయణతీర్థ, శంకరభగవత్పాదాదుల కవితయం దీలక్షణము సమగ్రముగ నున్నది. వారు కవులుగ కీర్తి నందలేదు. ఆచార్యులు, భక్తులు నగువారు అన్నిట ప్రమాణభూతులై వెలసిరి. పోతన యీ శ్రేణికిఁ జెందిన తెలుఁగుకవి. 'మందార మకరంద మాధుర్యమునఁదేలు' పోతన పద్యమును విని ఆనందింపనివాఁడు పండిత పామరులలో నేడి ? అందలి శబ్దము అర్థము రెండును బ్రహ్మ ప్రతీకములై ఆనందానుభవమును లేశమాత్రముగనైన అనుభవమున గోచరింపఁజేయును. ఈ శబ్దవైచిత్రిని ఆలం కారికుల శబ్దాలంకార లక్షణములతో పోల్చుకొని శబ్దాలంకార ప్రచురమయిన చోట దీనిని నధమ కావ్యముగ నెన్న ననువుగాదు. సర్వభావములకు పాత్ర మైన భగవద్భావ మధురమైన అర్థమును స్ఫురింపఁజేయుట యిందుగల అసా ధారణగుణము. భక్తిరసప్లావితమైన భాగవతమును భగవన్మహిమానుభవ సిద్ధుఁడగు పోతన తెలుఁగున నందించుట తెలుఁగువారి అదృష్టము.

ఆంధ్రీకృతమగు నారాయణీయము విషయమునను శబ్దార్థ సామ్యము నను ఆంధ్ర భాగవతమునకు క్షిప్తరూపమనఁ దగియున్నది. నిరంతరము శ్రీమద్రామాయణ పారాయణాదులచే రామతత్త్వము భావించిన యిక్కవి శ్రీ రామకృష్ణరాయ కవితో సాక్షాత్రము నందుకొనెను. వీరిరువురు శ్రీ కృష్ణ

ప్రతిరూపమగు శ్రీ గురువాయూరు దేవున కంకితముగ నీ గ్రంథమును సమర్పించుట బంగారునకు తావి యబ్బినట్లైనది. ఇందలి సముచితరీతులకు ఉదాహరణము - నృసింహావతార ఘట్టమున—

"తప్తస్వర్ణసవర్ణఘూర్ణచటులోదగ్రాక్ష ముద్యత్సటా
వ్యాప్తోత్కంపినికుంచితాంతరము ఖడ్గాగ్రోగ్రజిహ్వాగ్రసం
దీప్తప్రోద్ధతదంష్ట్రికాయుగమహాదిగ్ధాద్రిరాడ్గహ్వరో
ద్దృప్యాస్యమ్మయి మాయుపాస్య మిరవాం దెవ్ శ్రీనృపంచాస్యమై"

అను పద్యమున మూలమునందలి సమాసమునే గ్రహించి అవతార గాంభీర్యమును, భయంకరక్రౌర్యమును, స్ఫురించున ట్లనువదించియు, తెలుఁగుదనమందు గల యభిమానము పురికొల్ప పాఠాన్తరముగ నీ క్రిందిరీతి పద్యము గూర్చిరి.

"పుటముం బెట్టినజాలువాపసిమి కెంపుల్ నింపుకన్నుల్ సటా
చ్ఛట నిక్కంగవడి నింగికిం దుముకుచుఁ జంచద్గుహా ఘోరమౌ
నటులా మోఁ మసిధారవోలె బదనై యల్లాడు జిహ్వాగ్ర ము
త్కటదంష్ట్రాయుగళోగ్రమౌ నరమృగాకారమ్ము భావించెదన్".

ఈ రెండవ పాఠమున ఓజోగుణములేని కొఱత గానరాదు. భౌతిక ప్రకృతితో రసస్ఫూర్తిగల యాకారవిశేషమును, సత్త్వప్రకృతితో భగవద్రూపమహిమను భక్తులు భావించెదరు. భౌతికశక్తులఁ బెంపొందిన హిరణ్యకశిపుఁడు మున్నగు రాక్షసులు వారి దృక్పథమున నాయాకారము తమ శక్తికి మించినదని భయపడవచ్చుఁగాక. ప్రహ్లాదాది భాగవతోత్తములు భగవన్మాధుర్యమునే భావించియుండుటచే నృసింహాకారమును దర్శించినను వారికి ఉద్వేగము కలుగకుండుట సైజమనిపించి కవి యీ పాఠము వ్రాయుటెంతయు సముచితమని నాకు తోచినది.

మాతృకలోని వైచిత్రిని విడువని అనువాదమునకు మచ్చుపదియవస్కంధము 66 వ దశకము - 9 వ శ్లోకము—

"విరహేష్వంగారమయః శృంగారమయశ్చ సంగమేఽపి త్వం।
నితరా మంగమయ స్తత్ర పున స్సంగమేఽపి చిత్రమ్"॥

ఇందు "సంగమే శృగారమయః, సంగమేఽపి తత్రపునః నితరాం అంగారమయః" అని విరోధము తోచును. అంగ=ఓయీ, నితరాం=మిక్కిలి, అరమయః=క్రీడించితివి, అని పదవిభాగమున నర్థము జెప్పి విరోధము పరిహ

రింపవలెను. ఆలంకారికదృష్టితో విరోధభాసాలంకారము గ్రహించి, తాత్త్వికదృక్పథమున స్వభావోక్తియు జెప్ప నొప్పును. అపరోక్షజ్ఞానభూమిక అగ్నిరూపము. అగ్నిసర్వమును తనలో లీనము చేసకొని స్వస్వరూపాపత్తిని పొందించును. సాధకుల స్వస్వరూపాపన్నులఁ జేయువాఁడవను భావ మిందు ఆత్మస్వభావానురూపము వర్ణితము. ఈ భావమును విడువక వ్రాసిన పద్యము చూడుడు—

"అంగారమయుడ వెడసిన
శృంగారమయుండ వెనసి చిత్రము "సంగే
ప్యంగారమయ స్త్వత్ర" య
నంగా నంగనలగూడి నర్తించి తటఁ."

పై భావము స్ఫురింపకపోవునని యథామూలంగా వ్రాసినను భావమును గుర్తించు సూచన నిచ్చిరి. మూలభావములఁ గొన్ని తావుల విపులీకరించినను గొన్నియెడల సంగ్రహించినను మూలముతో విరోధింప లేదు. ఆ యా గుణముల వనువగు పట్టుల రసికులగు పాఠకు లెఱుంగగలరు.

ఈ కృతి సమర్పణ సమయమున సర్వజ్ఞపీఠాధీశులు జగద్గురువులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర సంయమీంద్రులు నారాయణ స్మరణపూర్వమైన తమ యాశీస్సుల బ్రహ్మశ్రీ వేదమూర్తులు-ఉట్రవడియం కృష్ణశాస్త్రివర్యులముఖమున నందఁజేసిరి. శ్రీ శాస్త్రిగారి సంస్కృతకవనము శబ్దార్థ మధురమైనది. వారి "యదునందనవందన శతకము" న శబ్దమాధుర్యము పోతనను మఱపించినది. శ్రీ గురువాయూరు దేవుని దర్శించి వెనువెంటనే పారవశ్యమున నుదయించిన శతకము వారి భక్తికి నిదానము.

ఇంతటి సజ్జనాభినందనల నందిన యీ గ్రంథమును నారాయణార్పణము గావించిన కవియు, శ్రీ బూరుగుల రామకృష్ణరావుగారును భగవత్కృపా విశేషమున నితోధికముగ శబ్దార్థ ప్రతిపత్తి నంది సారస్వతోపాయనముల నర్పింపగల సామర్థ్యమును వారికి ప్రసాదింప శ్రీ కృపావిశేషము ననుసంధించెద—

## సమీక్ష - ౨

'కవిత్వవేది'
బ్రహ్మశ్రీ కల్లూరి వెంకటనారాయణరావు, ఎం. ఏ.

ఆనందమునే జీవకోటి నిరంతరము వాంఛించును. ఆనందానుభూతులను పరికించి, బరిశీలించి, బ్రహ్మానందమే పరమలక్ష్యమని యుత్తమమానవు లుద్ఘోషించిరి. బ్రహ్మము విశ్వవ్యాప్తము. మహావిశాలమగు నా బ్రహ్మానందమనుభవించుటకు, జీవుఁడు బ్రహ్మమే కావలయును. కాని జీవుఁడు బ్రహ్మ కాగలఁడా యను విచికిత్సలో సందేహములు, ప్రబుద్ధులనుసైతము, తొందరపెట్టినవి. ఈ యూర్ధ్వభాగాన్వేషణమును గట్టిపెచి, బయలులోని బ్రహ్మమును తమలోని కీడ్వ నన్వేషకులు బ్రయత్నించి యది సాధ్యమని వక్కాణించిరి. ఆ వక్కాణ యథార్థమైనదని భక్తులు, భాగవతులు, శరణులు నమ్మిరి. వారివారికి బ్రియములగు చారునామోచ్చారణలలో, స్వరతిని జొప్పించి, వారానందమును బొందిరి. ఒకొక్క పవిత్రనామము నొకొక్క పంథకు మూలమై, తచ్ఛబ్ద స్వరతికి బ్రచారముఁ గల్పించినది. యెహోవా, అల్లా, పరమాత్మ, బుద్ధ, నారాయణ, శివ, రామనామము లట్టివ! శివశరణులు, హరిశరణులు, బుద్ధ శ్రమణులు, జైనార్హంతలు, సూఫీవలీలు, భారతదేశమున వేలకువేలు వెలసిరి. ఆయా పల్లెలలో, నాయా మహాత్ముల సమాధు లాసేతుహిమాలయ పర్యంతము నేడును, సర్వమతీయులచేత, పూజితము లగుచునేయున్నవి. ఆయర్చన లన్నియు నానందముకొఱకే! స్వాత్మానందమే వీనిలో నన్నిటను బ్రధానమైనది!

బ్రహ్మానందముమాట యట్లుండ, ఇంద్రియానందము, వాగానందము, మానసికానందము, కాయికానందము, జిహ్వానందము మొదలగునవి మానవులకు నిత్యారాధ్యములై యున్నవి. కనుకనే యుపనిషత్తు 'లానందోబ్రహ్మ'యని సూత్రించినవి.

వైషయికానందము మొదలుకొని బ్రహ్మానందముదాఁక, తానే నిదర్శనమై, దర్శనమివ్వఁగల యాదర్శసర్వానందమయమూర్తిని, భారత లోకము కలియుగారంభముననే, కలలు గన్నది. ఎదురు జూచినది. బ్రహ్మానందమును, వైయక్తికమగు స్వాత్మానందమును, వాఙ్మనఃకాయముల కవసర

మగు వైషయికానందమును, (తౌర్యత్రికమును తన వేణువుగనే తనర) భారతప్రపంచమున కొక్కసారిగా, గొల్లపిల్లవాడుగ నవతరించి, శ్రీకృష్ణుఁడు విశ్వమోహనరూప లీలావిలాస వాఙ్మధురిమలతో ననంతరీతుల ప్రసాదించెను. ఋషులు, భక్తులు, కుటుంబులు, దీనులు, దరిద్రులు, వికలాంగులు, వారు వీరనక విశ్వసించినవారందరును, తరించిరి, ఆనందిరి; దైత్యులు, దుర్జనులు, నాస్తికులు నశించిరి. ఆ జగన్మోహన గోపాలావతార కథావిన్యాసమునే గీర్వాణవాణిలో భాగవతమనిరి. కేరళ వాఙ్మయులు నాభాగవతసారమునే నారాయణీయమనిరి. సంస్కృత భాగవతమును, కారణజన్ముఁడగు పోతన యనువదించెను. ఆంధ్రుల పుణ్యాలోపముచేత నేకాదశస్కంధాదులంతరించి, మిగులు మిగిలినది. ఆ భాగవతసారమగు నారాయణీయమును, పోతన్నవలెనే పరమభాగవతుఁడగు, మేల్పుత్తూరు నారాయణభట్టు, మహితమధురసమాధురీ మంజులమగు నమరభాషాశైలిననుపమముగ, నతిలోకరమణీయముగ, రచించి యుండ, నిర్భరగురుభక్త్యావిర్భూతానందసందర్భులగు, కవిరాజు, శ్రీ కల్లూరి వేంకట సుబ్రహ్మణ్యదీక్షితులు, నిరాఘాటధాటీసమాటోపముతో నిస్తులకమనీయ, నియమితమధుర పదసమన్వయ, నిరర్గళవిన్యాసముతో, తెనుగువారి పుణ్యమాయనునట్లు, తేటతెల్లముగ తెనిగించిరి. ఆ తెలిగింపునకు, రసికావతంసులు, స్వయముగ నుత్తమకవీంద్రులు రాజపదవీమాన్యులు నగు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారూఁతయైరి. అహో! ఎట్టి సమ్మేళనము! బంగారుతమ్మికి పరిమళ మబ్బినది! అచుంబితయగు కుముద కోరకకన్య కనులు విచ్చి యలరునప్పుడే యుదయేందుకిరణము లమృత ప్రకాశము నంకించిన తెఱగున, నాంధ్రీకృత నారాయణీయమునకు నాదికవికి దేవుఁడగు, గురువాయూరు నారాయణుడే, కృతి నంకితమొనర్చుకొన్నాడు. ఈ భాగ్య మదృష్టవంతులకు గాక నొరులకెట్లు ప్రాప్తమగును! కవియు, కవిద్వారాశ్రితుఁడగు పోషకపితయు, కృతియు, ధన్యతగాంచినవి! నారాయణభట్టజన మేజయాదులజాడ్యనివృత్తికితోడ్పడిన గురువాయూరు శ్రీమన్నారాయణుఁడు నిశ్శేషజాడ్యాపహుఁడై నన్ను, నాయట్టి పాఠకులను, శ్రోతలను నుద్ధరించుగాక!

ఆంధ్రీకృతమగు కంబరామాయణము, తమిళసంస్కృతి నాంధ్రుల కెటులందిచ్చినదో యట్లనే యీ నారాయణీయము, కేరళుల హృదయ గాంభీర్యతను మన యెదుట సాక్షాత్కరింపచేయుచున్నది. కవి యెంతటివాడేని, కాలదేశవ్యవహారపరిస్థితుల కించుకయేని బద్ధుఁడు, బాధ్యుడు కాక తప్పదు.

"నిన్నొరయ నెన్నరని యాచకాధములు దేవోద్యాన పాళీవిటుల్"
"యన్యుల్ మది తర్కచర్చ—జన్మశతమం దీడేరుచుం ద్రీశ్వరా"
"భక్త్యాత్మక యోగమే సతత మాస్వాద్యంబు"

అను మాటలలో కవి కాలపు, శుష్క వేదాంతుల యొక్క యర్థ రహితా ద్వైత చర్చలును, పంచమ దశకములో, అర్చిరాదిగతి నుగ్గడించుటచే భక్తి యోగముపై యా కాలపు జనులకుగల యభిమానమును వెల్లడియగుచున్నవి. ఇది దిక్ప్రదర్శనము మాత్రమే !

నాకు, కవిరాజు దీక్షితులు, విజయవాడలో పరిచితులైరి. తొలిచూపుల లోనే యమలిన మొక యనురాగము నామది నలముకొనినది. నన్నొక మండ లాధికారిగా నాతఁడు చూడలేదు. రసికుడననియే యాతని దృష్టి! మొదటి సమావేశముననే తానేదో సభలో నవసరముగ రచించిన యొక వృత్తమాలను వినిపించినారు. ఆ శబ్దధార మా యవ్యాజ స్నేహమువలెనే యచర్చనీయావ్యక్త వ్యక్త మాధుర్యమై, నా శ్రుతికి హాయి నొదవించినది. అప్పుడే నేనంటినికదా, మీరేదేని మహాకావ్యమును బల్కుఁడది రసవత్తరముగ భాసిల్లునని ! నా యభిలాష ఫలోన్ముఖమై, యీ నారాయణీయ ఫలము వారి స్వీయ సారస్వతోద్యాన రసాలమునుండి విగళితమై యాంధ్రుల దోసిటఁ బడినది. నేనెట్టి వాఙ్మాధుర్య మీ కవిరాజు వాక్కులలో నుల్లసించునని యనుకొంటినో యంతయు నించుమించుగా నారాయణీయమున నంతర్లీనమై స్రవించుచున్నది. విజయవాడయు మధురములగు రసాల కాటపట్టు నమ్మొడుశాల యనుట సార్వజనీనమే ! కాని యిది సామాన్యమైనదికాదు. భక్తి రసాలయము ! ఒకప్పు డోరుగల్లులో సాధ్యపడక యొంటిమిట్టలో శ్రుతి గోచరమైన మధుర గానమే మరల నీ నారాయణీయమున దాదాత్మ్యముంది యించుక విస్పష్ట ముగ వినవచ్చుచున్నదనియే నా తలంపు !

శ్రీకృష్ణకర్ణామృతములో, భర్తృహరి సుభాషితాంధ్రీకరణములో, భద్రాద్రిగోపన్నగారి దాశరథీశతకములో, ముఖ్యముగా, పోతనభాగవతములో ప్రతిబింబించిన తెలుఁగు నుడికారపు (గీర్వాణ వాణీ సమ్మేళనకాలపు) నిసర్గ మాధురి యిందును లీనమై, కృతికొక వైశిష్ట్యమును ప్రతిపాదించుచున్నది. కృతియో ప్రసిద్ధమైనది. కవికి దానిని సవరించు నధికారమూ లేదు ! కాని యుదాహృత విషయమును, ఆది గ్రంథములో వలెనే విశదముగ, మధురముగ,

హృదయంగమముగ పాడుటయందే విశేషము కలదు. ఆ విశేష మీ కృతిలో స్ఫుటమై, పాఠకులకు విందొనరించుచు, ఆంధ్రీకరణప్రయోజనపారమ్యమును నిస్సందేహముగ సాధించినది. కావుననే నారాయణీయ మాంధ్రలోకమునకు సమ్మాన్య మగుచున్నది!

అందు ఆశ్చర్య మేమియు లేదు! కవియే చెప్పుకొన్నాడు కదా! "మధు రాంధ్ర వచఃశ్రుతి మేళవించి, వాణీకరకంకణక్వణన నిస్స్రుతతాళలయానుకూల, తంత్రీకుల నిస్సరత్ స్వరధునీమయ తానవితాన మూర్ఛనా, ప్రాకట రాగ, భావమయ భక్తి విపంచి వహించి మీటితి" నని! ఔనౌను! "తత్త్వమాకందము దయారస మూలకందమైనది! భావుకులు సుగ్రహమైన విగ్రహమునందే తన్మ యులు! సుధాంభస్సింధు పూరమ్ములు! చిద్రసార్ద్రమధురమ్ములు! కందొవకు నందియు నందనివి! "అందును భూమియందు జలమందున వెల్గున గాలి నాకస మ్మందు మహత్తునం బ్రకృతియం" దనుచో భాగవతసప్తమస్కంధము మనస్సును దాకుచున్నది! జలదశ్యామ కలాయ కోమల కలాచక్రములను, తామరతంపరగాగ జీవదేహములను, నాసీమాంతవిశ్వమ్మును, చూచు చున్నాము. "అభంగభంగరుఘనచక్ర క్రాంతి భ్రామ్యత్తిమింగిలకల్లోలితమైన జలముల"లో నిల్చి వరాహమూర్తి "వందిబృందముల కచ్చపువెన్నెల లార బోసినాఁడు!" "అత్యుచ్చైః పాతితముష్టిఘాతములు." కర్ణతాడితములగుచునే యున్నవి. కూటకిటి "దేవవిద్విషత్కీటము గీటునబుచ్చిన" తర్వాత "బంధమగుఁ మనమ్ము గుణ బంధమునఁ బడెనేని" యన్నాఁడు కపిలుఁడు. పద్యాంతర నవరణ మనవసర మనుకొందును. పలనన భక్తియోగ మీ ఒందము ద్రెంచు నన్నది స్పష్టముగనే యున్నది. "కంతు డనంత లీలలఁ రంతులు సేసియుఁ ముని మొల్కనవ్వులచే నూర్వశిని పుట్టించినాఁడు. ధ్రువ ఋషభాదుల చరిత్రలు మనోహరములుగా కథితములైనవి. "నభోవలయోల్లంఘి ఘనాఘన ప్రతిఘన ప్రధ్వాన నిర్ధావితాఖిల ఘోరాసురమౌ" నృసింహ లీలయు, గరుత్మద్వాహనా రూఢుఁడై శ్రీహరి సార్వాత్మ్యముతో దీపించుటయు, గుభులు గుభుల్లటంచు దుగ్ధపయోధిని ద్రచ్చుటయు, మోహినీ వామన పరశురామ రామావతార ములును, ముగిసిపోయినవి. 37 వ దశకమున నారంభమైన శ్రీకృష్ణ కథా మృతము, 90 వ దశకము వరకు, నేకనిర్ఝరిణిగా ప్రవహించినది. అయిదు వందల యేబది పద్యము లమోఘవాక్పటిమతో జాలువారినవి. చిప్పిలుకొంచు, వలనొప్పఁ, పచ్చని పచ్చికల్. చారువిలోకనల్, ఓయి చిరాయువై మనగ

దోయి, నీ దరికేగుదెంచు, అదుగో గోచరమయ్యె మున్నగు పద్యములలో తెలుగుందన మాస్వాద్యమే కాని యూరక చెప్పిన తనివితీరు టెట్లు? 69 వ దశకము రాసక్రీడలోని పద్యము లన్నియు భావానుగుణములై, రసోన్మాదముతో, శబ్దార్థ సమైక్యతలో సమసించినవి. మన మనస్సులు కూడా 'కుతుకాకులమ్ము' లగుచున్నవి. ఆపిదప తత్త్వబోధనలో కూడ కవి తన చేయి నవలీలగా నెత్తి, కథా విపంచిలో శ్రుతిని గల్పినాడు; "ఏమే మబ్బిన నీక యర్పితము తండ్రీ!" యనుటలో శరణాగతి పరాకాష్ఠను వర్ణించినాఁడు. ఆ శ్రీకృష్ణుని "కృపా కల్లోలస్మితమునకు ముగ్ధుఁడై, నారాయణభట్టుతో తాదాత్మ్యమొంది, యతఁ డనని మంత్రరహస్యమును బయలు వెట్టుచు, "నాలీన శ్రీరశనాలలన్మణిగణ క్లీం కింకిణీ నిస్వనం"డగు భగవానుని కవి ధ్యానించినాఁడు. గ్రంథము మంగళాష్టకముతో శాంతించినది. శ్రీ గురు కృప కవి కృతి కొక సోయగము సంపాదించి పెట్టినది.

సహృదయులగు పాఠకులకు నతులితానంద సంధాయకంబు, శబ్ద బ్రహ్మ కళోపాసనాధామము నగు నారాయణీయాంధ్రీకృతి సార్థకము, రసోల్లసితము, మధురభావ బంధురము, దివ్యధారా శృంగార సముజ్జ్వలమునై యలరారు చున్నదనుట నిస్సంశయము. మనమును కవితోపా టిట్లందము గాక!

"కురుతా మాయు రనామయం కృతిరియం వో బ్రహ్మవిద్యాంశ్రియం"

స్వకపోల కల్పిత కథారచయితలకు సుప్రయోజ్య శబ్దస్ఫూర్తి, రమణీయార్థ విస్తృతి, వివిధభావావిష్కరణానుగుణ రససంపూర్తి యావశ్యకములు- ఒక్క భావములు తప్ప తక్కినవన్నియు సదనువాదులకు గూడ నావశ్యకములే కదా! భావములు మార్చుట కనువాదులకు నాంధ్రీకరణ కర్తలకు, నభిలషణీయము కాదు, కాని యాద్యగ్రంథములోని యున్నతిని, మధురిమను, నూతన భాషలోనికి వడపోయుట సామాన్యకార్యము కాదు. వాల్మీకి రామాయణము నేటికిని సమగ్ర రామణీయకతతో తెలిగింపబడలేదన్న నసత్యోక్తి కాదు, కాన సరియైన తెలిగింపు- (తొలి కావ్యములోని వలపులు మలి కావ్యమున నుండునట్లు సేత)- సులభసాధ్యము కాదు. అయినను దుర్ఘటమగు నీ యత్న మీ యాంధ్ర నారాయణీయ కర్త కవిఘ్నముగ నెఱవేరినది. కావ్యము మనోహరముగా సాగిపోయి, కవిరాజు సిద్ధహస్తమును జయమాల యలంకరించినది.

ఓం స్వస్తి

# వినతి - వినుతి

ఏతాదృశ భక్తికృతి మూలాధారమున రసనిస్రుతిం ధీ ప్రేరకులై యస్మద్భాగ్య విధాతలై, కృతి సమర్పణ మహోత్సవమునకు నే నేగునపుడు చెన్నపురిలో మైలాపూరు సంస్కృత కళాశాలలో త్రిపురసుందరీ చంద్రమౌళీశ్వర పరమాధిష్ఠానమగు స్వాధిష్ఠానమున నాకు దర్శనమిచ్చి, నారాయణీయ 'రాసక్రీడా' ఘట్ట సంఘటిత శ్లోకమణిపూరమున గంధర్వకన్యలనఁదగు నిద్దరు దాక్షిణాత్య కన్యల మధురతర సంగీతభంగిమ నవధరించు నెపమున స్వయోగ విభూతి నా యనుభూతికి వచ్చున ట్లేతత్కృతి సమర్పణోత్సవమున కతర్కి తోపనత ప్రథమ మంగళము గావించి నన్నాదరించి;

"భగవదనుధావ"నా ద్య్యుజ్జ్వల రసభరిత భగవత్ప్రబంధకవి, గీర్వాణ రసధుని ఉత్రవిడియం కృష్ణశాస్త్రి మహోదయులను అభినవోద్ధవావతారులను కృతికర్తృ స్వీకర్తలకు భక్తులకును స్వప్రసాద మునిచి కేరళమునకు నాతో ననిచి నాపై కృప ననాహతస్థాన హృదయంగమము సేసి;

కృతి సమర్పణానంతరము సోదరుల మేము మరలివచ్చునపు డచ్చటనే కైలాసగిరి శంకరులువోలె ననేక సహస్ర భక్తగణ పరివేష్టితులై సభామండప మున నధిష్ఠించి, గురువాయూరు కృతివిశేషములను మా వానిచే నచుంబిత మగు తమిళమునఁ బలికించి హసించియు, నారాయణీయ ప్రథమ శ్లోకాంధ్ర పద్యముల నాచేఁ జదివించి యాంధ్ర ద్రవిడ కేరళ రాష్ట్రముల వైజ్ఞానిక మైత్రి నుగ్గడించి, యనిర్వచనీయ వచన రచన సమ్మోహన మొనరించి, రామకృష్ణ బహూకృతములయిన బంగరు శాలువలను స్వహస్త కమల స్పర్శమ్ముగ విశుద్ధ తేజమ్మునించి మమ్ముఁ గైసేయించి, పరమ మంగళాశాసనము నొనరించి:—

ఆ వెంటనే వేద ధర్మశాస్త్ర పరిపాలనసభ కాధ్యక్షమ్ము వహింప నాజ్ఞామధురముగఁ గేరళరాజ్య పాలకులను సన్నిధికి రావించుకొని కటాక్షించిన;

శ్రీ శ్రీ శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వర జగద్గురు శంకరాచార్య గురుదేవుల దివ్యచరణ సహస్రార మకరంద రసధారాసారముల క్షణక్షణ పునః పున రున్మజ్జనము గావించుచు సాష్టాంగ ప్రణతుండ నగుచుండెద.

ఏ మహానుభావునియం దాబాల్య మలవడిన భక్తి నాచే నీ గ్రంథముం బలికించెనో యట్టి యాంధ్ర భాగవత కర్తయగు బమ్మెరపోతరాజు కవిరాజునకు వినతిసేసి యిట్లు వినుతించెద.

అపర శుకావతారమది యాంధ్ర సరస్వతి నోముపంట మ
త్తపముల రాశి భక్తి కవితారసవాహిని రామకల్ప పా
దప సముపాసనాత్త పరతత్త్వఫలంబు దరిద్రదేవతా
కుపిత దురంత సంసృతి నఖండ కళాకృతి నెంతుఁ బోతనన్.

లేతవయస్సునన్ జనని లేపిన మానస రాజహంస మా
పోతన వాక్సుధాలహరి పొందున సారము లానియాని యు
ద్ద్యోతితమై ముకుంద పదతోయజ శయ్యల నోలి వ్రాలి యే
కూతలు కూయునో యెఱుఁగఁ గోవిదు లోపిక నోపి కావరే.

నాకృతి నుపలక్షించి వాత్సల్య రసాసేచనమున నన్నును గృతిస్వీకర్తలను దీవించుచు, సువిపులమైన 'భూమికను' రచించిన నిరతిశయగుణ భూషణులు గవితాభూషణులునగు బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రులవారిని గూర్చిన నా భావోన్మేషమిది:

నాలోపమ్ము లెఱుంగఁజెప్పి మఱియున్ నా యూహలోలేని యం
దాలన్ వ్యాఖ్య యొనర్చి సద్గురు కృపాధారామృతాప్లావ మిం
దాలక్షించి కటాక్షమున్ నెఱపి నాయం దంతరంగమ్ము మా
ర్మూలన్ నక్కిన చీఁకటుల్ దొలఁచు సూర్యున్గొల్తు ధీవర్యునిన్.

రవియౌచున్ గవియౌచు వ్యాకరణ మర్యాదన్ బ్రయోగప్రమే
య విధిన్ దాన ప్రమాణమై సహృదయుఁడై యవ్యాజ వాత్సల్య పూ
ర్ణ విలోకమ్ముల నాదరించిన బుధున్ బ్రాక్పుణ్య సంబంధి మా
కవితాభూషణు వెంపరాల కవిలోక గ్రామణిన్ గొల్చెదన్.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తునం దాంధ్ర సాహిత్య విభాగమునం దాచార్యులై, అస్మదాంధ్ర సాహితీ ప్రథమోపదేష్టలై, నిరవధిక వాత్సల్య రసనిధియు సౌజన్యావధియునై నా కృతిని "పరిచయము" నొనరించి మమ్ము దీవించిన బ్రహ్మశ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రులవారికిఁ బ్రాంజలి నయ్యెదను.

ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహకర్తలయి కవిత్వవేదిగ విద్వన్మాత్ర విదితులయి విద్యాశాఖాధికృతులయి 'అశోకచరిత్ర' మను నవ్యాంధ్ర ప్రబంధమును రచించిన బహుభాషాభిజ్ఞులు, మత్కృతిని సమీక్షించి యెనలేని నెనరున నన్ను "కవిరా"జని ముచ్చటగొని యాశీర్వదించిన ఋషికల్పులగు బ్రహ్మశ్రీ కల్లూరి వెంకట నారాయణరావు ఎమ్. ఏ. గారిని సాంజలిబంధముగ సంభావించువాఁడను.

ఉపాసకులయి, ఉదారభావ గంభీరముగ నా కృతికి సమీక్ష రచించిన నా సహాధ్యాపకులు నాప్తులు విద్యాప్రవీణులగు బ్రహ్మశ్రీ చివుకుల సుబ్బరామ శాస్త్రులవారికి నా ప్రణతులు.

అజంతా ముద్రణాలయాధిపతులయి, ప్రత్యక్షర పర్యవేక్షణ మొనర్చి నాగ్రంథమున కీయందచందములు తీర్చి దిద్దుటయేకాక మత్కవితం బ్రశంసించిన శ్రీనివాససోదర శతావధానులకు మత్ప్రశంసలు.

ఈ కృతి సుందరిని స్వీకరించి సర్వాంగసుందరముగ నలంకరించి సకుటుంబ సపరివారులై యనుపమ రాజలాంఛనములతో నఖండ భక్తి వైభవముతో శ్రీ గురువాయూరు శ్రీకృష్ణదేవు నర్థాంగి నొనరించి తత్సన్నిధానమున (ది 13-10-57 తేదీన) బరమోత్సవము గావించిన కేరళ రాజ్యపాలకులగు శ్రీ రామకృష్ణరావు మహాశయులను, దత్పురస్సరముగ మమ్మును ఆశీర్వదించిన మహాశయులలో ప్రప్రథమ గణనీయులు, శతవృద్ధులు, శతాధిక గ్రంథకర్తలు, ఆంధ్ర ప్రభుత్వాస్థానకవి, మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమేత్యాది బిరుదావళీ విరాజమానులును. మదీయమగు నొకానొక కృతిని దమంత వలచి చేఁబట్టిన యస్మదీయవంశ దౌహిత్రులు నగు బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికి నా ప్రణతులు.

వేదార్థ ప్రవచన నిపుణులు, శ్రీ తంగిరాల వీరరాఘవ ప్రతిష్ఠిత శ్రీరామ సాంగవేద పాఠశాలా ప్రధానాచార్యులు నగు బ్రహ్మశ్రీ కుప్పా లక్ష్మావధానులవారు తంతి మూలమున మమ్మి ట్లాశీర్వదించిరి.

"సమానానా ముత్తమ శ్లోకోఽస్తు"

శ్లో. కృతిస్సుకృతితా మీయా దర్పితా స్వయ మీశ్వరే
భవతాం కృతితాం నేయా దద్వితీయ పదాంచితా

ధియాం ప్రచోదయిత్రీ యా సావిత్రీ రజసఃపరా
వరదా వ స్సదా పాయాత్ సచ్చిదానంద సంపదా॥

బహుముఖ గ్రంథరచనఁ గవితాసవ్యసాచి యనఁదగు కవిసమ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ ఎమ్. ఏ. గారిట్లు మమ్ము దీవించిరి.

అహారారంభములం దనౌపనిషదంబై పొల్చి యీకర్మయున్
దహరోపాసనయే, విరించితరుణీ తాత్పర్య చింతా ముహు
ర్ముహు రాసంచర దున్మనీచరమదిక్పుష్యద్రస స్రోతసీ
లహరీస్వాదుతరంగ మజ్జనమనోలావణ్య నిర్వాణమై.

మలయాపత్యకలందు మీనిలయ మీ మాత్రంబు సంధింప దే
యలఘుస్వాదువు నిర్వృతిన్ గృతిపతిత్వానందమున్ దీక్షితో
జ్జ్వల వాక్పేశలతా లతాసుమ లసద్ బాహోపరీరంభ మా
వల నారాయణ సత్కృపావిమల సంభారమ్ము రెట్టింపగన్.

ప్రత్యగాత్మ బహిర్ముఖత్వ ప్రధాన
అపర శివమూర్తి శారద విపులజఘన
ఆత్మ సముపసంహృతినిదానార్ద్ర రస జ
గ ద్విహారిణి మీయందుఁ గలుగుఁ గాక.

దివ్యవాణి సంపాదకులగు శ్రీ చివుకుల అప్పయ్యశాస్త్రివర్యు లిట్లనిరి :

చరితంబా యఘనాశనంబు, కవితా సాహిత్యయుక్తంబు వై
ఖరియా క్రమము, పాకమా మధురసాక్రాంతంబు సారాంశమా
నర వాంఛాదము, రామకృష్ణ ధృతత న్నారాయణీయంబు క
ల్లూరి సోదర సుధీకృతంబు విలసిల్లుం గాత మాచంద్రముఞా.

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మహోదయు లిట్లు దీవించిరి.

శ్రీ నారాయణభట్ట కేరళ కవిః సంఖ్యావతా మగ్రణీః
నిర్మాయామృత పేశలాం సుమహతీం నారాయణీయాం కృతిమ్
భక్త్యుత్తేజిత భావ బంధురమయీం కంఠే నిబధ్నఞ హరేః
గుర్వాయూరధిపస్య ధన్యజనుషామగ్రేసరోఽభూ త్సదా.

కల్లూర్యన్వయదుగ్ధ సింధుశశి సుబ్రహ్మణ్యా కవ్యాగ్రణీః
బ్రహ్మణ్యా స్తదనన్యభావభరితః కావ్యం మహాంధ్ర్యాం ముదా
భక్త్యా సూద్యచ రామకృష్ణసుధియే ప్రీత్యార్పయత్; శ్రీహరిః
భర్తుః కర్తు రపి ప్రియం వితనుతా మాచంద్రతారార్యమమ్.

ఇట్లు మాయెడ చెలికారము పాటించిన ధరై శ్మకధిషణులై యిప్పుడిప్పుడు సుకవితా పల్లభులగుచున్న శ్రీ జటావల్లభుల పురుషోత్తము ఎం. ఏ. గారును నా గ్రంథము నామూలాగ్రము పఠించి సుహృద్భావ మధురమగు విమర్శము రచించియున్నారు. సమకాలికవిద్వత్సహాకవి బృందమునకెల్ల వందనము లర్పించుచున్నాను.

ఇట్లే మమ్మభినందించిన;

అలౌకిక భాషారసజ్ఞ శేఖరులయి, లౌకిక పదవీ సమధిరూఢులయిన వారిలో ప్రకృత మాంధ్రదేశ లెజిస్లేటివ్ కౌన్సిల్ అధినేతలయి, కృతిస్వీకర్తకుం గూర్చు మిత్రులయి యాంధ్రోద్యమ జాంబవంతులగు "పద్మభూషణ" శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ పింగళి లక్ష్మీకాంతము ఎమ్. ఏ, వాణిజ్య సంఘాధి నేతలగు శ్రీ జె. వి. సోమయాజులు, పంచాగ్నుల సూర్య నారాయణ, పరసా వెంకటేశ్వరరావు, దేవాదాయ శాఖానియుక్తులగు శ్రీ జి. యస్. ఎన్. రామమూర్తి ప్రభృతులును మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తియై తత్కాల మద్రాసు గవర్నరు పదవీ సమధిష్ఠితులగు. శ్రీ పి. వి. రాజమన్నారు, ఆంధ్రప్రదేశ విద్యామంత్రివరులగు శ్రీ ఎస్. బి. పి పట్టాభిరామారావు, బి. ఎ., బి. ఎల్. దేవాదాయ కమీషనర్ పైడి లక్ష్మయ్య ప్రభృతులగు సారస్వత రసికావసంతులగు నశేష మిత్రశ్రేణికి నా ప్రత్యభి నందనములు.

రాష్ట్రాభిమానమున నాత్మీయుఁడగు నారాయణ నంబూద్రిపాదుని రచనకు వ్యాప్తికోరి, యాంధ్రుల మైత్రికోరి యుభయరాష్ట్ర రాజకీయ సమరస సమభినివేశములచే నాకృతి నాదరించి బహుసహస్రార్థ సమర్థముగ నన్ను సత్కరించి తక్కిన రాష్ట్ర ప్రభుత్వములకు మార్గదర్శకమయిన కేరళరాష్ట్ర ప్రజాహిత మంత్రివర్గమునకును గురువాయూరు దేవస్వం కమిటీ అధ్యక్షులగు శ్రీ కాలికట్టు రాజాగారికిని నా కృతజ్ఞత దెలుపుచున్నాను.

తిరువనంతపురమున శ్రీ అనంతపద్మనాభుని చరణారవింద సన్నిధాన మున పౌరజన మహాసభగూర్చి, మళయాళ భాషానువాదముతో సంస్కృత మూలము, నా యనువాదమును బఠింపఁజేసి పరమానంద భరితులై బహుముఖ ముల నన్ను సంభావించుటయే కాక, నారాయణ భట్టపాదుని చరిత్రము నాంగ్ల మున రచించి యిచ్చిన త్రివేంద్రము ప్రాచ్యపుస్తకాలయాధినేత లగు శ్రీ ఎస్. కుంజన్ పిళ్ళెగారును తత్పూర్వాధి కృతులగు శ్రీ గోపాల పిళ్ళెగారును నచట నన్నుం గలిసికొనిన సకల మళయాళ విద్వత్కవి మిత్రులును, కేరళ దేశస్థిత కన్యాకుమారి ప్రభృతి దివ్యక్షేత్రాది సందర్శనమున నాకు బాసటయై నాకాప్త మిత్రములైన శ్రీ గవర్నరు మహాశయుల కాంతరంగిక కార్య దర్శులైన సౌజన్యమాన్యులగు శ్రీ అవసరాల అనంత కామేశ్వరరావుగారును మత్ప్రశంసాపాత్రు లగుచున్నారు.

మున్నును నేఁడును ఇఁకముందును నేతత్కృతి యంద చందముల కానందించి దీనికి శాశ్వతస్థితిం గల్పించి నన్నుం ధన్యుంజేయఁగల యనసూయు లగు కవులకు, సాధూత్తములగు భక్తులకు, సాధ్వీమతల్లులకు నా వినతి వినుతు లర్పించుచున్నాను.

ఇట్లు
కృతికర్త

★

# దీవన

ఆబాల్య భాగవతోపాసకుఁడయి, యనవరత పురాణోపన్యాసములందు మత్కవితా విన్యాస మొనర్చుచు, వ్యాస భాగవతమును, పోతన భాగవతమును సమీకరించి యీ మత్కృతిని తాత్పర్యార్థ విశేషార్థ వివరణములతో సర్వ మధురము సర్వ సులభము నొనరించుచున్న నాయనుజన్ముఁడగు చిరంజీవి వీరభద్రుని భాగవతవిమర్శ గురుకృపచే గ్రంథస్థమయి యేతద్గ్రంథ సంకలిత మగుఁగాక యని యాశాసించుచున్నాను.

శ్రీ అనంతలక్ష్మి రామకృష్ణరావు పుణ్యదంపతుల కనుంగు చిన్నారి బిడ్డడై శృంగగిరి పీఠాధీశ్వర చంద్రశేఖర భారతీ జగద్గురు శంకరాచార్య స్వామివారి ప్రసాదమున నుదయమందిన చిరంజీవి లక్ష్మీనారాయణరావు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా నేతచ్ఛుభ ప్రసంగమున నిట్లు దీవించెదను.

హేమలంబే శరత్కృష్ణ పంచమ్యాం భానువాసరే
రోహిణ్యాం మత్కృతి రియం దత్తా నారాయణప్రభోః.

లక్ష్మీనారాయణ స్సాక్షా ల్లక్ష్మీనారాయణం శిశుం
లాలయే ద్రామకృష్ణాఖ్య దంపత్యోః కులభూషణమ్.

శ్రీ నారాయణ నాభి పంకజమునన్ గ్రీడించు విన్నాణి ల
క్ష్మీనారాయణు నస్మదీయ కృతికిం జిన్నన్న దీర్ఘాయువుం
గా నేలున్ మఱి శారదాజనని స్తన్యమ్మిచ్చి లాలించు బ్ర
హ్మానందంబు గురుప్రసాదమయి సర్వైశ్వర్యమై కూడగన్.

ఏతద్గ్రంథ రూపమునఁ బ్రసక్తికి వచ్చిన యిందరను మమ్మందరను నపార కరుణా కటాక్ష వీక్షణ ప్రసార మొనరించి యాత్మోన్ముఖులగావించుకొని సకల కల్యాణ భాజనుల నొనర్పుమని "శ్రీ గురువాయూరప్పన్" పదసమభిధేయమగు మా కృష్ణప్ప నభ్యర్థించుచున్నాను.

ఇట్లు
కృతికర్త

---

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోనమః

# నారాయణీయము

## మఙ్గళాచరణము

 సంపన్మయి వాఙ్మయిన్ శివమయిన్ సేవింతు మశ్రాంతమున్
శ్రీ సూక్తార్థ నిధానయై సుకవితా శ్రేయఃపదాధానయై
వ్యాసప్రోక్త పురాణభాగవత లక్ష్యాద్వైత సంధాన యై
హాసోల్లాస కటాక్ష దృష్టి నణిమాద్యైశ్వర్యముల్ గూర్పగన్. ౧

శ్రీ వాత్సల్య కటాక్షవీక్షణ సుధారేఖోచ్ఛలత్ క్షీరపా
రావారాయిత విశ్వభాగవత సామ్రాజ్యాధికారమ్మునం
దావాసింపఁగఁజేసి యేలుత సమగ్రైశ్వర్య సంపన్నుగా
సేవానమ్రుని బూర్గులాన్వయమణిన్ శ్రీ రామకృష్ణాగ్రణిన్. ౨

శ్రీనేత్రాంచల కాంతి పూరములలో శ్రీ వేంకటాద్రీశ్వరుం
డానాకాధిపమౌళి కోటిగుణితోద్య త్పద్మరాగ ప్రభా
మ్లాన స్వీయ విలోల దివ్యవనమాలా లాలితాంఘ్రిద్వయీ
వ్యానమ్రున్ గరుణించి యేలు నిలువేల్పై రామకృష్ణ ప్రభున్. ౩

గురువాయూరు పురాధిదైవత కృపాకూపార ముప్పొంగి సా
గరకన్యా కరుణాకటాక్ష సుషమా కల్యాణ దృక్చంద్రికన్
నిరతిన్ గొల్చుత రత్నదీపకళికల్ నీరాజన మ్మిచ్చి భూ
సుర రాట్పుంగవుఁ గేరళోద్ధరణధీశోభాయశోభార్గవున్. ౪

వెలుఁగుల్ దొంగిలి వేడివేలు పలుకన్ వే మూషికాకారుఁడై
బిలముం జొచ్చెఁ; నతండు వాహనముగా విచ్చేసె నయ్యెల్ల వే
ల్పులకున్ వెల్గగు నాత్మయే గణపతిస్ఫూర్తిన్ "గణానా" మనం
గల మంత్రార్థము యజ్ఞవిఘ్న మడఁపన్; గైమోడ్తు నమ్మూర్తికిన్. ౩

ప్రణవమ్మై శ్రుతియై స్వరప్రచురమై రాగమ్మునై తానమూ
ర్ఛనలై భావము వ్యక్తి పల్లవియునై రంజిల్లి సంకీర్తన
మ్మన నౌచున్ లయమంది యా ప్రణవమం దానంద సాంద్రైక చి
ద్ఘనమౌ వాణివిపంచి వాగ్భవకళన్ ధ్యానింతు నిష్టార్థినై. ౪

చిననా డెప్పుడొ స్వప్నజాగృతుల కించిత్సంధిలో ముందుఁ దో
చెను లేనవ్వుల వెన్నెలల్ గురియుచున్ శ్రీనాసికామౌక్తిక
మ్మెనయంగా నరుణాధరస్ఫురణతో నేమేని నన్ బల్కరిం
చిన జాడన్ విలసించె; వాణియగు; నాసీమంతినిన్ మ్రొక్కెదన్. ౫

తెలుఁ గాబాల్యము తీర్చి సంస్కృతములోఁ దియ్యందనమ్మెల్ల నా
కలమం దుంచి స్వకీర్తనాభ్యుదయ సంస్కారంబుఁ బండించి న
న్నలరించెన్ గురు సత్కృపాలహరి నోలాడించి యేయమ్మ జ
న్మలయ మ్మిచ్చిన దిందుచూడ యది శ్రీమాతన్ గురున్ గొల్చెదన్. ౬

కవితారీతి సరస్వతీచరణముల్ గైసేసి కైసేయు నీ
భవ మం చానతియిచ్చి సారకరుణాపారస్మితజ్యోత్స్నికా
చ్ఛవి నంతర్గతగాఢమోహతమముం జక్కాడి యాలోచనో
త్సవముం జేసిన చంద్రశేఖరయతీంద్ర స్వాములన్ మ్రొక్కెదన్. ౭

ఎన్నేభాషలఁ దీర్చిదిద్దినను గా దెన్నేని జన్మమ్ములం
దన్నా పాడినఁ దీర దాకృపకు లేదప్పా ! మతేసామ్యమున్
సునైన్ఁ జన్మము లెల్ల దుఃఖజలధుల్ శుష్కింపఁగాఁజేయు నా
పన్నానీకశరణ్యమైన గురుదైవజ్యోతులన్ మ్రొక్కెదన్. ౧౦

* నాకవితా లతావనమునం దొలుదొల్త వసంత మయ్యె మా
ఱాకు దొడంగె మొగ్గ విరియై విరిసెన్ నును పచ్చితేనె విం
దై కొసరించె వేలుపుల నట్టి శుభాగమ మంత్రవాదమౌ
కోకిల నెంచెదన్ జిలుకకుం బ్రణతుల్ పచరించెదన్ మదిన్. ౧౧

గీర్వాణాంధ్ర సనాతనాద్యతన సూక్తి బ్రహ్మలన్ నిచ్చలున్
బౌర్వాపర్య మెఱింగి మ్రొక్కెదను మత్ప్రారిప్సితగ్రంథ గాం
ధర్వమ్మందు శ్రుతిస్వరూపమున నంతర్లీనమై తద్వచ
స్సర్వాంగీణ రసప్రసార మమృతాస్వాదమ్ముఁ జేకూర్పఁగన్. ౧౨

నలువకు నాల్గునాల్కలట నర్తనమాడెడు నీ తనుప్రభల్
తలకొకదారి వింతగతులన్ మెరయించిన మోసపోయి వా
దులుగొని మచ్చరింతురు బుధుల్ తదుదగ్ర రుషాతమమ్ముపై
వెలువడు నీదు చిర్నగవు వెన్నెల పండువు మాకు భారతీ ! ౧౩

---

* మునుమున్ నాకవితాలతావనమునన్ బొల్పౌ వసంతోదయ
మ్మున మారాకు దొడంగె మొగ్గవిరిసెన్ బూఁదేనియల్ విందు సే
సెను గీర్వాణుల కట్టి యుత్సవశుభశ్రీ కెల్ల పుణ్యాహవా
చనమౌ కోకిల నెంచెదన్ జిలుకకున్ సాష్టాంగమై మ్రొక్కెదన్.

అల భద్రాచల రామదాసు మఱియా త్యాగయ్యఁ బోతన్న వ్యా
సుల వాల్మీకుల శ్రీ శుకుం దెలిపి లోఁజొక్కించె లీలాశుకో
క్తుల కర్ణామృతముం బొనర్చినది మాకుం జిన్ననా డమ్మ; యా
కళ యేకొంచెమునేని నాకవితలోఁ గన్పించెనా ధన్యుఁడన్. ౧౪

మునుల జీర్ణకుటీరముల ముంగిళులు విశ్వ
విద్యాలయమ్ములై వెలయునాడు
ఋషి శేఖ రోదార హృదయసీమలు జ్ఞాన
భాండారములనంగ వరలునాడు
తపసు లాత్మీయచైతన్య విద్యుద్దీప
కళజోపి తమమెల్ల గడపునాడు
మువి ముఖాబ్జముల జాల్కొను బ్రహ్మకళ కళా
వ్యాఖ్యాన పఙ్క్తులు వ్రాయునాడు
కపటమెఱుఁగక పొరపాటుగనక జ్ఞప్తి
పూను శుకపఙ్క్తి సహపాఠి యైననాడు
నంటినది యొక్క యక్షరమదిదలంతు
భారతీయార్ష సంస్కృతి పరిఢవిల్లి. ౧౫

## కృతిస్వీకర్తృ ప్రశంస

మనసై యిచ్చెను రామతారకమహామంత్రమ్ము నాకాప్తుఁడై
మనుపంగా నొక వైష్ణవాన్వయశిరోమాణిక్య; మాపుణ్య సా
ధనలెల్లన్ ఫలరూపమై హరిహరాద్వైతానుభావంబు నిం
చెను నాలో నది హేతువై ఋషుల యాశీర్వాద మబ్బెన్దుదిన్. ౧౬

మా మాతామహ పుణ్యవర్గమగు కంభంపాటివారందఱున్
శ్రీమద్భాగవతాఖ్య భక్త్యుపనిష త్సిద్ధాంత లక్ష్యైక శో
భా ముగ్ధుల్, మఱి భక్తిసూత్రఋషి తద్వంశ్యుండు శాండిల్యుఁ డి
ట్లా మార్గమ్మున వారి కాపులు విశిష్టాద్వైతులై రందఱున్. ౧౭

వా రఖిలాంధ్ర రాజ్య పరిపాలన దక్షులు గోలకొండవ్యా
పారులు విష్ణుభక్తి పరిపాక వినిస్సృత సంస్కృతాంధ్రభా
షా రసనీయ కావ్య వికసత్కవితా రసికావతంసు లం
భోరుహగర్భవంశ మణిభూషణు లాశ్రితవంశపోషణుల్. ౧౮

సత్త్వమయ విష్ణుభక్తి తేజస్సు నాట్య
మాడుచుండును దత్త్రిపుండ్రాంక ముగ్ధ
మధుర మోహన వదనబింబమ్ములందుఁ
గులుకు లేనవ్వు తఱపి వెన్నెలలు గాయ. ౧౯

వరుసలు వెట్టి పిల్చుకొని బాంధవమున్ మఱపించు చెల్మితో
సరసము లాడికొందు; మట, సర్వదయారస మేకరూపమై
హరిఁ దనముందు గన్న మహిమాంచిత సీతయమామ్మ లోకమం
దఱికిని మాదుతల్లి గురుదైవత మామెఁ దలంతు వారిలో. ౨౦

అది కరుణాధిదేవతకదా యది యచ్చపు తేనెవాక య
య్యది కదళీఫల ప్రకర మయ్యది ద్రాక్షఫలాసవమ్ము య
య్యది సహకారచారురస మయ్యది దేవగవీపయస్సు న
య్యది యొక పాలవెల్లి యమృతాప్లవన మ్మది మాదుపాలికిన్. ౨౧

ఆ మాధుర్యము క్రోలిక్రోలి మధురమ్మైనట్టి నారాయణీ
యామూల్యామృతబిందు వొక్కటి తదీయార్వేలవంశీయ భా
షా మందారము రామకృష్ణ పరమున్ సల్పంగ నానోచు నో
మేమో శ్రీ గురువాయు దైవతము తానే వచ్చి చెప్పన్ వలెన్. ౨౨

ఏవంభూత పురాభవానుభవ మేదేఁ గొంత బాంధవ్య స
ద్భావమ్మున్ జెలిమిన్ ఘటించు ఎదలో భావించి, తద్భావుక
త్వావేల్లత్కవితా తరంగిత మనోవ్యాపారమున్ జూచి యే
వేవో వర్ణనకందరాని తలఁపుల్ హేరాళముల్ సాగఁగన్. ౨౩

కవితాకన్యా స్వీకృతి
కవునవు నితఁ డర్హుఁడంటి నందులకే ని
క్కవి వంశ కీర్తి లతలకు
భువి కవితోక్తుల వితానముల్ గల్పింతున్. ౨౪

శ్రుతివిహితాచారతతిఁ బ్రోచి శ్రుతిశిర
స్సిద్ధాంత శుద్ధాంతసీమ మసలి
దేవతా క్షితిదేవతా వరాతిథి సప
ర్యావాప్తి భక్తి పర్యాప్తి నలరి
సకలభాషాలిపి జ్ఞాన భాషణ గాన
కవితాది కళల సాకల్య మెనసి
అఖిలాంధ్ర రాజరాజాస్థాన రాజ్యాంగ
పరిపాలనక్రియాప్రౌఢి నంది

వర్తిలిరి గోలకొండవ్యాపారు లనఁగ
నాఱువేల నియోగి కులామ్ర ఘుమఘు
మాయమాన వనీ వసంతాయమాన
చారు పుల్లమరాజ వంశమ్ము వారు. ౨౫

ఆమీఁదన్ మొనమొన్న భాగ్యనగర ప్రాంతాన నాబూర్గుల
గ్రామమ్మందు వసించుటన్ గలిగె నా గ్రామమ్ము పేరింటి పే
రై మధ్యందిన భానుబింబములనన్ వ్యాప్తాఖిలాంధ్రక్షమా
సీమాంతమ్ము లెసంగెఁ దత్కులవధూ సీమంతముక్తారుచుల్. ౨౬

తగ వసిష్ఠుండు సుతుఁడు మిత్రావరుణుఁడు
నెలమిఁ గౌండిన్యుఁడన వంశఋషుల తపము
నించె వారల నవనవోన్మేష మధుర
మధుర బుద్ధి విలాస సంపదల నెల్ల. ౨౭

శేషపేరిట శుభశ్రీ కెల్ల మూలమై
తనరెఁ బాపయ్య ముత్తాతతండ్రి,
శ్రీ శౌర్యగిరి నరసింహ దేవర పేరి
దైవమై యెసఁగె ముత్తాతగారు
వేంకటేశ్వరు నిలువేల్పుగాఁ బ్రకటించె
నామ విఖ్యాతిఁ బితామహుండు
నరసింగ నామ పునఃపునరావృత్తి
నపునరావృత్తి తానందె తండ్రి

అమ్మ శ్రీరంగ రంగనాయకియు ననఁగ
భవ్య నారాయణీ యాఖ్య భాగవత క
థాధిదైవాప్త సానామ్యమగుచు నెలమి
రామకృష్ణాఖ్య భక్తిపారమ్య మొప్పు. ౨౮

అక్కన్న మాదన్న లపుడు చుట్టిన తెల్గు
శ్రీకారమున నగిషీలు చెక్కి
గోపన్న రామన్నకొలఁకు జేనించిన మేలి
సరులలోఁ జిక్కులు సడలఁజేసి
ఉరుదు పార్శీభాష లొరసి కేవలము గీ
ర్వాణాన నిలవేల్పుఁ బలుకరించి
* చారు లక్ష్మీస్తంభ చత్వరమ్మున నగా
రా యూపి నాగస్వరమ్ము జోపి
అరసె నఖిల తెలంగాణ మద్భుత ప్ర
తాప తాపిత విమతసంతాన మగుచు
ముఖ్యమంత్రిత్వ సంపూర్ణ పుంజితాధి
కార మధురమ్ము వామనాకార మొకటి. ౨౯

అది హరిభక్తి యయ్యుఁ బరమాద్భుతమౌ హరభక్తి మూర్తి, య
య్యది ప్రభుమంత్రశక్తికళయయ్యు ఋషిప్రభుమంత్రగుప్తి, య
య్యది స్వమతాప్తమయ్యు నమతాప్తమునౌ నొక సామరస్య, మ
య్యది బహుభాషియయ్యు నదిరా! మితభాషి ప్రయోగదక్షతన్. ౩౦

---

* ఇచట "చారు" శబ్దము "చార్మీనార్" ధ్వని.

తిరుపతిఁ జూచితిన్ మొదటఁ దియ్యనిరూపము విశ్వసంస్కృతో
ద్ధుర పరిషన్ముఖమ్మన మృదుస్మితపూర్వ మధుప్రసక్తికిన్
దొరయన నాచియాచి క్రియతోఁ బలుకున్, గవి తాను, భక్తి ని
ర్భర కవితారసజ్ఞుఁ డనవచ్చుఁగదా యనుకొంటి నయ్యెడన్. ౩౧

సరసము భావగర్భితము చారుపదస్ఫురణమ్ము భక్తిసుం
దరము సనాతనాధునికనందన ముజ్ఝితశబ్దచౌర్య మాం
తర పరమానుభూతి లలితమ్ము నతండు రచించె సత్కవుల్
కరమలరంగ కృష్ణశతకమ్ము సుదర్శిత సుప్రభాతమున్. ౩౨

అతఁడు న్యాయవాది; బిరు దయ్యది యందర గౌణవృత్తితో
నై తగు, ముఖ్యవృత్తి తగు నాతనియం; దది కారణమ్ముగా
నాతఁడె ముఖ్యమంత్రియగు, టవ్వల భారతరాజ్య భాగ్యసం
ధాతలలో ప్రధానిగణన మ్మతఁ డందుట సుప్రసిద్ధముల్. ౩౩

పొంగులువారి పర్విడు నపూర్వ తురుష్కవిశేష సంస్కృతిన్
క్రుంగిన తెల్గుగడ్డ తొలిపోడిమిఁ దీరిచిదిద్ది మేలునే
యంగల జాంబవంతులకు నాహనుమంతుల కండయయ్యెఁ దా
నంగదుఁడౌచు; రాజగుట యబ్బురమే యువరాజు పిమ్మటన్ ? ౩౪

వ్రాఁత పొంకము దెల్పు వంశక్రమాగత
మ్మన ముసద్దీలలోఁ బనితనమ్ము
చేఁత బింకము దెల్పుఁ జిక్కని బ్రాహ్మ సు
క్షాత్ర పర్యాప్త తేజః ప్రదీప్తి

మాట యందము దెల్పు మహిత నానాదేశ
భాషా పరిజ్ఞాన పాటవమ్ము
బాట చందము దెల్పు స్వపరపక్ష ప్రజా
వర్జనోర్జిత మహార్జవము జవము
శ్రీ విశాలాంధ్ర రాజ్యలక్ష్మీ ప్రధాన
భాగ్యనగర ప్రవేశోత్సవ ప్రయుక్త
మంత్రమయమూర్తి ప్రప్రథమ ప్రసిద్ధ
మంత్రికులమౌళిమండనమణి యతండు. ౩౫

ఆతల నీతలన్ బలిసి యందఱు పెద్దలెయై "యెసంబ్లి" బల్
జాతుల బాసలన్ బలుకఁ జక్కఁగ నందఱ కన్ని వేషముల్
చాతురిమై స్ఫురింప సరసమ్ముగ నందఱ కన్నిభాషలం
దాతఁడు విశ్వవేషియననై పలుకున్ మఱి విశ్వభాషియై. ౩౬

కలరార్యుల్ ప్రతిభానిధుల్; ప్రతిభకున్ గై మోడ్పు నేఁ బెట్ట; నా
తెలివిన్ మెత్తును ధర్మ మార్జవముతో దీపించినన్; దానికే
తెలివన్ పేరును జెల్లు; నాతని యెడన్ దెల్విట్టి దౌనంచు నా
చెలి మింతేనియు లేనినాఁడె కవితాశ్రీదృష్టితోఁ జూచితిన్. ౩౭

ఆలక్షింప యుగంధరుండు మఱి విద్యానాథుఁ డప్పాజి వి
ద్యాలంకారులు జ్ఞప్తి వచ్చెదరు విద్యారణ్య చాణక్యు ల
య్యై లక్ష్యమ్ముల రామకృష్ణ బుధు మంత్రాంగాన నా రాజగో
పాలాచార్యుఁడు భోగరాజకులుఁ డప్పట్టాభి యొక్కింతగన్. ౩౮

అల రఘునాథరాయల మహాప్రతిభన్ రసికత్వమున్ బహూ
క్తులఁ గొనియాడినాఁడు కవికోటిఁ గిరీటిగఁ జేమకూర యా
కులు కదియెల్ల సార్థకమొకో యనిపించును జోళ కేరళ
మ్ములు దరిదాపులై యటఁ బ్రభుండగు నీకవిమాన్యుదాపునన్. ౩౯

ఆ రజకార్ దురుద్యమ దవానల మార్చి; మహాంధ్ర రత్నగ
ర్భా రమణీయ గర్భకుహర మ్మటు ప్రీల్చెడు దుఃఖమాపి, తా
నారతి యెత్తినాఁడు సకలాంధ్రధరా పరమైక్యభావ శృం
గారరసాధిదేవతకుఁ గారణజన్ముఁ డతం డనన్వలెన్. ౪౦

సువిధేయమ్మగు భావవైభవమునున్ శుంభత్ కృపాధేయమున్
కవితాగేయమునైన ప్రాభవమునున్ గ్రంథాల యాంధ్రోద్యమ
స్తవనీయమ్ము క్రియానుమేయ పరమాశ్చర్య ప్రమేయమ్ము బు
ద్ధి విశేషమ్మను గల్గినాఁ డతనికిన్ దీటెవ్వ రాంధ్రావనిన్ ? ౪౧

అనుచున్ వాణీ వీణా
స్వనమొలసెన్ నాదు హృదయతంత్రీసంస్పం
దనమున నీ పుణ్యయశ
మ్మెనసె నిటన్ రామకృష్ణ ! ఇదె విను మింకన్. ౪౨

దశక మ్మొక్కటి కొక్కయందముగ నేతత్ స్వీకృతిన్ ద్వద్యశ
శ్శశిరేఖన్ స్తుతిరేఖ దిద్దెద, సహస్రశ్లోక సంఖ్యన్ సహ
స్రశరచ్ఛ్రీశరదాగమాబ్జవని హంసశ్రీ మహోపాసనా
వశుఁడై మూర్ధగళత్సుధారస సమాస్వాదాన దీర్ఘాయువౌ. ౪౩

అని దీవించెద నాదు నాశిషము 'సత్యా ఆశిష స్సంతు' నాఁ
జనవై యిందు తథాస్తుదైవతములాశాసింపఁగా నింక ని
త్తును నీకీ కృతికన్యకామణిని గూఁతుంజేసి మీ దంపతుల్
గొన మీసంతతి చిట్టిచెల్లియని యాలో ముద్దుసెల్లింపఁగన్. ౪౪

నీకున్మాకు సగోత్ర భావమగుటన్ నిన్నీకృతిన్ బిడ్డఁగా
గైకొమ్మంటిని; ఋష్యశృంగమునికిన్ శాంతామహాదేవిన
ట్లీకన్యన్ గురువాయుదైవమున కీవే యిచ్చి శ్రీ రామకృ
ష్ణా! కల్యాణమొనర్పు; మెల్లజగ మస్మద్వంశముల్ ధన్యముల్. ౪౫

ఇది తొలుత న్నిలింపకులమేలెను మత్కవితాతపఃఫల
మ్మిది మనయింటి యాడుబడు చిప్పుడు తెల్గునఁ బెంచిపెద్ద సే
యుదురని మా సగోత్రకుల ముద్ధరణమ్మగునంచు మీకు ని
య్యదనున నిత్తు బూర్గులకులాభరణా! కయిసేయు ముద్దుగన్. ౪౬

అమ్మ! యనంతలక్ష్మివికదా భవదీయ కరగ్రహమ్ముచే
నిమ్మహితాత్మనింట సుకవీంద్రవచఃకమనీయ భాగ్యలా
భ మ్మొనగూడె మాధవకృపాపరిపూర్ణకటాక్షదృష్టిపా
త్రమ్మయి మీ కుటుంబము కరమ్మలరుంగద పాలవెల్లియై. ౪౭

కావున మీరలిర్వురును గైకొనుఁ డీ కృతికన్య భాగ్యరే
ఖావిధియున్ బయల్పడు ననంతశయానుకరారవిందలీ
లావిహితోపలాలనకళాకలనీయరమానుభావసం
భావనమంది మత్కృతికుమారి మురారిమనమ్ముఁ గైకొనున్. ౪౮

పలికినపల్కు పూఁబొదలు వంచిన నించిన పూలజల్లులై
మలచిన యూహలున్ ఘుమఘుమల్ మలయించెడు పిల్లగాలులై
యలరుచు మేల్రసమ్ము రసికాళికి విందగు తేనెవాకయై
కొలుపఁగ వాణి నా కవితఁ గొల్పు వసంతవనీవిహారముల్. ౪౯

కలిలోనన్ జననమ్ము నాకుఁ గలిగెన్ గళ్యాణ రామార్చనా
ఫల; మేమైనను రామరాజ్య మిది స్వప్నప్రాయమైపోయె; మూ
ర్ఖుల మంత్రాంగము; కాఱుచీఁకటుల నీ కోనంగదా వెల్గు రే
ఖలు గన్పించుట; చాలు వాక్ఫలము సాకల్యమ్ము నా పాలికిన్. ౫౦

ఇక్కడ శంకరార్యు లుదయించిరి, భార్గవరాము నాయుధ
మ్మిక్కడ శాంతి నిష్ఠ గడియించెను, హిందు ముసల్మనైక్యస
మ్యక్కథకెల్ల నాయకుఁ డయారె 'గవర్నరు', పుణ్య కేరళ
మ్మిక్కడఁ గాక తీవి మఱియెక్కడ మత్కవితా ప్రసక్తికిన్ ? ౫౧

శ్రీ ధర్మపురి నరసింహ దేవరవారి
మ్రోల కప్పురపు నివాళిపట్టి
ప్రథిత మంథెన ఘనా పాఠీల ఘనఘనా
ఘనవేదఘోష మంగళము లెనసి
పిలిచి వేములవాడ భీమ నాయకు మహా
లింగమ్మునకుఁ గౌగి లింత లిచ్చి
ముచికుంద పేరియమ్మూసీనదీ భాగ్య
నగర దేవతల కానతులు సలిపి

పూర్వు లొనరించినట్టి యా పుణ్య మెల్ల
మూర్తి కట్టిన దిచట నీ మూర్తి ననుచు
మురిసి వచ్చితి మధికారమునకుఁ గాదు
రమ్మ సేవింత మీ స్వామి రామకృష్ణ! ౫౨

## స్వీయవృత్తము

శ్రీశైలమ్ము సమీపసీమ వరలున్ శ్రీ మీరు కల్లూరు స
ర్వాశా విశ్రుతి మచ్ఛ్రుతి ప్రవిహిత వ్యాపారు లద్వైత ని
ష్ఠా శీలుల్ హరిభక్తి నిర్భరులు శిష్య జ్ఞానవిజ్ఞాన దీ
క్షా శిక్షా నిపుణుల్ చరింతురట సాక్షాత్పద్మజుల్ సద్ద్విజుల్. ౫౩

శివదీక్షా పరులైన రెడ్డి నృపతుల్ శ్రీ వీరభద్రేశ్వరో
త్సవ సన్నాహములన్ శ్రుతుల్ వినుచు వాంఛన్జేసి సర్వాగ్ర హా
రవసుశ్రేణులఁ గాన్కలన్ గొలిపి కోరన్ ; గౌతమీతీర సీ
మ వసింపంజని రగ్నిహోత్రములతో మాపూర్వు లేనాటనో. ౫౪

రాజులు పిల్వనంపిరని రారు ధనాశకుఁజిక్కి; బ్రహ్మతే
జోజిత చండభానులని చూడనుపాయనపాణులై మహా
రాజులు నగ్నిహోత్ర గృహరాజిబడిన్ బడిగాపులైరి; యా
రాజులు యాజులున్ గడచిరారిక యెన్నియుగాలు దొర్లినన్. ౫౫

వేంగిరాజ్య రమావినోదలహరీ విశ్వోదయాంతఃపురో
త్సంగాగ్రమ్ములఁ జెంగలించు ద్విజ విద్వద్బాలికాబాల సా
రంగీ బాలకురంగముల్ మసలు మారంగమ్ము యజ్ఞాంగణా
సంగ మ్మద్యతనాంధ్రలక్ష్మికిఁ బ్రతిష్ఠాపీఠమై రంజిలెన్. ౫౬

శిష్టులు తాత తండ్రులు, వసిష్ఠముఖుల్ ఋషులౌర ! పుత్రకా
మేష్టిఫలమ్ము మాజనకుఁ, డిందనుకన్ శ్రుతిచోదితక్రియా
దృష్టికి లోటు లేద; మఱి దీక్షితనామముదక్కె భక్తి సం
శ్లిష్టునిజేయు నో పరమశిష్టునిజేయునొ యజ్ఞదీక్షలన్. ౫౭

ఏను బురాణముల్ పదియు నెన్మిది నేసి తెనుంగు నందనో
ద్యానము నేసితిన్; పలికినంతట మత్కవితాప్రసక్తి యౌ
నౌననిపించుకొన్నది ; మదర్చన శారద కెన్ని పుట్టులం
దైనదొ సుప్రసన్న యిపుడైనది శ్రీగురుమూర్తి తానయై. ౫౮

ఆడినమాట కచ్చితము; అట్టిటుగా మొగ మిచ్చకమ్ము న
న్నాడగ నీదు శారద కదా ! కడుపియ్యది చేతఁబట్టి న
న్నాడకు నీడ కంపదు, నిరాదర నీరస మూర్ఖ గోష్ఠులన్
మేడలక్రింద నన్ నిలువ నీదు; నిజానకు భాగ్యవంతుఁడన్. ౫౯

తమ్ముల్ దక్షిణ వామబాహువులు నాధైర్యానకుం గోట ల
ర్థమ్మున్ ధర్మము మోక్ష మందు రొకటే తాత్పర్యమై యీ కవి
త్వమ్మంచున్ గురువంచు దైవమనుచున్ దర్శించి సంసార బం
ధ మ్మొక్కించుక తప్పికోఁ దిరుగఁ దద్భక్తి క్షమల్ హేతువుల్. ౬౦

బెల్లమువండు ప్రౌయ్యియయి బిందువు బిందువు చిందు నేడు న
ల్లల్లన ధర్మసార మది యంతట నింతట మాకుటుంబమం
దిల్లలుకంగఁ బండువగునే గురువాయుపురాధినాథ! నీ
చల్లని చూపులం దమృతసారము ధారల విందువెట్టవే. ౬౧

కులుకుచు నొక్కగుప్పెడటుకుల్ దిని నెచ్చెలి యా కుచేలుని
ల్లలుకగ లచ్చిఁ బంపితి వయారె కవుల్ భవదీయభక్తు ల
క్కలుకున నుప్పుగల్ పసిడి కొండగనెంచి వచస్సుధాస్రవం
తుల మలఁగింతు రాప్తులకు దోసమె హద్దులులేవు ప్రేమకుౝ. ౬౨

## గ్రంథ ప్రసక్తి

గంగా తుంగ తరంగ భంగిమములోఁ గాశీపురాధీశ్వరా
పాంగ స్మేర కిరీటకోటిరుచిలో నా కామకోటీకటీ
సాంగోపాంగ పదక్రమ శ్రుతిరణ త్స్వర్ణ కాంచీమణీ
సంగీతమ్ముల నోలలాడితిమి నాతమ్ముండు నే నొక్కఁడై. ౬౩

పంచక్రోశపురీ విహారముల నావౝ వ్యాసకాశీపురో
దంచత్తీరము సేరులోపలన వ్యాసానుగ్రహ స్ఫోరక
మ్మించెౝ శ్రీ గురుదేవతాకరుణ చేయించెౝ గృతి ప్రార్థనన్
నించెన్ శ్రీ గురువాయుదైవత కృపా నీరంధ్ర దృక్చంద్రికల్. ౬౪

అపుడేఁ జేతులుమోడ్చి గంగయొడిలో నానంద ముగ్ధుండనై
విపులప్రేమను జంద్రచూడు నెదుటన్ వీక్షించుచున్నట్టులై
యపలాపించితి నేమియేమొ మఱి యయ్యర్థమ్ము లస్మద్భయ
క్షపణమ్ముల్ హృదయార్పణమ్ము లవి యీ చందమ్ములై పర్తిలెన్. ౬౫

ఏ యెడఁజూచినన్ హృదయమిచ్చి హరించు ముకుందుమీఁద నా
రాయణభట్టు సెప్పిన మహాకృతి వ్యాకరణప్రయోగ చి
త్రాయితమౌచు సంస్కృతమునం; దది తేటతెనుంగు సేయు భా
గ్యాయతి కేను బాత్రమగునట్టు లనుగ్రహమీయవే గురూ! ౬౬

ఏతన్మాత్ర విలాసమౌ ప్రకృతిపైనే మోహ మెవ్వారి కా
రీతిన్ సాహసమంది కొందరు పదక్రీడన్ వినోదింత్రు నా
కాతీరొప్పదు; చిత్స్వరూపమది నీ వన్నారుకాఁబట్టి నా
థా! తోచన్వలె మత్కవిత్వ బహిరంతర్వ్యాప్తి నీవై గురూ! ౬౭

వాగర్థమ్ములు పార్వతీశ్వరులుగా వర్ణించు సర్వాగమ
శ్రీ గాంభీర్యము నాకు బోధపడఁ దంద్రీ! యీ కవిత్వైక దీ
క్షా గమ్యమ్మగు యోగమూనితి నహంకారాన నిందందు నూ
రేగన్ గాదుసుమీ; కృతార్థునిగ నీవే చేయుమా శ్రీ గురూ! ౬౮

కవి నేనంచు నొకప్పుడేనియు నహంకారమ్ము రానీకు, నా
కవితావైభవ మెల్లఁ జూచితిని జక్కన్ నీదు లేనవ్వులో,
కవివీవై రవివోలె నామనసు నిష్కాలుష్యమౌనంత కం
దవగాహింతువు మత్కవిత్వరుచి యంతా నీవెకాదా ప్రభూ! ౬౯

2 

నాకుఁ గ్రొత్తయచే "న కశ్చి దకవిర్నా" మన్నవాక్యమ్ము సు
శ్లోకుల్ వ్యాసులు పల్కి రిక్కలికి; నాలోపమ్ము నాకర్థమౌ;
నీకాలానఁ గవుల్ గవిత్వమన నేమే వట్టి హాస్యమ్ము లి
స్సీ! కైవల్య గురుండ వేలవలె నా చేఁదోడువాదోడునై. ౨౦

## నారాయణీయావతారము

*కవి ప్రశంస*

మును సుతపః ప్రజాపతియు ముద్దియ పృశ్నియుఁ బద్మనాభ మూ
ర్తిని గొలువన్ వరమ్మొసఁగె శ్రీహరి "మీకిఁక మూఁడు జన్మముల్
దనయుఁడ నౌదు"నంచుఁ; దొలిదాన జనించెను బృశ్నిగర్భుఁడై
కనె మలి జన్మమం దదితి కశ్యపులం దటు వామనాకృతిన్. ౨౧

వసుధపై దేవకీ వసుదేవులైన వా
రలకుఁ గృష్ణావతారమునఁ బుట్టి
కంస సంహారమ్ముఁ గావించి ద్వారకా
నగర నిర్మాణ మంతటన చేసి
మహిపద్మనాభ విగ్రహరూపమగు తన
దివ్యమూర్తికి సుప్రతిష్ఠ సేసి
యాదవ వంశక్షయమ్మైన వేళ నా
ద్వారక తనయంత నీరు చేసి

తాను నేఁగుచు భక్తజనానుకూల్య
పరత నుద్ధవుచే బృహస్పతికిఁ గబురు
సేసె యాదవ వంశ నిశ్శేష విలయ
రుద్రుఁడయ్యును దన మూర్తి ద్రోచికొనఁగ. ౭౨

అమరాచార్యుఁడు శిష్యుఁడౌ పవనుతో నా ద్వారకన్ నీటి మ
ధ్యమునన్ దేలఁగఁజూచి యున్నత విభంగాంతస్సముత్పాత భం
గములం జెందెడు విగ్రహమ్మదియు సాక్షాత్పద్మనాభమ్మ నెం
చి మదిన్ గౌఁగిలి లోనికిం బొదివి యుంచెన్ శిష్యమూర్ధమ్మునన్. ౭౩

చనిచని శంకరాజ్ఞగొని సాగి క్రమమ్మున నర్మదాతరం
గిణి గని గౌతమిం గొలిచి కృష్ణకు మ్రొక్కి పినాకినీనదిన్
గనుచుఁ గవేరకన్య నటు గాంచి తరించెను దక్షిణాపథ
మ్మునఁ గల పుణ్యతీర్థముల మున్ గురుఁ డెల్ల నదీనదమ్ములన్. ౭౪

ఆనర్తమ్ము దరించి యాంధ్రమవలై యా చోళచేరమ్ము లా
పైనన్ దాటి గురుండు నైఋతివిదిక్పర్యాప్తిఁ బూర్ణానదీ
వ్యావృత్య త్సలిలౌఘ నిర్దళిత తాపాఘౌఘ మా కేరళ
మ్మానందమ్మునఁ జేరె శ్రీపరశురామాస్త్రోద్ధృతాకారమున్. ౭౫

గురుఁడున్ వాయు వటన్ బ్రతిష్ఠసలుపన్ గొల్చై వ యనారోగ్యసం
హరణ క్రీడనమై నిజాప్తకుల భూమైశ్వర్య సంధాన సుం
దరమౌ విగ్రహమై యటన్ వెలసె నా నారాయణస్వామి యే
గురువాయూరన ద్వాపరమ్మున; నెసంగున్ క్షేత్ర మీనాటికిన్. ౭౬

అపుడు జనమేజయుఁడు సర్పయాగ కలుష
మైన కుష్ఠమ్ము నాత్రేయమౌని బోధ
వలన నిమ్మూర్తి నర్చించి పాచికొనియె
నని పురాణమ్ము లీస్వామి నభినుతించు. ౨౭

పసుపుపచ్చని పట్టుపసిడి పుట్టము జరీ
కుచ్చెళుల్ పాదాల గునిసియాడ
మణికనత్కనకకింకిణి మ్రోయు మొలనూలు
ముజ్జగమ్ముల నిండుబొజ్జఁ గులుక
కౌస్తుభ వనమాలికా రమా శ్రీవత్స
చిహ్నమ్ము లురమునఁ జెంగలింప
ఘనగదా శంఖ చక్ర సరోజములు నాల్గు
నాల్గు హస్తముల నందమ్ము గొలుప
చెక్కులన్ రత్నకుండలశ్రీ నటింప
నుదుటిపై నూర్ధ్వతిలక మింపొదవ రత్న
మయ కిరీటము దినమణిమాడ్కి వెలుఁగ
వరలు గురువాయుపుర రమాస్వామి గొలుతు. ౨౮

మును పాంధ్ర ద్విజరాజపుంగవులలో ముఖ్యుండు శ్రీ శాతవా
హన వంశ్యుండు మయూరశర్మ మళయాళాఖ్యమ్ము నాదేశమే
లె; నటన్ బ్రాహ్మణవంశ మొక్కటియునున్ లేకున్కిఁ గొంపోయి ని
ల్పెను గోదావరి తీరవాసులగు సద్విప్రాన్వయ శ్రేణులన్. ౨౯

నంబూద్రీలన వారిలో శివగురుం డాఁ దంద్రిగాఁ గాంచి యా
ర్యాంబా గర్భమునన్ జగద్గురువు తానై శంకరాచార్య తే
జం బందుద్భవమొంది సర్వ జగదజ్ఞానాంధకారావభే
దంబుం జేసి యనుగ్రహించినది యద్వైత ప్రతిష్ఠావిధిన్. ౭౦

తాదృగ్బ్రాహ్మణులందు నాలుగు శతాబ్దాల్ ముందుగా నేటికిం
బ్రాదుర్భావము నొంది యీ కవికిశోర మ్మక్కటా! యౌవన
ప్రాదుర్భూతి పిషారటీకులవధూ బంధమ్మునన్ జిక్కి వి
ద్యాదూరుండయి; మీఁద నచ్యుత పిషారాఖ్యుండు ప్రేరేపఁగన్. ౭౧

సలిపెన్ సంస్కృత సాహితీఫల రసాస్వాదమ్ము, శాస్త్రమ్ములన్
నిలిపెన్ బుద్ధిని, పాణినీయమును పానీయమ్ముగాఁ గ్రోలె, న
వ్వలఁ గాణాదము గౌతమ మ్మరసెఁ, గావ్యస్ఫూర్తికిన్ బ్రహ్మయై
పలికెన్ సంస్కృతభాష భక్తిరసవద్భవ్యప్రబంధమ్ములన్. ౭౨

అల నారాయణభట్ట నంబుదిరిపాదాఖ్యున్ మహాఖ్యాతి న
వ్వల నష్టాదశ సంఖ్య సంస్కృత మహాభాషామణీభూషణ
మ్ములుగాఁ జెప్పెఁ బ్రబంధముల్ హరిపదాంభోజాగ్రజాగ్రద్రసో
జ్జ్వలధారావరివస్య పండిన కవిత్వశ్రీ వచోధారలన్, ౭౩

భక్తి రసవత్తదీయ ప్రబంధ సముద
యమ్ము నారాయణప్రభునాజ్ఞచే మ
నోజ్ఞనేపథ్యవిధి నభినేయములుగ
నలరె నాటకరంగమం దనుపమముగ. ౭౪

అక్కట ! విప్రబాలకుఁడ వధ్యయనమ్ము విధిప్రయుక్త మి
వెక్కడనేని వేదముల నింకఁ బఠింపు మనం గురుండు “నా
దిక్కనుకొంటి వేర గురుదేవత లే దటు కాదయేని నా
కిక్కడికింతె దక్కె చదువెక్కడి కంచెదఁ దృప్తి నెందెదన్. ౮౫

ఎనిజన్మమ్ములకేని నమ్మెదను ని‘న్నేకో గురు దైవత’
మ్మన, వాత్సల్యముబొంగి జన్మవిధి నా కధ్యాపనప్రాప్తి లే
దని పొమ్మంటి నిఁకెందుఁ బోవలయు రమ్మంచుౝ వడిౝ గ్రంథము
దనముందుంచుక సంతసెప్పె నటు వేదమ్మెల్ల సాంగమ్ముగన్. ౮౬

అధికానందమునెంది శిష్యవినయ మ్మాభక్తి కాజన్మమం
దధికారానకు మించినట్టి పని తానై చేసి మోహాన దు
ర్వ్యధిచేతన్ గనెఁ బక్షవాత మదియుౝ వేధించె నాసత్కృపా
నిధి; ధర్మ మ్మతి కర్కశమ్ము విధియున్ నిష్పక్షపాత మ్మిలన్. ౮౭

గురుఁ డట్లుగ్రరుజార్తుఁడౌటకుఁ గడుౝ క్షోభించి యాబాధకుం
గుఱి తన్నుంబొనరింప వేడి గురు ముక్తుంజేయ నర్థించి యీ
శ్వరు నర్చించి రుజల్ హరించుకొన నాపైఁజెప్పె నీ గ్రంథముౝ
గురువాయూరు పురాధిదైవత శిరఃకోటీర రత్నప్రభౝ. ౮౮

మాధవు నాలయమ్ము ముఖమంటపమందు ముకుందనామ సం
బోధనసేసి భాగవత పుణ్యకథల్ దినమొక్క ఘట్టముౝ
వ్యాధి హరింపుమంచును సహస్రముఖమ్మగు శ్లోకసంఖ్య నా
రాధనసేసి తా భవపరంపర దాటి తరించె రోగముౝ. ౮౯

దినములన్ ఘట్టి మొకొక్క టొక్కదశకాప్తిన్ భక్తి వైరాగ్యనం
దనమౌ కృష్ణపదారవింద మెదుటన్ నర్తింప నమ్ముగ్ధమో
హనహాసోల్లసితాధరామృతమయావ్యక్తోక్తిమాధుర్యమౌ
నన నారాయణుఁ డూదె వేణు విదియున్ నారాయణీయమ్మనన్. ౯౦

పశ్చిమాబ్ధితరంగ పఙ్క్తి నుయ్యేలలూఁగి
మలయచందన వనావళుల సాగి
ఏలా లవంగలతాలోల సుమనో వ
పీవాటి పరిమళశ్రీ వరించి
కాలటీనామ శంకర జగద్గురు జన్మ
గేహ వీథుల యాత్ర లాహరించి
రమణీయ కేరళ రమణీమణీ చారు
ధమ్మిల్ల కుసుమ గంధమ్ము లాని
మలసి గురువాయుపుర రమా మంగళాధి
దేవతా విపులోరఃస్థలీ విరాజ
మాన సుమమాలికా పరిమళ సమీర
చారు కైశోర మాకృతిన్ సంతరించె. ౯౧

ఆ కృతి యస్మదీయ మధురాంధ్రవచఃశ్రుతి మేళవించి వా
ణీ కరకంకణ క్వణన నిస్స్రుత తాళలయానుకూలతం
త్రీకుల నిస్సర త్స్వరధునీమయ తాన వితాన మూర్ఛనా
ప్రాకట రాగ భావమయ భక్తివిపంచి వహించి మీటితిన్. ౯౨

★

## సమర్పణము

గురువాయూరు పురీ సుం
దరునకు నారాయణునకు నారాయణ భ
ట్ట రచిత సంస్కృత కృత్యం
తర వర నారాయణీయ నందనవనికిన్. ౩

శ్రీలలనా ముఖకమల న
వైలా కర్పూర ఘుమఘుమావాసిత తాం
బూల స్వాదురసాస్వా
దాలక్షిత రాగరంజి తాధర మణికిన్. ౪

కేరళలక్ష్మీకృత క
స్తూరీ పరిమళిత తిలక శోభి లలాట
శ్రీరుచిరున కురుకరుణా
పూరస్మిత మధురమధుర ముఖకమలునకున్. ౫

దీక్షిత కృతికన్యా సం
రక్షా స్వీకరణ పరమరస కేరళ రా
జ్యక్షే మైక సమర్థా
ధ్యక్షాయిత రామకృష్ణ హర్షిత మతికిన్. ౬

వ. నీకు సమర్పణమ్ముగా నంకిత మొనరించుచున్న ఆ ఆంధ్రీకృత 'నారాయణీయ' ప్రబంధ మ్మిదె దేవా ! అవధరింపుము. ౭



శ్రీకృష్ణాయ నమః

# నారాయణీయము

## ప్రథమ స్కంధము

### ౧. భగవన్మహిమానువర్ణనము

అందరి భాగధేయ మయి యానిగమాగమగేయమై చిదా
నంద ఘనమ్ము బ్రహ్మము ననందగు తత్త్వము కన్నయంతలో
నందని యంద మెట్ట యెదురైనది శ్రీగురువాయు పట్టణ
మ్మందు దదె దేశకాల కలనాదుల కందక నిత్యముక్తమై. ౧

అందనివస్తు విట్లు తనయంతన నందిన చేఁత వాఁతగా
కెందునొ దేవులాడు జన మెక్కడి నైచ్యమొ, కాని మా మన
మ్మిందె లయింప విశ్వరుజ లీఁగఁగ నీ పరిపూర్ణ తత్త్వ మా
కందము నాశ్రయించెద మఖండ దయారస మూలకందమున్. ౨

శ్రుతి విన్నన్ మతి నెన్నినన్ మధురమై శోభిల్లు నీరూప నా
వృత సచ్చిత్సుఖగర్భ విభ్రమము తండ్రీ! శుద్ధ సత్త్వైక సం
భృత భూతేంద్రియ సంగ్రహ మ్మనుచు మున్నె వ్యాసులన్నార; లం
చిత మీ సుగ్రహమైన విగ్రహమునందే తన్మయుల్ భావుకుల్. ౩

ఆలో నిండి తొణంక కంతుదరి లే కాలీన ముక్తావళీ
వ్యాలక్ష్యమ్మగు బ్రహ్మసింధువున నిత్యానంద పీయూష క
ల్లోలోల్లాసము సత్త్వమందు; రది చెల్లున్ నీవయై నిష్కళం
డాలీలన్; సకలుండ వౌట యది నీయంశావతారమ్ములన్. ౪

ఏపని లేకయుండియును నీక్షణముం బొనరింతు; వందు మున్
రూపరియున్న యాప్రకృతి రూపముఁ దాల్చును గల్ప మాదిలో;
నాపె విశుద్ధ సత్త్వకళ నంది నిరావరణమ్మ నందె దీ
వాపయి నీ స్వభావ విభవాప్త మకుంఠ వికుంఠ తేజమున్. ౫

తొలకరిమబ్బులోఁ దళుకు దొంగిలి కమ్ర కలాయ కోమలో
జ్జ్వలమయి లచ్చికిన్ విడిది పట్టయి యచ్చపు జగ్గునిగ్గులన్
జెలువయి యోగులం దమృతసేచనమై, సుజనమ్ము చూపులన్
దలిరుచు పూర్ణపుణ్య మవతారము నందకిశోర మెన్నెదన్. ౬

హరి! ఘోరమ్మిది జీవసృష్టి యని నే నన్నాఁడ మున్ జీవు దు
ర్భర సంసారముఁజూచి, యిప్పు డటు లే భావింప; నా జీవుఁడే
యెర వైనన్ మఱి చిద్రసార్ద్రమధుర మీమ్మరూపముం గ్రోలి యె
వ్వరు క్రీడింతురు బ్రహ్మనామక సుధాంభస్సింధు పూరమ్ములన్? ౭

పరమానందరసమ్ము వంచెదవు నీ పాదాలపై వ్రాలినన్
సరి; నిన్గోరని పంట పండెద; వశేషప్రాప్య ముద్యత్ఫల
స్ఫురణ మీమ్మ వొక పారిజాతమవు; నీ పొల్పెంచుకోలేక ని
న్నొరయన్ నేరని యాచకాధములు దేవోద్యానపాళీవిటుల్. ౮

ఏవో కోర్కెలు కొంద రిచ్చెదరు తండ్రీ! నిన్నె నీవిచ్చి కొం;
దీ విశ్వమ్మున కీశ్వరుల్ గలరు నీకే యీశ్వరుం డీవు; నీ
పై వాల్లభ్యము భాగ్యశాలులకు; నీపై నీకె వాల్లభ్య; మ
య్యా! విశ్వాతిశయప్రభావగుణధుర్యా! నా నమోవాకముల్. ౯

సాక్షాచ్ఛంకరముఖ్యులన్ నిలుపు నైశ్వర్యమ్మొ, విశ్వప్రభా
వక్షేపమ్మగు వెల్గు, నిస్పృహసుధీవాగ్గేయమౌ కీర్తియుఁ,
వక్షస్సంగతి లక్ష్మి గల్గి, యెచటన్ సంగమ్ము లే, కెల్లెడఁ
సాక్షిత్వమ్మున వెల్గు దీవు భగవచ్ఛబ్దైక వాచ్యా! హరీ! ౧౦

## ౨. భగవద్రూప వర్ణనము

ఇనబింబ ప్రతిబింబమైన మకుట, మ్మింపౌ లలాటమ్ము నం
దున రంజిల్లెడు నిల్వునామమును, గండోయిన్ దయావృష్టులున్,
బినన వ్వొప్పగు నాస, కుండల రుచిఁ జెల్వొందు లేఁజెక్కు లిం
చిన నీయందము పద్మహార మధుర శ్రీవత్సముం గొల్చెదఁ. ౧౧

కేయూరాంగద రత్నకంకణ మహాఃకిర్మీర దివ్యాంగుళీ
యా యామోన్నత హస్తసంగత గదోద్యచ్ఛంఖచక్రాంబుజ
మ్మై మయాముక్త సువర్ణకాంచి వలయ వ్యాసక్త పీతాంబర
మ్మై యజ్ఞోపమ పాదవంద్యమగు నీయంద మ్ముపాసించెదన్. ౧౨

ముద్దులకెల్ల ముద్దు, మఱి ముచ్చట లన్నిటికంటె ముచ్చటై
నిద్దపు నీటులందు నెఱనీటయి వింతలకెల్ల వింతలఁ
దిద్దెడు నీత్రిలోక కమనీయ మహో మహనీయమైన నీ
యొద్దిక చూడఁజూడఁ జవులూరవె యూరక యెట్టి వారికిన్? ౧౩

ఆవిధమైన నీదు మధురాకృతిపైఁ దమినొంది యిందిరా
దేవి స్వభక్తులందయినఁ దీరికమై వసియింపదయ్యె, నీ
పై వలపూని నీయెడన వర్తిలుఁ: జంచల లచ్చియన్న పే
రీవిధి నీనిమిత్తముననేకద వచ్చిన దంబుజోదరా ! ౧౪

ఇంతియకాదు వేఱ యొక హేతువు సెప్పెద; లక్ష్మి త్వద్గత
స్వాంతులు త్వద్గుణస్తుతి వశంవదులైన మహానుభావులన్
సంతతముం జరించు నిజనాథకథా మధురప్రసంగ సం
క్రాంత మనస్కయై; యెచటఁగాని తిరమ్ముగ నిల్వ దచ్యుతా ! ౧౫

నీరూప మ్మిటు చారుతా నవసుధా నిష్యంద సందోహమై
యారజ్య త్పరచిద్రసాయనమయమ్మై డెందమూరించి నిం
డారన్ మై పులకింపఁజేసి కనులం దానంద బాష్పామృతా
పూరమ్ముల్ గురియించి చిత్తమున కేమో మత్తుమం దిచ్చెరా. ౧౬

పరమశ్రేష్ఠము భక్తియోగ మిది యప్పా ! జ్ఞాన కర్మాఖ్యముల్
గురుయోగమ్ములు రెంటికంటె నని యోగుల్ దెల్పియున్నారు; ని
ర్భర సౌందర్య రసాత్మకుండవగు నీపై నిండు ప్రేమాత్మక
మ్మరయన్ భక్తియ యెల్లవారల కనాయాసైకలభ్య మ్మగున్. ౧౭

క్రమ నిర్వాహ్య మకామమై చను స్వధర్మ; మ్మద్దియే కర్మయో
గము, దూరాన ఫలించు; నయ్యుపనిషద్గంభీరబోధైక ల
భ్యమొ యవ్యక్తము గావునన్ మదికి రా; దట్లౌటఁ ద్వత్ప్రేమరూ
పము భక్త్యాత్మక యోగమే సతత మాస్వాద్యమ్ము శ్రేయోదమున్. ౧౮

ఆయాసంపడి కర్మతంత్రములలో నం చెల్లనున్ బాసి, యె
ట్లో యాభక్తికి జ్ఞానమార్గమున కర్షు ల్గొంద రొచుందు; ర
న్నా! యన్యుల్ మది తర్కచర్చఁ దడి యింకన్ బ్రహ్మనామమ్ము నీ
యీ యాకారము నెంచి జన్మశతమం దీడేరుచుం డ్రీశ్వరా! ౧౯

నీపై భక్తి భవత్కథారసఝరీ నిర్మగ్నతన్ సిద్ధమై
యాపూర్ణామల దివ్యబోధపద సద్యస్సిద్ధిఁ జేకూర్చు; నా
ప్రాపౌఁ గావుతఁ ద్వత్పదాబ్జ పరమార్ద్రి ప్రౌఢ సౌహార్ద భా
వాపన్న మ్మది శ్రీమరుత్పురనివాసా! శ్రీనివాసా! హరీ! ౨౦

## ౩. భక్త స్వరూప వర్ణనము

ఆడుచు నీదునామములు, హర్షసుధాంబుధి నోలలాడుచుం
బాడుచు నీకథల్, భువన మంగళరూపము నీది బుద్ధిఁ దా
రాడగ, నీయెడన్ వలపులంది మదింగల వాంఛలెల్లఁ జూ
రాడెడు వారి ధన్యతములంచుఁ దలంచెద; ధన్యుఁ డయ్యెదన్. ౨౧

మది వ్యాధివ్యథలందు మ్రగ్గి పెళుసై మౌఢ్యమ్మునుంబూని య
ల్లదె నీపాద సరోజ రాగ మకరందాస్వాద మాధుర్య మొం
దదు; నన్నుం గరుణింపు; నీచరణపద్మధ్యాన సారస్య సం
పదలోఁ జొక్కెద నిన్నె పాడుకొని యే మార్మూలనో నక్కెదన్. ౨౨

నీదయ గల్గ జీవులకు నిచ్చలు లభ్యముకాని దేది ? నా
యీ దురవస్థ వాయు టదియెంత ? భవత్ప్రియభక్తులెల్ల నీ
యాదరమంది ముక్తులయి యాత్మసుఖమ్మది యెందరెందరి
మ్మేదిని జూరలాడరు; క్రమింపరు దుస్తర దుఃఖ తోయధుల్ ! ౨౩

మునులన్ ప్రౌఢులు నారదాదులు యశఃపూర్ణుల్ నిగూఢాత్మ వ
ర్తను లౌచున్ భవదీయ పాదజలజ ధ్యానాత్త సుస్వస్థతన్
గని యశ్రాంత పరిస్ఫురత్పరచిదానందాత్మ కాద్వైత వా
హిని స్వేచ్ఛాగతి నోలలాడుదురు, మే లీమీఁద నొందున్నదే ! ౨౪

పరిపుష్ట మ్మగుఁగాక భక్తి యది నీపై; నాదు తాపౌఘముల్
హరియింపంగల దద్ది యొక్కటియ; లే దావంత సందేహ; మా
సరణిన్ గాదొ, వృథాప్రలాపమగు వ్యాసప్రోక్తమున్ నైగమ
స్ఫురణ మ్ముక్తియు వీథిద్రిమ్మరు జనమ్ముల్ పల్కు చందమ్మునన్ ౨౫

నీపై భక్తి భవత్కథారసమునన్ దియ్యందన మ్మొందిన, యా
పై పక్వమ్మగునే నశేష పరితాప మ్మార్చి, స్వాంతమ్మునం
దాపూర్ణామలబోధ సంకలిత సాంద్రానంద తాదాత్మ్య ని
ష్ఠా పారమ్యముఁ గూర్చు; నంత కవలన్ సంప్రార్థ్య మింకుండునే? ౨౬

నా పరితాపమార్చి చరణమ్ములు నించినరక్తి నీదు క్షే
త్రోపసృతిం జరింపఁ, గను లొప్పులకుప్పను నిన్నుజూడఁగా,
నీపయి పూలునింపఁ గరనీరజముల్, చెవి క్రోల నీ కథల్
శ్రీపతి ! నాస పాదతులసీసుమవాసన లానఁ జేయవే. ౨౭

ఆధివ్యాధి విరోధివిగ్రహ గృహవ్యాపార ఝంఝానిల
వ్యాధూత మ్మెద నీదు మూర్తియను బ్రహ్మానంద చిద్బింబ ము
ద్బోధమ్మె మెయి పుల్కరింపఁ గనులందున్ హర్షబాష్పామృతో
త్సేధమ్మై హరియించుఁగావుత రుజాదీర్ఘవ్యథా వేదనన్. ౨౮

అక్కట ! నీయెడన్ విముఖమైన జనమ్ము సుఖింప, నీదుపై
నెక్కడలేని స్నేహ మొనరించి తపింతు నిదేమి కర్మమో;
చక్కని సామి ! నీ యశము చక్కగ నిల్పుకొనంగ నేలి నన్
మక్కువ నీదుభక్తమణి మౌళినొనర్పవె కంసమర్దనా ! ౨౯

పలుమాటల్ పనియేమి నీ కరుణ నాపై వచ్చునందాక లో
కుల మాటల్ విడనాడి, నీపయి విరుల్గుప్పించి, నీకీర్తి మం
గళ గానమ్ము లొనర్చి, నీ సొగసు లోఁ గైసేసి, నీ దివ్యమం
జుల పాదాబ్జము నీడలన్మసలి రోజుల్ సర్వ మేగించెదన్, ౩౦

★

# నారాయణీయము
## ద్వితీయ స్కంధము
### ౪. యోగసిద్ధి వర్ణనము

భవదుపాసన కారోగ్యభాగ్య మీయ
వయ్య ! యష్టాంగయోగ నిష్ఠానుభూతి
నోలలాడింపవోయి కృపాలవాల !
భవదనుగ్రహ తృప్తి లాభమ్మ గాంతు. ౩౧

బ్రహ్మచర్యాది యమనిష్ఠఁ బాదుకొల్పి
స్నాన సంధ్యాది నియమ విస్తరము సల్పి
నిన్నె మదినిల్పి దృఢత సంధించి నిలుతు
మభవ ! పద్మాది సకల సుఖాసనముల. ౩౨

తారము నంతరంగము సుతారము తాఁకఁగఁ బ్రాణవాయు సం
చారము వాపి దుర్విషయసంగతి నింద్రియవృత్తులాపి నిం
డారు మనమ్మునన్ భవదుపాసన రూప సమాధి యోగ ని
ష్ఠారుచి నోలలాడెదము సారస చారు విశాల లోచనా ! ౩౩

అందమునించి కందొవకు నందియు నందని నీదు నద్భుతా
నందవిలాసకందమగు నాకృతియందున డెందముంచి నీ
సుందర పాదపద్మముల సొంపు తలంచి యమందభక్తి ని
ష్యంద రసాంతరాంతర సుఖాప్లుతిఁ గాంతుము నందనందనా ! ౩౪

వినుత పరిస్ఫుటావయవ భేదమనోజ్ఞము నీదుమూర్తి నే
యనిశము ధ్యానయోగ నిరతాత్ములమై చిరశీలనావశ
మ్మున శ్రమ మింతలేక తలపోయుచు నుందుము నిన్నె దిక్కుగా
గని, భవదీయ దివ్యపదకంజము నీడను విశ్రమించుచున్. ३ ५

నీ పరిపూర్ణరూప మిది నిచ్చలు ధ్యానము సేయువేళ నీ
లోపల పొంగు క్రొందళుకులోన మనమ్ము విలీనమైన ని
ష్ఠాపరులైన యోగులకు సాంద్రసుఖైకరసానుభూతి నీ
రూపము బ్రహ్మరూప మనిరోధముగా నవభాస మౌ నెదన్. ३ ६

ఆ నీ సోయగ మెల్లఁ ద్రావుటను బ్రహ్మానంద సందోహ సం
ధానమ్మౌ నొక సుస్థితిం గనియు నంతన్ గొంతగా జారియున్
బౌనఃపున్యమొనర్చి ధారణముఖ ప్రారంభ సంరంభ, మం
దానన్ నేర్తుము నిశ్చలమ్మయిన యోగారూఢ సమ్యక్స్థితిన్. ३ ७

పరమాభ్యాస వినిశ్చయాధిగత దివ్యత్త్వత్పరానంద ని
ర్భర సచ్చిత్సుఖ కల్పితోత్సవులమై భక్తాళి ముక్తాళిలో
దొరలై శ్రీశుక నారదాది ఋషిసందోహమ్ము వోలెం బరా
వర విశ్వాత్మకభావ మూని విహరింపన్నేర్తు మామీఁదటన్. ३ ८

నీదుసమాధి సిద్ధిగని నేడొ క్రమాననొ మోక్షసద్రసా
స్వాదము కోరువాఁడు వరుసన్ గమలంబుల నాఱిటన్ సమా
సాదిత యోగశక్తిని వశంవదమౌ ననిలంబు మీఁదికిన్
మీఁదికినిన్ సుషుమ్నసరణి న్నడిపించును మెల్లమెల్లనన్. ३ ९

అంత సహంమమాభిరతి యంత తొలంగిచనంగ, లింగదే
హాంతము నొంది, నిన్ను బరమాత్మనుజేరి లయించు; నూర్ధ్వలో
కాంతర చంక్రమాభిరతి యయ్యెనొ బ్రహ్మకపాలమోక్షమై
నంతట నింద్రియప్రకర మంతటితో ముని యేఁగు మీఁదికిన్. ౪౦

అనలము శుక్లపక్షము సహమ్మటుమీఁదట నుత్తరాయణ
మ్మనఁ గల దేవతానికరముల్ దన నారవిమండలమ్ముదాఁ
కను గొనిపోవ నీ చరణకంజముల న్నెఱనమ్మ భక్తుఁ డేఁ
గును ధ్రువమండలావధులకుం బరమోద రసోదయమ్మునన్. ౪౧

ఇద్ధత నమ్మహర్భువన మేగియు శేషసమీరభుజ్మఖ
ప్రోద్ధత దుర్విషహ్య హుతభుక్శిఖలన్ మఱి క్రాగిక్రాగి య
త్యుద్ధతి మాగిపోక భవ దూర్జిత దివ్యసమాశ్రయాన స
ద్బుద్ధి గడించి బ్రహ్మపదముం గను, సంతకు మున్నయే స్గనున్. ౪౨

అచ్చటఁగాని నీదు పదమందునఁగాని వసించుచున్, భవ
మ్మచ్చట నెట్టి ప్రాకృతలయమ్మున ముక్తతఁగాంచు; లేక బ
ఝ్మచ్చట నిచ్చమై సకలముం దనుదానయి యింతమున్నె వాఁ
డచ్చపు ముక్తినందు జగదండము బీటలువార బోవుచున్. ౪౩

అందును భూమియందు జలమందున వెల్గున గాలి నాకస
మ్మందు మహత్తునం బ్రకృతియం దటు లావరణమ్ము లేడిఁటన్
ముందును ముందు నైక్యమయిపోయి నిరావరణైక సచ్చిదా
నందఘనమ్ము నీపదమునం దిరుగొందక లీనమయ్యెడున్. ౪౪

ఈవిధి నర్చిరాదిగతి నేగి మఱెన్నటికేని విచ్యుతిం
బోవునె ? సచ్చిదాత్మకవిభూ ! భవదీయ గుణానువాద సం
భావనఁ గీర్తనన్ వివశభావుఁడనైన ననుం గటాక్ష వీ
క్షావధి రక్షసేయ దగవా గురువాయుపురీ రమాధవా ! ౪౫

## ౫. విరాట్పురుషోత్పత్తి

గుణసామ్యస్థితిలో వికార మడఁగన్ గుప్పించి నీయందు మా
య నిలీనమ్మయి ప్రాకృతప్రలయమౌ; నవ్యక్తమో వ్యక్తమో
కనరా దక్కడ; మృత్యువో యమృతమో కా దందు; రాత్రిందివ
మ్మని లే దచ్చట ; సచ్చిదాత్మకత నీవై కాదె శేషింతువున్. ౪౬

ఆవిధిఁ జిద్విలాసరతి నందిన నీయెడ లీనమై చనున్
జీవులు కాల కర్మము లశేష గుణమ్ములు కార్య విశ్వమున్;
లేవని వాని నెవ్వ రన లే ; రవి యున్నవి శక్తి రూపమై;
యావలఁ బుట్టు పెట్టు లవి యన్ని నభఃకుసుమమ్ము లైనచో ! ౪౭

ఇటు ద్విపరార్ధకాలము క్రమింపగ నీవొక చూపు చూడగాఁ
దటుకున మాయ క్షోభపడ దానఁ ద్రిలోకము లుప్పతిల్లె; న
ప్పట నురుకాలశక్తియు స్వభావ మదృష్టమునై గుణత్రయ
స్ఫుట మొనరించి మాయ కవి మూఁడు నొనర్చె సహాయకక్రియన్. ౪౮

చేరువయయ్యు మాయ కటుసేరక సాక్షిగ నామరూపతన్
వేరయి మాయయందె ప్రతిబింబితుఁడై తివి; నిన్నె జీవుఁడ
న్నారలు మాయ కాల కలనంబున మేల్కొని నీదు ప్రేరణన్
దా రచియించె బుద్ధి యను తత్త్వ మదే మహదాఖ్య నొప్పెడిన్. ౯

అందు మహత్తు తాను ద్రిగుణాత్మక మయ్యును సత్త్వముఖ్యతం
జెంది వికల్ప శూన్యముగఁ జేయు నహంస్ఫురణమ్ము జీవునం
దంది గుణత్రయ ప్రచురమై తమ ముబ్బగ నేను నేననం
గం దగఁ జేయుచుండు సవికల్పక బోధము నీదు ప్రేరణన్. ౧౦

ఆ నేనన్నది త్రైగుణస్ఫురణ మూఁడై పొల్చి వైకారిక
మ్మౌ నా సాత్త్విక తామసమ్ము లన నై యర్కానిలేంద్రానల
శ్రీనా థాజ శివాశ్వి చంద్రుల దిశాశ్రేణిన్ సమస్తేంద్రియ
స్థానాధిష్ఠిత దేవతాళిఁ జలిపెన్ సత్త్వాంశయుక్తిం బ్రభూ! ౧౧

అదె సత్త్వాంశమునందు బుద్ధియు మనోఽహంకారముల్ చిత్తమ
న్నది యంతఃకరణాత్మక మ్మగుచు నంతం దోఁచె; నాతైజస
మ్మొదవించెన్ మఱి యింద్రియమ్ములను; రూపొందించెఁ బో తామస
మ్మది యాకాశగుణమ్ము శబ్దమును దేవా! నీ బలోదగ్రతన్. ౧౨

హరి! శబ్దమ్మున నాకస, మ్మచట స్పర్శాఖ్యమ్మునన్ వాయు, వా
వరుసన్ రూపము తేజ, మందు రసముం బానీయ, మా గంధమున్
ధర యద్దానను, నుత్తరోత్తర గుణోత్కర్షమ్ముగాఁ దామస
స్ఫురణన్ భూతవిలాస మీవ వెలికిం జూపించినా వీశ్వరా! ౧౩

భూతగణమ్ము లింద్రియ సమూహగుణమ్ములు దేవబృందముల్
చేఁతయు వాఁతఁగాక వగఁజెంద, నినుఙ్ శ్రుతిగీతలన్ సుర
వ్రాతము సంస్తుతింప, నటుపై నటఁ దత్త్వములందుఁ జొచ్చి నీ
చేతనశక్తి వానినిడి చేసితి వీవు హిరణ్మయాండమున్. ౨౪

ఆదిం బుట్టిన నీట నుండెను సువర్ణాండమ్ము వేయేండ్లు; త
ద్భేద మ్మీ వొనరించినంతట విరాడ్విఖ్యాతిచే నొప్పి వేల్
పాదమ్ముల్ కరముల్ శిరమ్ములుగ విశ్వప్రాణిరూపమ్ము నీ
వై దీపించితి వో మరుత్పుర సుపర్వాధీశ ! నన్ బ్రోవరా ! ౨౫

## ౬. విరాట్పురుష వర్ణనము

పదునాల్గుఙ్ భువనమ్ము లీ వయిన, నీ పాదమ్ము పాతాళమై
నది; మీఁగాలు రసాతలమ్మనయి నంతం గుల్ఫయుగ్మమ్మనై
నది విశ్వేశ ! మహాతలమ్మను; ముకుందా ! పిక్కలా రెండు నొ
ప్పిదముంగాంచెఁ దలాతలమ్ము లగుచుఙ్ విశ్వాద్భుతాత్మా ! హరీ !

సుతలము జానువుల్, తొడలు శోభిలు నవ్వితలాతలమ్ములై,
క్షితి జఘనమ్ము, నా గగనసీమయె నాభి, యురమ్ము స్వర్గముఙ్,
గుతిక మహమ్ము నయ్యెను, జనోభువనమ్ము ముఖమ్ము, ఫాలమై
నుతి గనియెఙ్ దపమ్ము, శిరసుఙ్ సకలాత్మక ! సత్యలోకమై. ౨౭

జగదాధారులకున్ జగమ్ముల కధిష్ఠానాత్ముఁడై యున్న నిన్
భగవంతుం డగువాని మ్రొక్కెదను దేవా! బ్రహ్మరంధ్రమ్ము నీ
కగు ఛందస్సులు విశ్వకంద మది; జు ట్టంభోదముల్; బుగ్గలే
యగు నాబ్రహ్మపదమ్ము; ఱెప్పలు నిశాహస్సుల్; కనుల్ సూర్యుఁడున్.

వరద! భవత్కటాక్షము ప్రపంచవిలాసము, ఘ్రాణ మశ్వినుల్
హరి! చెవులే దిశల్, పెదవు లాశయు లజ్జయు నంట; నీదు ప
ల్వరుసలు తళ్కుచుక్క లభవా! కలలోకములన్ గ్రసించుదు
ర్ధర శమన స్వరూప మవురా మఱి నీదగు వాడి కోరలున్. ౫౯

నేమమ్మొప్పగ మాయ నీనగవు, నీ నిట్టూరుపే వాయువున్
స్వామీ! నాలుకయే రసమ్ము, పలుకుల్ పక్షుల్, సుసిద్ధాదులున్
నీమంజుస్వరపఙ్క్తి, యగ్ని ముఖమై, నీ బాహువుల్ నిర్జర
స్తోమ మ్మైనది, ధర్మదేవతగఁ బొల్చున్ నీస్తన ద్వంద్వమున్. ౬౦

నీవె న్నధర్మమ్ము, నీమనస్సే చంద్రుఁ
డవ్యక్తమే హృదయాంబుజమ్ము;
ఉదరమే యుదధు, ల య్యుభయసంధ్యలు వస్త్ర
మఁట; ప్రజాపతి లింగ మందు రీశ!
వృషణముల్ మిత్రుండు, వివిధ మృగశ్రేణి
శ్రోణి భారమ్ముగా శోభగాంచు.
పదనఖమ్ములు నీకు మదవద్ద్విపోష్ట్ర సైం
ధవములు, కాలమ్ము నడక నీకు,

వదన బాహూరు చరణముల్ బ్రాహ్మణాది
వర్ణ భవనమ్ములగుఁ గృపాభవన ! నీకు
చక్రధర ! సర్వసంసార చక్ర వక్ర
చంక్రమణ మెల్ల నీ క్రియా సంక్రమణము. ౬౧

అసురవర్గమ్మ నీదు వీర్యమ్మ, నీదు
నెముకలెల్ల ధరాధర సముదయమ్మ
నదులు నాడులు, రోమముల్ నగము, లీయ
గణ్య విశ్వస్వరూప సంగతికి జయము. ౬౨

ఈ నీ విశ్వమయైక మంగళమహో హేరాళసౌందర్యమున్
ధ్యానార్హ మ్మనినారు కర్మఠులకున్; దత్తత్క్రియా శోభన
స్థానీయమ్మగు నీదు రూపము, తదంత శ్శుద్ధబుద్ధ స్వరూ
పానన్ వెల్గెడు నీకు మ్రొక్కుకొనెదన్ వాతాలయాధీశ్వరా ! ౬౩

## ౭. హిరణ్యగర్భోత్పత్తి

ఈ పదునాల్గులోకములు నీవయి యావల సత్యలోకమం
దాపరమేష్ఠివై తనరి యందు రజోవికృతి ప్రయుక్త నా
నాపుర చిత్ర భేదరచనా రసికుండ వశేషజీవలో
కోపహిత స్వరూపుఁడయి యుంటివి నీవ హిరణ్యగర్భుఁడై. ౬౪

అపు డతఁ డీజగత్సృజన మందుఁ దలంపిడి దారితోఁచమిన్
జపలతఁ దెల్లబోవఁ గని సర్వజగత్పరిపాలకుండ వౌట మున్
"దపతప" యంచు నాకసమునన్ శ్రుతిపర్వమొనర్చి వాణి, మేల్
కృప నతనిం దపమ్మునకు దింపితి వప్పుడ నీవు మాధవా ! ౬౫

ఎవ్వఁడొకో వచించు జగమెల్ల జలమ్ముల నిండువేళ, నిం
దెవ్విధ మర్థమం చరసి యెల్లదెసల్ గనుగొంచు బేలయై
యవ్వలఁ దివ్యవత్సర సహస్రమునన్ దపమూని కొల్వ ని,
న్నవ్విధి కప్పుడే స్వనిలయమ్మును జూపి తనన్యచిత్రమున్. ౬౬

ఎచటన్ మాయ వికారముల్ నెఱపదో యేలోకముల్ దోపవో
యెచటన్ శోకవిమోహకోప గతి లేనేలేదొ జ్యోతిర్మయ
మ్మెచటన్ సాంద్రసుఖావబోధగతి జాలెత్తున్ ఝరీవేగను
ప్రచయమ్మై యదె నీ నివాస మలరున్ వైకుంఠ నామమ్మునన్. ౬౭

ఎందు విమాన యానులయి యింద్రమణిప్రభ లీను మేనులన్
సుందర రత్నభూషణ రుచుల్ దెసలన్ మిఱుమిట్లు గొల్పగా
నందఱునుం జతుర్భుజులు నై విహరింతురు భక్తియుక్తి; నిం
పొందెడు నీదు ధామమది యొప్పును పుణ్యవిలాసధామమై. ౬౮

కనువిందై సురసుందరీ నివహముల్ గైవారముల్ సేయుచున్
వెనుకన్ ముందు నటింపఁ, గ్రొమ్మెఱుపుకీవిన్ విశ్వసమ్మోహన
మ్మన మైఁదీఁగ చలింపఁ, ద్వత్పద సరోజాంతఃస్ఫురత్సౌరభ
మ్మున వేడ్కం గొనునట్టి దివ్య సదనమ్మున్ నాకుఁ గూర్పంగదే. ౬౯

వైకుంఠ మ్మటు చూపఁ జూచె విధి; భాస్వత్కోటిధాటీసమా
టీకమ్మై కరకంకణాబ్జ మణికోటీర ప్రభాపుంజ సు
శ్రీ కమ్రారుణ కౌస్తుభాభరణమై శ్రీవత్స వక్షమ్మనౌ
నాకార మ్మది విశ్వకారణము; నా కారూపు సూపింపవే. ౭౦

జలదశ్యామ కలాయ కోమలకలాచక్రమ్ముచే సర్వది
గ్వలభీచక్రము నాక్రమించుచు గదాకంజాబ్జ చక్రాయుధా
మలిన ప్రోద్ధత బాహు దండములతో మందస్మితాస్యమ్ముతో
నలరించెన్ విధి నేవిలాస మది నా యాయాసముల్ వాపుతన్. ౭౧

తటుకునఁ జూచి తొట్రుపడి త్వత్పదపద్మములందు వ్రాలియు
త్కటతర హర్ష విభ్రమము గాంచుట మై మఱపొంది ధన్యుఁడై
నటులఁ దలంచి; తండ్రి హృదయమ్ము నెఱుంగుదు వీవు జ్ఞాన మొ
క్కటి దయసేయు ద్వైతమది కానిది నీదు స్వరూప మీశ్వరా! ౭౨

నిన్నె భజింతునంచు నవనీరజరాగ విరాగ దేశిక
మ్మన్నెఱనీటుకాని పదమందున వ్రాలినఁ, గేలుఁగేలితో
గ్రన్ననఁ జేర్చి జ్ఞానమది గల్గునులే, సృజనమ్ము బంధ మిం
కెన్నఁడు గాదటంచు నలరించితి వట్లలరింపవే ననున్. ౭౩

*

# నారాయణీయము

## తృతీయ స్కంధము

### ౮. ప్రళయసృష్టివర్ణనము

ఆవిధిఁ బ్రాకృతప్రళయమై చనినంతట బ్రహ్మకల్ప మం
దావిధి వెండియుం జననమంది త్వదీయకృపావిశేష సం
ప్లావిత వేదరాశి గని భవ్యగతిన్ సృజనమ్మొనర్చె సం
భావిత పూర్వకల్ప సమభావము గాఁగ నశేష విశ్వమున్. ౭౪

అతఁ డవలం జతుర్యుగ సహస్రమితమ్ములుగాఁ బవళ్ళు త
న్మితముగ రేలునుం గడపి నిద్దురకుం జొరఁ, దానుదానుగా
నతుకులమారి సృష్టియు తనంతట నంత లయింపగా, నిరా
యతిగ నిమిత్తభూత విలయమ్మది బ్రహ్మకు రాత్రియై చనెన్. ౭౫

ప్రాతఃకృత్యమువోలె నాతఁడు జగత్ ప్రారంభముంజేయఁ బ్రా
భాతశ్రీరుచి నీకృపావిలసన ప్రారంభమైనంత ము
న్నేతన్మాత్రము పుట్టి యీల్గిన జగమ్మేతాదృశప్రాణి సం
ఘాత మ్మంతకు నిద్రమేల్కొనుటయుం గా సృష్టి చిత్రమ్మగున్. ౭౬

ఒక పరార్ధమ్ము బ్రహ్మవయోర్ధ మేగె
నిప్పటికి నేబదేండ్లయి, యింతమున్న
రేయి, యవ్వలిపగటిలో నీ యశేష
విలసనవిశేష మదియేమొ విన్నవింతు. ౭౭

పగటితుద బ్రహ్మ సుఖనిద్రవాంఛ నేసి
నంత నీయందు లయమందె నంత జగము
నంత నీగర్భగోళమం దణఁగిపోయె
నంత నేకార్ణవమ్మయ్యె నఖిలజగము. ౭౮

శేషునిపై భవత్తనువిశేషునిపై భువనైకశేష ని
శ్శేషములౌ నెడన్ భువనసీమలు కన్నులు మోడ్చి యెట్టి యు
న్మేషములేక యోగసుఖనిద్ర నిరంతర నిర్విశేష సం
తోష రసస్వరూపమయి తోచితి వాఫణిరాజశయ్యపై. ౭౯

నీతో నీదు ననంతశక్తిచయముల్ నిద్రాణముల్గాగ, వి
ఖ్యాత ప్రాణిసమూహరూపుఁడవు నీ వచ్చోట నిద్రించి, యా
రీతిం దత్ప్రలయావసానమునఁ దంద్రీ! కాలరూపమ్ము సం
ప్రీతిం గొండొక యాత్మమూర్తి నట నీవే లేపినా వీశ్వరా! ౮౦

ఈవు కనుమూసినంతటనే గతించె
నటఁ జతుర్యుగ దివ్య సహస్రములును
కాలమను శక్తి తొలుదొల్త మేలుకొనియె
నదియ విశ్వేశ! మేల్కొల్పినదియ నిన్ను. ౮౧

కడలి కడుపున నిదురించి కన్నుదెఱచి
యన్ని లోకమ్ములున్ లయమగుట సూచి
సూక్ష్మరూపాన నీలోన నుడియు నీ ప్ర
పంచమందునె సృష్టిధరించినావు. ౮౨

అవల నీనాభి వివరమ్మునందు నంద
ముగ నొకానొక తామరమొగ్గ మొలచె
నది పురాలీన విశ్వవిశ్వాంతరాళ
వస్తుసంగ్రహ బీజరూపంబుగాదె. ౧౩

నీశరీరమ్మునందు జన్మించి వెలికి
నిగిడి నీరేజముకులంబు నిఖిలదిశలు
చిమ్ముకొని క్రమ్ము కాంతిపుంజమ్మువలనఁ
గడల నలమిన కటికి చీఁకటులఁ జిదిమె. ౧౪

భవదమోఘ వీర్యపరిణతిఁ జిత్రాతి
చిత్రమై ప్రఫుల్ల పత్రమైన
యబ్జమందు బ్రహ్మ యావిర్భవించెఁ ద
నంత వేదబోధ మంత వడసి. ౧౫

ఓ పరాత్పర! పద్మకల్పోదయమున
పద్మభవు నుద్ధరించిన ప్రభుఁడవీ వ
నంత మహిమానుభూతి ననంతతాప
ముల హరింపర! గురువాయు పుర విహార! ౧౬

# ౫. సృష్టివిలాసము

నలినభవుండు నీదు నత నాభి సరోరుహమందు నిల్చి యె
వ్వలన నిదెల్ల నీకడలిపై నుదయించె నటంచు వేడుకన్
నలుదెసలం గనుంగొనగ నాలుగు మోములు గల్గె వెండియున్
నలిననిభమ్ములైన నయనమ్ములు నెన్మిది గల్గె వానికిన్. ౪౭

జలధి తరంగడోలికల సారెకు నూఁగుచు, నూఁగుచున్న యా
జలజము తోడఁ జిత్త జలజమ్మును నూఁగఁగ, దాని కండగా
నిలిచిన నీదురూపు గన నేరక యాకమలోదరమ్మునన్
నిలిచిన నేనెవండ నలినీసుమ మెట్లుదయించె నిద్దియున్. ౪౮

దీనికి మూలముం గలిగి తీరు నటం చొకనిశ్చయమ్మునన్
బూని, తదీయ నాళమునఁ బోయి నిరూఢ మనంబువాఁడుగాఁ
బోను స్వయోగ విద్య బలముం గని నీ యతిమోహనాకృతిన్
గానఁగ బోయి పోయి యెటుఁ గానకపోయె నిదాన మయ్యెడన్. ౪౯

అంతటఁ దూడువెంటఁ జని యంతయుఁజూచి ప్రయాసపాటునన్
సుంతయుఁ జూడనేర కటు చూడగ వర్షశతమ్ము పట్టె; నొ
క్కింతట వాఁడు వెన్దిరిగి యిందు సుఖాసనముండె నిశ్చల
స్వాంతమునన్ సమాధిబలసంగతి నీదు ననుగ్రహార్థియై. ౫౦

ఒక శతవత్సరమ్ము లటులుండి సుతీవ్ర సమాధి భూమికన్
నికరము జ్ఞానమంది నలినీశిశు వంతట లోనిచూపులం
దొక పరమాద్భుతమ్ము భుజగోరుఫణా మణిమండపాగ్ర న
ర్తక మణిమాద్యపూర్వమధురమ్మగు రూపము సూచె నయ్యెడన్. క౧

మణికిరీటముకాంతి మలసి యాత్మీయ హృ
త్పుండరీకమున నీరెండ గాయ
కటిసూత్ర కింకిణీ మణి కనత్క్రేంకార
మోంకార నాద స్వరాంక మీయ
కాలాయకుసుమ లీలాలాలిత మ్మైన
తనుకాంతి హంస కుద్ధతి ఘటింప
అరుణారుణ ప్రభా స్ఫురణమై పీతాంబ
రమ్ము సంధ్యారాగ రక్తి నింప
హారమణి కౌస్తుభ ప్రభాపూర పూరి
తాఖిలాశాంత శృంగార మగుచు నవ్వి
రించికిన్ గోచరించిన శ్రీ విలాస
విలసితమ్మైన నీమూర్తిఁ దలఁచికొందు. క౨

శ్రుతి నికర ప్రదర్శిత విశుద్ధ మహామహిమానుభావ! శ్రీ
పతికి జయమ్ము నీకు జయవాదము, నాకును ధన్యవాద మీ
గతి దయసేసి నాఁడవు, జగద్రచనా కుశలమ్ము జ్ఞాన మ
చ్యుత! దయసేయుమంచు విధిసూక్తి నుతింగనినయ్య! ప్రోవరా. క౩

ఇచ్చెద సృష్టి శిల్పమున కిమ్మగు నేర్పు గ్రహింపవోయి, ని
న్మెచ్చితి, నాయనుగ్రహము నీవును గాంచి తపమ్ము సేయు మీ
యచ్చఁపు భక్తి నాయెడల నౌ సకలార్థద మంచుఁ జేసినా
వచ్చతురోక్తులన్ వికసితాననుగాఁ జతురాననుఁ హరీ! ౪

అతఁడొక నూరు దివ్య సమ లట్లు తపమ్మొనరించి పొందె న
ద్భుత మతియుం దపోబలము ముందటికంటెను; నంతలోన నం
చిత గతి గాలి వీచి సరసీజ మొకించుక యూఁగఁ జూచి త్వ
ద్విత బలమ్ము నూల్కొలిపి వెంటనె త్రావెను నీరు గాలియుఁ. ౫

తమ కరుణా విశేషమునఁ దామర పువ్వునఁ దాత లోక చి
త్రములు రచించి యాప్రజ పరంపరగా సృజియించినాఁడు; మ
మ్మమితభయార్తులఁ గురుకృపార్ద్ర కటాక్ష సుధా ప్రసార వి
భ్రమములఁ దేల్పవోయి గురువాయు పురీవర దివ్యమందిరా! ౬

## ౧౦. సృష్టిభేదవర్ణనము

తామర చూలి నీకృప నుదార బలమ్ము గడించి చేసె నా
నామర మానవ ప్రకర మవ్వల పక్షుల వృక్షజాల ము
ద్దామత జంగమమ్ములును స్థావరముల్ మఱి యెన్నొయెన్నొ శ్ర
ద్ధామతి జీవదేహములఁ దామరతంపరగాగ నీశ్వరా! ౭

కన మిథ్యాగ్రహ మస్మితామతియు రాగక్రోధముల్ భీతినాఁ
జను నజ్ఞానము వృత్తు లైదు గని యీ సర్వమ్ము నేఁ దామస
మ్మను సృష్టించితినంచు చిత్తమున నేమో యారటమ్మంది చే
సిన పాపమ్మది పోవ నీదు చరణ శ్రీధ్యాన నిష్ఠం గొనెన్. ౯౮

మనసున నవ్వలన్ బరమ మంగళమూర్తుల సృష్టిసేసె మున్
సనకు సనందనున్ మఱి సనాతనులైన సనత్కుమారులన్
మునులను; సృష్టిసేయుఁడని బోధ యొనర్చెను వారి; కందరా
యన పలు కాదరింపరు త్వదంఘ్రిసరోరుహభక్తి నిష్ఠులై. ౯౯

ఆయన కన్బొమల్ ముడువ నాగ్రహమెత్తి, తదంతరమ్మునన్
నీ యొక భాగమై యట జనించి మృడుండు "చరించు టెందు పే
రేయది నా" కటంచు నెగయించి యెలుంగట రోదనమ్ముఁ దా
జేయుట వాఁడు రుద్రుఁడని చెందె నొకానొక నామరూపమున్. ౧౦౦

పదునొకండగు నామరూపముల నంది
యలరు నా రుద్రమూర్తి కిల్లాండ్రఁ గూర్చి
యందరికి నన్ని యిండ్లు నీ యాన నిచ్చి
ప్రజలఁ గనుఁడంచు బ్రహ్మ వారలను బనిచె. ౧౦౧

అంతట రుద్రసృష్టిమయమై భువనత్రయి పిక్కటిల్లె దు
ర్దాంత దురంత రౌద్రతకు ధాత భయంపడి యార్చె "వద్దువ
ద్దింతట సృష్టినాపి తప మింకొనరింపు శుభమ్ము గల్గు సి
ద్ధాంత" మటంచు నీవలని యాదరణమ్మునఁ గన్న తెల్విచే. ౧౦౨

అతనికి సృష్టికార్యరతి కత్రి మరీచి పులస్త్యు లంగిరః
క్రతు పులహు ల్జనించి; రటు గల్గిరి ధాతశరీరమందు నం
చితగతి దక్షుఁడున్ భృగువసిష్ఠులు, మీ చరణైకసేవను
వ్రతులుదయించినారు భగవానులు నారదయోగివర్యులున్. ౧౦౩

ఆవల ధర్మముఖ్యులను నాతఁడు కర్దము నంతమీఁద వా
గ్దేవి సృజించి కామ వికృతిం గనె; నేలిన వారు తెల్పగా
నావిధి దక్షుఁడుఞ్ సనకుఁ డాదిగ నందరు బోధసేయ దు
ర్భావ మదెల్ల మానె సెద బమ్మిన చీఁకటి యెల్ల మాయగఞ్. ౧౦౪

ఆచతురాననుండు చతురాననుఁడయ్యె నశేషవేద వి
ద్యా చతురత్వ మంది సకలాగమ పుణ్య పురాణ సంహితా
వాచనముం బొనర్చి తనవారల కిచ్చి, జగత్ప్రవృద్ధి దు
ర్గోచరమౌట నీపద సరోరుహముల్ శరణొందె నంతటఞ్. ౧౦౫

తెలియఞ్ నేర్చి యుపాయ, మాత్మ తనువుఞ్ స్త్రీ పుంసరూపమ్ముగా
నలరించెఞ్ విధి; వారలే మనువు నిల్లాలైరి, యాద్వంద్వమం
దిల నానావిధ మానవాకృతుల నీవే పెంచినావట్టె మ
మ్ములఁ గోవింద! మరుత్పురేశ! రుజలఞ్ బోనాడి రక్షింపరా! ౧౦౬

## ౧౧. సనకాదుల వైకుంఠ గమనము. జయ విజయ శాపము. హిరణ్యకశిపు హిరణ్యాక్ష జననము.

వరుసన్ సృష్టి విలాస మీవిధమునన్ వర్ధిల్లు చుండంగ ని
ర్జర మౌనుల్ సనకాదు లొక్కతఱి నీ సందర్శ నార్థమ్ముగా
వర వైకుంఠపురీ మనోహర బహిర్ద్వార మ్మొగిన్ జేర వ
చ్చిరి మున్ శ్రీ గురువాయు మందిర విలాసీ! చిద్విలాసీ! హరీ! ౧౦౭

పూల నికుంజముల్ జలజపుంజములన్ బొలుపొందు దీర్ఘికల్
లాలిత దివ్య హర్మ్యముల లక్షితమౌచు నతుల్య కేవల
శ్రీలఁ జెలంగు నీసదన సీమకుఁ జయ్యన నేగి రందఱున్
జాల హజారముల్ గడచి చారుముఖప్రభ లుల్లసిల్లఁగన్. ౧౦౮

ఆపినవాఁడు లేఁడు, తుద కాపిరి కావలి వార లిద్ద ఱం
దోపి జయుండు నవ్విజయుఁ డుద్ధతి దేవరవారి సన్నిధా
నోపనియుక్తులంట! యయయో! మునిమండలికిన్ మనంబులన్
గోపము వొంగె సర్వమునకుం దమరేకద మూల మీశ్వరా! ౧౦౯

అరరే! కష్టము కష్ట, మెక్కడిది యీ యాక్రోశ మీదుష్కృధా
త్వర, మీరెక్కడ మాదృశాప్రతిభట స్వారాజ్య రక్షాధురం
ధరభావ మ్మిది యెక్కడంచు నసురత్వ ప్రాప్తికిన్ శాప మి
చ్చిరి నీవారికి, వారు కన్దెఱచి నీ సేవాస్మృతుల్ గోరఁగన్. ౧౧౦

ఏలినవారి కల్లరి యదెల్ల వినంబడఁ బోలు లచ్చితో
మూల దివాణముం గదలి మోసల నిల్చి ఖగేంద్రుమూపుపై
కేలిడి వాలుగా నిలిచి కిమ్మనకుండనె విశ్వమోహనా
లోల కటాక్షవీక్షణములోనన లోఁగొనినావు వారలన్. ౧౧౧

నేర్చిన మంచిమాటలను నిన్వినుతించెడువారి నందరిన్
దేర్చి, స్వకీయ పార్షదుల, దిక్కుమరొక్కటిలేని వారి నూ
రార్చి, పగన్ ననుం గొలిచి యల్లన నొక్కటిరెండు జన్మముల్
దీర్చి మదంతిక మ్మరుగుదెండనినా వటుపై కృపానిధీ ! ౧౧౨

దితికిన్ వా రుదితుల్ త్వదీయభృతి కెంతే నర్హులున్ గాశ్యప
క్షితిదేవాత్మజు లిద్దఱుం గవలు నాసీమాంత విశ్వమ్ము ను
ద్ధతి మీరం గబళింప నేగి; రురు సంధ్యాకాల జన్మోత్సవో
ద్యతులై రేగి యధఃకృతాంతకులునై రంతంత దేవాంతకుల్. ౧౧౩

అందొక్కండు హిరణ్యపూర్వకశిపుం, డాపై హిరణ్యాక్షుడం
చొందెం బేరు; భవత్సనాథము జగ మ్మాగించినా రిద్దఱున్
గ్రిందున్ మీఁదొనరించి లోకముల నుద్రేకించి క్రీడించిబల్
జిందావందరగా, స్వకీయపదధూళీవాసనాంధుల్ హరీ ! ౧౧౪

అం దత్యుద్ధతి దానవేంద్రుఁడు హిరణ్యాక్షుండు యుద్ధార్థియై
యందిం దూరక పర్వులెత్తి తన కీడౌ శత్రువుం గాన కే
మందున్ నీ ప్రియయౌ వసుంధర జలమ్మం దొయ్యనన్ ముంచి తా
నెందేనిన్ గద దింప కార్చుచు మదమ్మెక్కన్ జరించెన్ ధరన్. ౧౧౫

అడలి తదుగ్రతన్, గడలి "యద్దిర! నీ సరితూగు శత్రు వొ
క్కఁడ హరి యున్నవాఁ"డనగఁ గంధి నెగాదిగ జూచి విష్ణు నె
క్కఁడఁ గనుగొందు నం చుఱక గంతిడుచున్ దిరుగాడె జాలిన్
గడలివి భక్త గమ్యుఁడవు కావర! నన్ మరుదాలయేశ్వరా! ౧౧౬

## ౧౨. వరాహావతారము

సంభవ మౌను గాద యనఁజాల కకాలమునందు నీట వి
శ్వంభర మున్గినం గని, భవత్పదసేవఁ జరించు పద్మినీ
డింభకు సత్యలోకమున శీవి మెయిన్ వసియించు బ్రహ్మ స్వా
యంభువుఁ డంతఁజేరి శరణందె నశేషమునీంద్ర వందితున్. ౧౧౭

బిడ్డలఁ గాంచువేళఁ బృథివీభర మొడ్డిగిలెన్ బ్రజాళి నే
యొడ్డునఁ జేర్తునో తెలియ కున్నది; నన్నెటు దేర్తువో కర
మ్మొడ్డు మనంగ బ్రహ్మ శరణొందెను నీ చరణమ్ము లంత, నీ
యొడ్డిదె కూలిపడ్డ దెటులోకద పుట్టి మునింగె నంచునున్. ౧౧౮

ఎక్కడలేని కష్టమిది, యింతకుమున్ జలమెల్లఁ ద్రావితిన్
జుక్కయు లేద; యూరినది చూచితె; నీ చరణారవిందమే
దిక్కన, వాని ముక్కునన దివ్య వరాహ కిశోరమూర్తివై
యక్కడి కక్క డప్పటికి నప్పుడె నీ వవతారమైె ప్రభూ! ౧౧౯

బొట్టన వ్రేలిమాత్ర తనువుం గొని మీఁదికిలేచి యేన్గు గీ
పెట్టినయట్టు లార్చి యొక పెట్టున గట్టిగ నావులింప, నీ
పట్టి కుమారబృందము నభః పదమందున నిన్నుజూచి తా
మ ట్టె వెఱంగుపాటు గని రట్టి తెఱం గొకనాఁ డెఱుంగమిన్. ౧౨౦

ఎవ్వరు వీ రచింత్య మహిమేద్యులు బాలవరాహమూర్తులై
నవ్వుచు నాసికాపుటమునన్ దమయంతన వచ్చినారు, మా
యవ్వ ముకుందు మాయ యగునా యనుచుండనె కొండయంతయై
కెవ్వన ఘోరగర్జన లగించితి వెల్ల జగమ్ము ఘూర్ణిలన్. ౧౨౧

ఆగర్జాగవ మాలకించి జవమం దాలో తపస్సత్యలో
కాగారమ్ముల నున్న మౌని నివహ మ్మయ్యా! స్తుతుల్ చేసినా
రా గంభీర నుతు ల్నతు ల్గని బెడంగై హర్షులమ్మై మన
మ్మాగన్ దూకితి ఘుర్ఘురించుచు జల మ్మువ్వెత్తుగా మీటుచున్. ౧౨౨

నిక్కెడు బిఱ్ఱు వెంట్రుకల నిట్టలము న్విదిలించుచున్ గడున్
నిక్కఁగఁదోఁక, ముట్టియును నిల్వున నిల్వఁగఁ, గారుమబ్బులన్
బ్రక్కకు జిమ్ముకొంచు, నయనమ్ములు ఘూర్ణిల గోచరించినా
వక్కడ వందిబృందముల కచ్చపు వెన్నెల లారఁబోయుచున్. ౧౨౩

కలగం బారి యభంగభంగరుష నక్రక్రాంతి భ్రామ్యత్తిమిం
గిల కల్లోలితమైన యాజలములం గ్రీడించుచున్ దద్రసా
తల మల్లాడగ ఘుర్ఘురించుచు వడిన్ ధాత్రీమహాదేవి జా
డలు తీయం జనినావు; మా బ్రతుకుజాడల్ తీయలేవే ప్రభూ! ౧౨౪

కూటకిటీ ! రసాతల నికుంజకుటిన్ ధరమీటి వట్టి క
ర్కోటకుఁడైన దైత్యహతకున్ మఱి పైఁబడు దేవవిద్విష
త్కోటవరాట ఖేటముల గీటునఁ బుచ్చి త్వదుగ్రదంష్ట్రికా
కూటమునన్ ధరన్ నిలుపుకొంటివిగా యవలీలగా హరీ ! ౧౨-౫

ధారుణి నెత్తి కోరకొనఁ దాల్చిన నయ్యది తుంగము స్త యా
కారము దాల్చె నీ పృథుల కాయమునం; దలఘు ప్రచండవాః
పూరము లానథ మ్మెగసిపోవగ వారిధి నీఁదినావు క్రీ
డారసదోహలా ! రుజలడంపర యజ్ఞవరాహకందలా ! ౧౨-౬

## ౧౩. హిరణ్యాక్ష వధ

మున్నీ రాప్రళయమ్ము వేళఁ దనకున్ మోకాలిలోఁతైన నం
దన్నా ! నిన్వెదుకం జరించెడు హిరణ్యాక్షున్ సమీపించి మున్
ము న్నీభక్తుఁడు నారదుండు కపటస్ఫూర్తిన్ విడంబించుచున్
ని న్నిందించుచుఁ దద్బలమ్ము నభినందించెన్ మహోదాత్తతన్. ౧౩-౧

హరి మాయావి హరించె నీ పొల మిదేమయ్యా ! మహాకష్ట మీ
వరయం బొమ్మిదె దారి యంచు ముని తానై మార్గముంజూప, ము
ష్కరుఁ డారక్కసుఁ డెక్కడెక్కడని గర్జాఘోషముం జేయుచున్
దరిసెన్ నిన్ సలిలాంతరోద్గతు ధరాధౌరేయు నుద్యత్ప్రభున్. ౧౩-౨

అడవిమృగమ్మ నీవనుచు హాస్యము లాడుచుఁ బోటుమాటలన్
పొడిచెడువాని రక్కసుని పోలికయుం గనిపెట్టి, కోరపై
గడగడ లాడుచున్న నిజకాంత వడింగొని యబ్ధి గర్భమం
దిడి, నడుముం బిగించితి కదే కలియంబడగా వడిన్ హరీ! ౧౨౯

గద సారించెను రాక్షసాధముఁడు, వీఁకన్ నీవు కౌమోదకీ
గద సారించితి వంత నుత్కట రవాక్రాంతోరు దిగ్దంత్యరుం
తుద మయ్యెం గదకయ్యముం, గన సురల్ దోతెంచి రీరాక్షసున్
వదలం బోకని ధాత యయ్యసురసంధ్యావేళ నార్చెన్ హరీ! ౧౩౦

కదనమ్మందటఁ దన్మహోద్ధతగదాఘాతమ్మునన్ భ్రమంది నీ
గద క్రిందంబడ నల్లనన్ నగుచు సంకల్పించి రప్పించి కే
ల్గదియం జేసితి వంతలో నఖిల రక్షశ్చక్ర దుర్వక్ర దు
ర్మద నిర్మూలన కర్మఠ మ్మతి కఠోర మ్మైన నీచక్రమున్. ౧౩౧

కాలుఁడువోలె మండిపడి కట్టిడి దైత్యుఁడు శూలమేసినన్,
గేలఁ గలట్టి చక్రమున నీవది త్రుంపగ, రోసమెత్తి నిన్
జాల వలంచె గ్రుద్దుచును, జాలక మాయల కందరాని నీ
మ్రోలను జూపె సర్వజన మోహనముల్ పలుమాయ లీశ్వరా! ౧౩౨

త్వచ్చక్రద్యుతి నుచ్చలచ్చకచకన్ దద్ఘోరమాయాకృత
మ్మచ్ఛమ్మౌ పెను చీఁకటుల్ విరియ రోషాక్రాంతుఁడై వాఁడు న
త్యుచ్చైః పాతిత ముష్టి ఘాతముల ని న్నొప్పిడింప, వేఁగూల్చి నా
వచ్చోటన్ జెవిమూలమం దడఁచి నీయంగుష్ఠ మాత్రమ్మునన్. ౧౩౩

అక్కడ వాఁడు నీదు చరణాహతిఁ జచ్చెను నోట రక్తముం
గ్రక్కుచుఁ దన్ మును ల్వొగడగా; మఱి హర్ష పరిప్లుతాత్ములై
చక్కని స్తోత్ర పాఠముల సామి! నినున్ హరి యజ్ఞమూర్తి మా
దిక్కగువాని యోగులు నుతించిరి వైదిక సూక్త పద్ధతిన్. ౧౩౪

నీదు త్వచమ్మ ఛందములు, నీమెయిరోమములే కుశమ్ములున్,
నీదు కనుల్ ఘృతమ్ము, మఱి నీ ముఖజిహ్వలు స్రుక్స్రువమ్ములున్
కాదె? కర్ణముల్ చమస, గర్భ మిడాఖ్యము, హోతృకోటి త్వ
త్పాదము లౌ, గళ మ్ముపసదమ్మను, వీర్యము సోముఁ డీశ్వరా! ౧౩౫

అని యీరీతి మునీంద్రవందితుఁడవై యానందసందోహ దో
హన చిత్తమ్మన నిర్మలమ్మగు యశో వ్యాప్తిన్ మహామూర్తినిం
చిన, యందమ్మన నట్లఖండరసనిస్సీమాబ్ధి నోలాడుచున్
వినుతమ్మైన వికుంఠధామమునకున్ వేంచేసినా వంతటన్. ౧౩౬

## ౧౪. కపిలావతారము

అబ్జభవనసంభవుఁడు స్వాయంభువుండు
మను వపుడు నీదు చరణమ్ములను దలంచి
కొనుచు నీ దివ్యకథ లాడుకొనుచుఁ దన త
రమ్ము నడిపించె నంతరాయమ్ము గనక. ౧౩౭

ఆయెడం గర్దముఁడు బ్రహ్మ కనుఁగుకొడుకు
తండ్రియానతి సృష్టితంత్రమ్ము నడుపఁ
జాల ముచ్చటపడి పదివేల యేండ్లు
సకలసుందర ! నీదు నర్చనలు సలిపె. ౧౩౮

* తనమ్రోలఁ దొలకరించిన నాటి నెఱిమబ్బు
తళుకు నించెడు మేని కులుకుతోడ
తన కన్నులందు నించిన శరద్రాత్రి వె
న్నెల కాయు తెలినవ్వు మొలకతోడ
తన డెందమున కత్తుకొను లీల లీలార
వింద మల్లన నూచు వింతతోడ
తనదాక గరుడవాహనమెక్కి చనుదెంచు
నొరపు దెల్పెడు కృపాభరముతోడ
తన పురాకృత సుకృత సంతాన ఫలమ
'నంగ విలసించు నీదునందమునఁ జొక్కి
కర్దముఁడు భక్తిభావసమ్మర్ద మంద
నతని చెంగట ప్రత్యక్షమైతి వచట. ౧౩౯

---

* గరుడారూఢుడ వై వినీల జలదాకారుండవై మోమునన్
దరహాసప్రభ లుల్లసిల్లగ వినోదమ్మొంది, కెంగేల న
య్యరవింద మ్మిరవొంద నూఁచుచును నొయ్యారమ్ము మీఱంగఁ ద
త్పరతన్ ద్వత్పరుఁడైన కర్దమునకుం బ్రత్యక్షమై తీశ్వరా !

అయినన్ మై పులకించి నిన్ వినుతిసేయన్ వానికిన్ భార్యగా
దయతోడన్ మనుపుత్రి నిచ్చి యట సంతానమ్ము తొమ్మండ్రు నా
పయి కూతుండ్ర నొసంగి నేనె కొడుకై వర్తింతు మీకంచు న
వ్యయమోదమ్మొనరించి యేగితివి నీయానందధామానకున్. ౧౪౦

మనువు శతరూప యను తన మహిషితోడ
నుత్తమోత్తమ సుత దేవహూతితోడ
నీదుప్రేరణ నారదుఁ డాదరించి
తెలుపఁ గర్దము నెదురుతెన్నులను జూచె. ౧౪౧

అంతటఁ గర్దముండు, మను వచ్చపుఁబ్రేమను దేవహూతి న
త్యంత మనోహరాంగిఁ దన కామెతవెట్టగ స్వీకరించి శ్రీ
కాంతుని నిన్ భజించె; మఱి కాంతయు తోడయి సేవసేయ, న
య్యంతి మనోరథమ్ము గ్రహియించి కర మ్మలరించు వేడుకన్. ౧౪౨

నిను సేవించి గడించికొన్న మహిమన్ నీరేజ ప్రతేక్షణల్
దను సేవింపఁగ దేవహూతి తనచెంతన్ రాగఁ త్రైలోక్యమో
హన సౌందర్యముతోడఁ గర్దముఁడు నానానేకబృందారకా
ధ్వనికాయమ్ముల సంచరింపఁదొడఁగెన్ భ్రాజ ద్విమానమ్ములన్. ౧౪౩

అతఁడు నూఱేండ్లు విహరించి యామెయందు
కన్యలం గాంచెఁ దొమ్మండ్ర ధన్యతముల
తమకు జన్మోత్సవముసేసి తనదు సతికి
ముదము గావింప నడవికిన్ బోక నిలిచి. ౧౪౪

తన ప్రియుమాట సుంత జవదాటక త్వచ్చరణారవింద సే
వనమున దేవహూతి బహుభక్తిరస మ్మలరింప, విశ్వమో
హనుఁడవు నీవునుం గపిలుఁడం చనగా నవతారమెత్తినా
వనుపమ మాత్మతత్త్వ విషయమ్మది యమ్మకు బోధసేయగన్. ౧౪౫

మునియగు కర్దముండును దపోవనమేగెను సుప్రసన్నుఁడై
జననికి నాత్మతత్త్వ మది సర్వము నీ వుపదేశ మిచ్చినా
వనఘ! మరుత్పురేశ! కపిలాత్మక! మా భవరోగబాధ లె
ల్లను దొలగించి యేలర! కలామయ నిత్యకలాప సుందరా! ౧౪౬

## ౧౫. కపిలోపదేశము

* బందమగున్ మనమ్ము గుణబంధమునన్ బడెనేని; వానియం
దొందక యుండెనేని యమృతోదయమే యగు; భక్తియోగ మీ
బందముఁ ద్రెంచు; భక్తియును భక్తసమాశ్రయ లభ్యమంచు నీ
యందము నమ్మకుం దెలిపి తద్దిర మున్ గపిలాకృతిన్ హరీ! ౧౪౭

---

* ఎపుడు గుణమ్ము లత్తుకొను టీయదిబంధము; చిత్త మత్తుకో
నపు డమృతోదయమ్మె యగు; నంటు దొలంగగ భక్తియోగమే
యుపకరణమ్ము, భక్తి యనువొందును సాధులమైత్రి నంచు మున్
గపిలకుమారుఁడై తెలిపినావఁట యమ్మకు దేవహూతికిన్.

ప్రకృతి మహ త్తహంకృతి నభఃప్రముఖమ్ములు భూతపంచక
మ్మొకపది యింద్రియమ్ములు నహో విషయమ్ములునున్ మనస్సు పా
యక పురుషుండు నిర్వదియు నై దవత త్త్వముగా నెఱింగినన్
ప్రకృతిఁ దరింపవచ్చునని పల్కితి గాదటె దేవహూతికిన్ ! ౧౪౮

ప్రకృతిగతమ్ములైన గుణవర్గములోఁ బురుషుండు చిక్కుఁ; డ
ట్లొకతఱిఁ జిక్కనేని యవి యూరక చిక్కులు పెట్టుచుండు, మా
నక ననుగొల్చి త త్త్వ మనన మ్మొనరించిన దాఁటవచ్చు నీ
ప్రకృతి నటంటి వో కపిలబాలక ! అమ్మకు దేవహూతికిన్. ౧౪౯

స్థిరమగు నాసనమ్మున మదింగల యెల్ల కలంక మీఁగినన్
గరుడఖగాధి రూఢుని వికస్వర దివ్యవిభూషణాయుధో
త్కరుని దమాలనీలతనుఁ గాంచి సమాధి నిరూఢి నందు మం
చరసి వచించినావు కపిలార్భక ! యమ్మకు దేవహూతికిన్. ౧౫౦

గుణగణముల్ మదీయము లకుంఠిత లీలలు వించుఁ బాడుచున్
క్షణ మెడబాటులేని మది చారు సుపర్వసరిత్ప్రవాహధో
రణియగు భక్తి పుట్టును ; కర మ్మది మృత్యుభయమ్ము నెట్టఁ గా
రణమని తెల్పినావుగదరా ! కపిలాకృతి దేవహూతికిన్. ౧౫౧

కలికి యసహ్యగర్భ నరకమ్మున గాసిలి, యందు బుద్ధియుం
గలిగియు నేలమీఁదఁబడఁగా నది పోయిన, శైశవాద్యవ
స్థలఁబడి, యంతలో మఱల దారుణ యౌవనమోహమందు మూ
ర్ఛిలు నరుఁడంచుఁ దెల్పితివి శ్రీ కపిలాకృతి దేవహూతికిన్. ౧౫౨

సురపితృకోటిఁ గొల్చెడు విశుద్ధులు దక్షిణయాన మందుచుం
దురు ; ఫలకాంక్ష సేయక ననున్ గుఱిసేసి సమస్త కర్మముల్
నెరపిన పుణ్యు లేగుదురు నిర్మల ముత్తర యానమంచు నీ
వరసి వచించినావు గదరా ! కపిలార్భక ! దేవహూతికిన్. ౧౫౩

విని యటు లానతిచ్చినది వేడ్క గ్రహించి నినున్ నుతించు న
మ్మను దయఁజూచి యోగిజనమండలితో దయచేసినావు ; మీ
జననియు భక్తియోగ సరసమ్మగు చిత్తముతోడ ముక్తి నం
దెను ; మముబోంట్ల నేల వసియించితి వీవును బ్రాగుదీచిగన్. ౧౫౪

పలుకులు వేయునేటికి భవత్పదపంకజభక్తి మా భయ
మ్ములఁ దొలఁగించి సర్వఫలముల్ రుచి నించు నటంచు గట్టిగాఁ
బలికితి గాన మా సకలబాధలు చించి నినుంగుఱించి ని
ర్మల మగు భక్తి నించఁగదరా ! గురువాయుపురీమనోహరా ! ౧౫౫

# నారాయణీయము

## చతుర్థ స్కంధము

### ౧౬. నరనారాయణావతారము

అజుకొడుకైన దక్షుఁ డపుడా మనుపుత్త్రి ప్రసూతియందు నా
త్మజలఁ బదార్గురం బడసి ధర్మునికిం బదుమువ్వురన్, హవి
ర్భుజునకు స్వాహ, నెల్ల పితృమూర్తులకున్ స్వధ, నీదు నంశమై
విజయముసేయు నీశునకు వేడుకనిచ్చె సతీసతీమణిన్. ౧౫౬

ఆయెడ ధర్ము ధర్మసతియైనది మూర్తి మహానుభావు నా
రాయణునిన్ నినున్ నరసహాయుని గర్భమునందుఁ గన్న దో
హో యని యాత్వదీయ జననోత్సవమందు సురల్ నుతించి పు
ష్పాయతవృష్టి నించిరి శుభాయత మంగళతూర్య ఘోషలన్. ౧౫౭

వేయిసమల్ తపమ్ము మఱి వేయిసమల్ సమరమ్ము సేసినన్
బోయెడు వేయియౌ కవచముల్గల దైత్యునితోడఁ దాకి ప
ర్యాయమునన్ దపమ్ము సమరమ్ము నొనర్చి కిరీటమాత్రతే
జోయుతు నా సహస్ర కవచున్ వధియించితి రీర లిద్దరున్. ౧౫౮

ఆచొటువాసి యాబదరికాశ్రమవీథుల భ్రాతతోడ మో
క్షాచరణ ప్రచారములకై వసియింపగ మీతపశ్శ్రమ
శ్రీచరితమ్ము నోర్వమిఁ బొరింబొరి పూవిలుకాని బంపె నా
నాచకితేక్షణా విలసనమ్ములు తోడుగ నింద్రుఁ డయ్యెడన్. ౧౫౯

అంత వసంత కాంత మలయానిల బాంధవ మొంది యప్సరః
కాంతకటాక్ష పాత విశిఖమ్ములఁ గంతుఁ డనంతలీలలన్
రంతులు నేసియుం దన తరమ్ము రవంతయుఁ గామిచే భయ
భ్రాంతుఁడునైన వాని గని పల్కితి వచ్చపు మొల్కనవ్వులన్. ౧౬౦

"అసమశరుండ! నీవు భయమందకు మాధవ! పేరునిల్పు కై
వసమయినాఁడ మీకు సుర వారవిలాసవతీ దృగంతరో
ల్లసనమునం" దటంచు నవలక్ష నుతులందుచు వారి కద్భుత
మ్మెసఁగఁగఁ జూపినావుగదవే పరిచారక సుందరీతతిన్. ౧౬౧

నిను మోహమ్మున ముంపవచ్చు జనమున్ నీదివ్యదాసీవిలా
సినులక్ష నించు సువాసనల్ ముసరి ముంచెన్ మోహజాలాన పా
వన! స్వర్వారవిలాసినీ నికరగర్వమ్మార్చు నియ్యూర్వశిం
గొని పొండంటివి, వారు చేకొనిరి సిగ్గుల్ కొంత తూగింపగన్. ౧౬౨

వచ్చిన యూర్వశింగని భవచ్చరితమ్మును నీప్రభావమున్
ద్రచ్చి కడుం జలించె నమరప్రభు; వింత ప్రశాంత సుందర
మ్మచ్చము విశ్వమోహన మహామహిమ మ్మవతార; మింతకున్
ముచ్చట కృష్ణరూప మతిముగ్ధవిమోహన మొక్కటేకదా. ౧౬౩

హెచ్చుగఁ దమ్మిచూలి యెనయించిన కూరిమిచే రజోంధుఁడై
మెచ్చఁడు నిన్ను దక్షుఁ; డటమీఁద నశాంతి జనించె; వాఁడు నీ
యచ్చపు రూపమైన శివు యజ్ఞమునం బిలువంగఁబోక పె
న్మచ్చర మూని కూతు నవమానశిఖిం బడఁద్రోచె నంతటన్. ౧౬౪

తా నుగ్రుండు మహోగ్రుఁడై మఖము నస్తవ్యస్తముంజేసి, యా
లోనన్ మామ శిరమ్ముఁద్రెంచి దివిషల్లోకమ్ము కీర్తింప సం
ధానించెన్ మఱి వానిజీవముల; నంతన్ యజ్ఞసంపూర్తి నీ
చే నై దక్షుఁడు శాంతినొందె నిటు నిన్ సేవింతు రక్షింపరా! ౧౬౫

## ౧౭. ధ్రువోపాఖ్యానము

ప్రభువు మనుసుతుఁ డుత్తానపాదుఁడనఁగఁ
గలిగె; వానికి భార్యలు కల రిరువురు
సురుచి వానికి సురుచియై, యరుచియై య
నన్యగతి యై సునీతి ని న్నాశ్రయించె. ౧౬౬

సురుచికుమారుఁ డుత్తముఁడు సొంపుగఁ దండ్రితోడన్ వసింపఁగాఁ
ద్వరపడుచున్ సునీతిపసివాఁడు ధ్రువుం డట కెక్కఁ బోయినన్
సురుచి కఠోరముల్ వలుకుచున్ దిగఁద్రోచెను భర్తముందటన్
హరివిముఖుల్ దురాగ్రహు లయారె యసూయతొలంగ నేర్తురే! ౧౬౭

నీమాయంబడి తండ్రి యాలివశుఁడై నీవాని జూడండు; వాఁ
డేమో బెగ్గిలి తల్లి చెంగటికిఁ బోయెన్; జూచి యాయమ్మ తం
డ్రీ మేలయ్యెడు స్వస్వకర్మగతి యింతే నాయనా! నీవు మా
స్వామి శ్రీచరణమ్ములే శరణుగా భావించికోరా! యనెౘ. ౧౬౮

వినియారాజకిశోరమూర్తి నిను సేవింపంగ నిచ్చించి చెం
గున నైదేండ్ల వయస్సులోన పురముంగుప్పించి లంఘించి త్రో
వ నటన్ నారదదర్శనమ్మయినఁ తత్ర్పాప్తోపదేశమ్ముచే
నిను మెప్పించెఁ దపమ్మునన్ మధువనిన్ నీరేజపత్రేక్షణా ! ౧౬౯

ఉల్లము తల్లడిల్లి తనయుం దలపోసి తపించు తండ్రికిన్
జల్లనిమాటలాడి సురసంయమి శాంతియొనర్ప; నక్కడు
త్ఫుల్ల సరోజనేత్రు నిను బోలిచికొంచు సమాధి నిష్ఠ న
ల్లల్లనఁ బెంచెఁ దీవ్రతప మర్భకుఁ డాఱునెలల్ గ్రమింపగన్. ౧౭౦

అంత తపః ప్రచండత దిగంతము లావిరు లేసరేగ, వి
భ్రాంత మనస్కులై సురలు ప్రార్థనసేయఁ గృపాతరంగిత
స్వాంతుఁడవై త్వదీయ మధురాకృతి చిద్రసలీనమాన సా
భ్యంతరుఁడైన బాలుకడ వ్రాలితి వో ఖగరాజవాహనా ! ౧౭౧

నీదగు దర్శనమ్మున వినిర్భర హర్ష తరంగి తాత్ముఁడై
యాదటఁ ద్వద్వపుర్మధురసాయనమందు మునింగి చూపులన్
నీదు స్తవమ్ము సేయఁగలనే యనుచుంట యెఱింగి యంటినా
వాదరమున్ దరమ్ముగొని యల్లన వాని మొఱుంగుఁ జెక్కిళుల్. ౧౭౨

ఆవల జ్ఞానలాభ విమలాత్ముని నిన్వినుతించువాని లో
భావమెఱింగి పల్కితివి బాలక ! రాజ్యసుఖమ్ము లాని యా
పై వెనుకంజ వేయని ధ్రువస్థితి నందగవత్తుకాని లె
మ్మావల దానికిం గలుగ వావల యంచుఁ గృపారసావధీ ! ౧౭౩

అనిపినయంతనీవు మఱి యా నృపనందనుఁ డేగుదెంచి ప
త్తనమునకున్ జనమ్ములు సదా యనురంజన మొందఁ ద్వత్ప్రసా
దన పరిపూర్ణకాముడయి, తండ్రి వనమ్మునకుం దపమ్ము సే
యను జన, రాజ్యభారము తనంత వహించి ధ్రువుండు నంతటన్. ౧౭౪

యక్షునిచే హతుండగుట యారసి యుత్తము, నీరసమ్మునన్
యక్షులతోడఁ బోరి మనువానతి నక్కసివాసినం, దదీ
యాక్షయశాంతి మెచ్చి తనయంతన వచ్చిన యక్షరాట్కృపా
వీక్షణచే వరమ్ముగనె విశ్రుతిఁ ద్వత్పదభక్తి విస్తృతిన్. ౧౭౫

అతఁ డాలోన భవజ్జనమ్ముగొనిరా నాలో విమానమ్ములో
నతి మోదమ్మునఁ దల్లితో ధ్రువపదమ్మం దేగియున్నాఁడు దీ
క్షితులౌ భక్తులఁ బ్రోచు దీక్ష యొకటే చెల్వొందు నీయందు, నా
గతి నీవంటి మరుత్పురాలయ! రుజల్ ఖండింపరా మ్రొక్కెదన్. ౧౭౬

## ౧౮. పృథుచరిత్ర

అంగుఁ డభంగ తుంగయశుఁడై ధ్రువవంగడమందుఁ బుట్టె; న
య్యంగునికిన్ జనించె దురితాత్ముఁడు వేనుఁడు; వానిదుష్క్రియా
సంగతిఁ గ్రుంగికృంగి భవసంగము రోసి భవత్పదాబ్జ సా
రంగమతిన్ వనమ్మరిగె రాజశిఖామణి నిన్ భజింపఁగన్. ౧౭౭

పాపియైనను వేనునిన్ బాలనమున
బ్రజలు నియమించి రంతఁగర్కశుఁడు వాఁడు
తన బలము మెచ్చికొంచు నిద్ధరణి నఖిల
యాగముల కంతరాయమ్ము లాచరించె. ౧౭౮

తనకు హితబోధసేయ వచ్చిన మునీంద్ర
కోటిఁ గని నన్నుమించిన మేటిమగఁడు
గలఁడె మీ కంచు హరినింద సలిపి పరమ
మునుల శాపాగ్ని మిడుతయై పొలిసె వాఁడు. ౧౭౯

రాజటు గూలినంతట నరాజకమౌనని మౌనిలోక ము
ద్వేజనమంది తల్లికడబెట్టిన వేనుని మేనియూరువున్
యోజనమై మథించి కలుషోగ్రత యెల్లనువాపి; రంత నీ
వే జనియించినావు మథియించిన తద్ఘన బాహుపీఠికన్. ౧౮౦

నీవు పృథుండవై యశము నిల్పితి మౌనుల ప్రేరణమ్మునన్
భావిభవత్ప్రతాపవిభవమ్ము నుతింపఁగ వందిమాగధుల్;
వే విలుపూని వేనకబళీకృతసౌరభసార మైన యీ
భూవలయమ్ము గ్రొచ్చి సమముం బొనరించితి వెచ్చుతగ్గులన్, ౧౮౧

కులవృద్ధుల్ మఱి లేగలై కుడువగా గోరూప యౌ ధారుణిం
గల యన్నాదు లభీష్టసారముల నానాదేవగంధర్వ ము
ఖ్యులచేతం బితికించినాఁడ వట స్వస్వోపాత్తపాత్రమ్ములం
దలఘుప్రాభవ వైభవాద్భుత పృథువ్యక్తాత్మలీలా ! హరీ ! ౧౮౨

నిను నీవే యజనమ్మునన్ గొలుచుచో నీమీఁద స్పర్ధాలువై
చని నీ నూఱవ యశ్వమేధమున నశ్వమ్మున్ హరించెన్ హరీ!
జనఘోషన్ బడి దొంగవేషమున దుశ్చారిత్రుఁడై యింద్రుఁడే
చిన నీ పుత్రునిచేఁ బరాజయము గాంచెం విశ్వరక్షామణీ! ౧౮౩

పలుమా రిట్లు భవన్మఖాశ్వము హరింపన్; మౌను లయ్యింద్రుఁ గ
ట్టలుకన్ హోమము సేయఁబూని రనలమ్మం దంత హాహారవ
మ్ములు పుట్టెన్; విధి వచ్చి యడ్డుపడియెన్! బూర్తింగనెన్ యజ్ఞ మా
తల సాక్షాన్మధువైరి నీవ నిను సందర్శించినా వీశ్వరా! ౧౮౪

హరి! హరిభక్తి యొక్క వరమంది, భగీరథకన్యకాతటాం
తర రుచిరాశ్రమమ్మున సదావసియించుచు సత్రయాగముల్
జరుప మునీంద్రకోటులకు చక్కని భక్తి యుపన్యసించుచున్
సరసనె చూచినావు ఋషి సాధువులన్ సనకాదులన్ ప్రభూ! ౧౮౫

సనకాదుల్ దయచేసినట్టి ఘనవిజ్ఞానమ్ముచే నవ్వన
మ్మున స్వేచ్ఛామధురాత్ముఁడై మసలుచున్ బూర్ణాత్మ! నీలోన ని
న్ననుసంధానము సేసికొంటివి; మదీయార్తిం దొలంగింపు పా
వన తత్పావనమందిరాధిప! కృపాపారీణ! శ్రీమత్ప్రభూ! ౧౮౬

## ౧౯. ప్రాచేతస వర్ణనము

పృథునికిం బౌత్రుఁడై యొప్పెఁ బృథులధర్మ
పరుఁడు ప్రాచీనబర్హి యవ్వానిభార్య
యును శతద్రుతి, వారికిన్ జనన మైరి
త్వత్కృపాంకురములు ప్రచేతసు లనంగ. ౧౮౭

సృష్టి వాంఛించి తండ్రి శాసించినంత
వారు పదిమంది నినుగూర్చి పరమతపము
సలుపఁ బశ్చిమవార్ధికిం జని తదీయ
పారమున నందమగు సరోవరము గనిరి. ౧౮౮

నీతీర్థ మ్మట కేగుదెంచెను భవానీభర్త నీభక్తసం
ఘాతమ్ముం దరిసించు వేడ్కఁ; నటు సాక్షాత్కారమై ముందుఁ బ్రా
చేత స్సంతతి కింపుమీర నుపదేశించెన్ భవత్కీర్తనో
ద్గీతానందసుధాధునీ ప్రణవసంగీత మ్మమోఘమ్ముగన్. ౧౮౯

ఆస్తవ మాస్థమై జలములందు జపించుచు నీసమర్చనా
విస్తరు లైనయంతఁ బదివేలగు వర్షము లేఁగె వారికిన్;
శస్త భవ త్సుఖామృతరస మ్మది గ్రోలుచునుండగాఁ దప
స్స్వస్తికమౌచుఁ గాలము ధ్రువక్రియ సాగెను మెల్లమెల్లనన్. ౧౯౦

వారి తపోవిశేషమున వారలతంద్రి యనేక యజ్ఞ హిం
సారతి నందినట్టి కలుషమ్ములు వాసి పవిత్రుఁడయ్యె; న
న్నారదుఁ డేఁగుదెంచి సదన మ్మునకుం దనుదానచూచు బ
ల్నేరుపు చూప నాతఁడు విలీనతనొందె భవత్స్వరూపమై. ౧౬౧

పరమకృపన్ ప్రచేతసుల పజ్జను ప్రాలితి వప్పుడే ఖగే
శ్వర వరవాహనమ్ముపయి చయ్యన; నెన్మిదిచేతులన్ విని
ర్భర పరమాయుధద్యుతి పరంపర దిక్కులఁబిక్కటిల్ల సుం
దరములకెల్ల సుందర మనం దగు రూపవిలాస మేర్పడన్. ౧౬౨

వార లడుగని వరములన్ వారి కిచ్చి
నావు నీవ కృపారసాప్లావితాత్మ !
నీదుధ్యానమ్ము మంగళాపాదకమ్ము
రుద్రనుతి యిది యెల్ల కోర్కులు ఫలించు. ౧౬౩

తరువులకున్ జనించునొక తన్వి వరింపుఁడు; దానితోడ నె
ల్లరు విహరింపుఁ డొక్క పదిలక్షలయేం; డ్లటమీఁద దక్షుఁడన్
వరతనయుండు మీ కొదవు; వాఁడు జనించిన యాక్షణంబునన్
బరముని బొందనేర్తు రని పల్కితి వప్పుడు వారితో హరీ ! ౧౬౪

వారలు తీవ్రకోపనులు వారిధిమేఖలిత క్షమాధర
మ్మారక యడ్డగించెడి తరూత్కరముం దహాయించుచున్, విధి
ప్రేరణ శాంతిపూని పృథివీజము లిచ్చిన కన్యతోడ స్వే
చ్ఛారుచిఁ గ్రీడ లాడి రనిశంబును నీవనినంత కాలమున్. ౧౬౫

కాంచిరి దక్షునిఁ దనయుఁగా; మఱి యజ్ఞము లెన్నియెన్నొ కా
వించిరి; యవ్విరించి సుతు నించిన నిండు ననుగ్రహాన యో
గించిన బుద్ధిఁగాంచి తులకించి రకించన సార్వభౌమ మో
దాంచిత దివ్యధామమున; నట్లె ననుం దిలకింపరా ప్రభూ ! ౧౯౬

★

న

# నారాయణీయము

## పంచమ స్కంధము

### ౨౦. ఋషభయోగీశ్వర చరిత్ర

అలరెన్ మున్ను బ్రియవ్రత ప్రియసుతుం డాగ్నీధ్రుఁ; డవ్వానికిన్
గలిగెన్ నాభి; యతండు నీకృపకునై కావించె యజ్ఞమ్ముఁ; దం
దలఘు ప్రాభవ వైభవ మ్మొలయఁగా నావిర్భవ మ్మొంతి విం
పలరన్ నిన్గని రిత్విలో మునులు భక్తాభీష్ట సంధాయకా! ౧౯౭

నీవు సమస్తమూర్తివి మునిస్తుతి నిస్తులమోద మందినన్
నీవలెనుండు పుత్రు నొకనిన్ దయసేయుము వీనికన్న, సం
భావన సేసి నేనె శిశుభావమునొంది జనింతునంచు నీ
వై వరమిచ్చి యావల మఖాగ్నిఁ దిరోహితుఁడైతి వచ్యుతా! ౧౯౮

ఎచ్చుటలేని భావమున నెచ్చుటలేని ప్రభావసంపదన్
ముచ్చటగూర్చి యెల్లరఁ బ్రమోదరసాంబుధి నోలలార్ప నీ
యచ్చపు నంశమూని ఋషభాఖ్య వహించి జనించినావు నీ
యిచ్చినమాట చెల్లుబడికే యట నాభికి మేరుదేవికిన్! ౧౯౯

నాభి త్రిలోకభారవహనక్షముఁడైన మహానుభావు ని
న్నీభువి రాజ్యభారము వహింపగ నిల్పి తపోవనాన ని
న్నే భజియించి, మేరుసతివెంట జరింపగ, నీయనుగ్రహ
ప్రాభవమంది పొందెను భవత్పదధామము నిత్యధామమున్. ౨౦౦

ఆ యుదితాద్భుతాద్భుత మహాతిశయంబు భవద్యశ మ్మమ
ర్షాయతి గూర్ప నింద్రుడు రవంతయు వర్షము చిన్కులేని య
ట్లై యజనాభు వర్ష మొనరించినచో దృఢయోగశక్తి నీ
వే యమృతోదయమ్ము నొనరించితిగా ఋషభావతారుఁడా ! ౨౦౧

ఆవిధి నోడి యింద్రుఁడు జయంతినొసంగఁ ద్రిలోకసుందరిన్
నీవును బెండ్లియాడితివి, నిచ్చలు బ్రహ్మరసైక నిష్ఠచే
భావితుఁడయ్యుఁ గంటి వటుపైన కుమారుల నూర్వురన్ ధరి
త్రీవిభుఁడౌచు నందు వినుతిం గనియెన్ ఋషభుండు పెద్దయై. ౨౦౨

అందరిలోన యోగివరులై రొక తొమ్మిదిమంది; యందరే
యిందుఁ బ్రజానురాగమున నేలిరి భారతవర్ష ఖండముల్
పొందిరి బ్రాహ్మణత్వము నపూర్వతపో బలయోగమొంది యీ
బృందమునందు శిష్టులు వరిష్ఠులు శిష్టజనైక రక్షకా ! ౨౦౩

ఆలీలన్ ఋషభుండు రాజయి కుమారానీకముం బిల్చి తా
నాలాపించి విరక్తిభక్తియుత బ్రహ్మానంద హాక్షాత్కృతి
శ్రీలాలిత్యము మోక్షమార్గము చరించెన్ సర్వబ్రహ్మాండముల్
బాలోన్మత్త పిశాచచర్య పరమవ్యాసక్త హంసాకృతిన్. ౨౦౪

పారమహంస్య ధర్మపరిపాలనమొంది పరాత్మభూతుఁడై
వారికి వారికిం దగినవారికిఁ దత్త్వముతెల్పి యెవ్వరున్
జేరగ నీక తన్ను నిరసింపగ లో విరసంబులేక య
వ్వారిగ సంచరించె ఋషభప్రభుఁ డాత్మరసైకలీనుఁడై. ౨౦౫

* గోవువలెన్ మృగంబయనుకోఁదగి కాకముపోల్కి నొంది యో
హోవసుధం జరించితి శయువ్రత మూని స్వరూపలాభ స
ద్భావమునన్; దవాగ్నిఁబడి ప్రాకృతదేహము వాసినావు లీ
లావధియైన నీవు ఋషభాకృతి నా కుటకాచలంబునన్. ౨౦౬

## ౨౧. జంబూద్వీపాదులందలి భగవత్స్వరూప వర్ణనము

క్ష్మామధ్యోద్భవమౌ నిలావృతమునం గాత్యాయనీ ముఖ్య భా
మామాన్యమ్మయినట్టి వర్షమున నీమంత్రస్తుతుల్ గొల్వ నీ
కా మృత్యుంజయుఁ డిందుశేఖరుఁడు నిత్యారాధనల్ సేయు నీ
శా ! మాదైవమ ! నిన్ను గొల్తు నట నీ సంకర్షణాకారమున్. ౨౦౭

అది భద్రాశ్వ మిలావృతమ్మునకుఁ దూర్పౌ; నందు భద్రశ్రవుల్
ముదమొప్పన్ ఋషు లద్భుతస్తుతుల సంబోధింపఁ గల్పాంతమున్
గదియం గానగరాని వేదము లొగిం గాపాడు నీకే నెఱం
గెద నాలోన నెఱింగి నీదగు హయగ్రీవాకృతిం గొల్చెదన్. ౨౦౮

---

* అజగరవ్రతమ్ము గని యావువలెన్ మృగమట్లు కాకియ
ట్లోజఁ జరించి మించి తిఱుగొందని నిష్ఠ స్వరూపలాభ వి
భ్రాజితుఁడై దవాగ్నిఁబడి ప్రాకృత దేహము నుజ్జగించినా
వీజగమందు నీవు ఋషభేశ్వర ! మున్ గుటకాచలమ్మునన్.

ధ్యానింతుర్ మఱి దక్షిణాన హరివర్షాఖ్యమ్మునన్ శుద్ధ వి
జ్ఞానైకప్రదమై కడుం ధవళమై శాంతమ్మునై దివ్య లీ
లానవ్యమ్మయి శ్రీనృసింహమయి ప్రహ్లాదాది భక్తాప్తసే
వానిత్యోత్సవ వత్సలమ్మయిన తత్త్వ మ్మద్భుతోత్సాహినై. ౨౦౯

సేవింతుర్ నిను నిత్యముర్ బడమటన్ శ్రీ కేతుమాలాఖ్యవ
ర్షావాసుండయి నారదాదిమునిబృందానేక సేవారసా
ప్లావ మ్మందుచు లచ్చి మెచ్చుకొన లీలామన్మథాకార స
ద్భావమ్మం గొని లేతనవ్వు దొలుకన్ వర్తించు నా దైవముర్. ౨౧౦

రమ్యకనామవర్ష మతిరమ్య; మటన్ మనువర్య సేవ పా
రమ్యమునొంది భక్తజన రక్షకుఁడౌచు నమత్సరాత్మ హృ
ద్గమ్యుఁడవై వెలుంగు పరతత్త్వము కేవలమత్స్యమూర్తిఁ బ్రా
ధమ్యముగన్న ని న్గొలుతుఁ తండ్రి! యుదీచి దిశాధినాయకుర్. ౨౧౧

పరమమ్మైన హిరణ్మయోత్తర దిశావర్షమ్మునం దద్రి సం
భరణాత్యద్భుత కర్మఠమ్ము కమఠత్వ వ్యక్త రూపమ్ముతోఁ
బరచిద్రూపమునీవయై పితృగణప్రార్థ్యుండవై యున్న నీ
పరమ మ్మర్యమరూపమెంచి కొలుతున్ వాతాలయాధీశ్వరా! ౨౧౨

ధరణిని గూడి మంత్రమహిత స్తవ సంతతి సంతసించు చు
త్తర కురుభూముల న్మనలు దైవము యజ్ఞవరాహరూపమున్
కెరలెడి దంష్ట్రికాగ్ర వినిఘృష్ట సుపృష్ఠ గరిష్ఠ విగ్రహుర్
పరము నుతింతు నిర్, న్గరుణఁ బాలనసేయగదే దయానిధీ! ౨౧౩

అచ్చపుభక్తి నిన్ను హనుమన్న భజింపగ జానకమ్మతో
ముచ్చట గొల్పుచు న్పరమశోభన మోహన రామమూర్తివై
వచ్చి వసింతు కింపురుషవర్షమునం దటు దక్షిణమ్మునన్
గ్రచ్చర మమ్మ నేలుకొనరా ! గురువాయు పురాధినాయకా ! ౨౧౪

పాయక నారదుంగలిసి భారతఖండ మునీంద్రకోటి వా
లాయము సాంఖ్యయోగ పరిలక్షిత సన్నుతి నీ యుపాసనల్
సేయగ సాధురక్షణము సేయుదు*వాలయ మందునిల్చి నా
రాయణదేవ శ్రీనరసఖా ! పరిపాలనసేయరా ననున్. ౨౧౫

రవిగాఁ బ్లక్షమునందు, శాల్మలమునన్ రాజిల్లు జాబిల్లిగా,
హవిరాహారునిగాఁ గుశమ్మునను, గ్రౌంచాఖ్యమ్మునన్ నీరుగా,
పవనుంగా నట శాకమందు, నిను నాబ్రహ్మాత్ముగా నెంత్రు వై
భవ మొప్పన్ మఱి పుష్కరమ్మనెడు ద్వీపమ్మందు సర్వప్రజల్. ౨౧౬

తోకన్ స్మనొక్కని నీశరీరమున నస్తోకాఖిల స్థానమం
దాకల్పింత్రు ధ్రువాదులన్ గ్రహములాయాచుక్కలన్ శింశుమా
రాకారాన నుపాస్యమయ్యెదవు సంధ్యావేళలం దెల్ల లో
కైక క్షేమపరుల్ మహామహుల కీశా ! నన్ను బాలింపరా ! ౨౧౭

భావింతున్ గురుగేహనాథుని నినున్ బాతాళమూలమ్ము నం
దావాసించు విలోలకుండల సహస్రాలోల శీర్షున్ వినీ
లావేల్లద్వసనున్ హలాయుధుని నానానేక నాగాంగనా
సేవావల్లభు దుర్లభున్ గుణవిభున్ శేషాహిరాడ్వల్లభున్ ! ౨౧౮

* ఆలయము - ప్రళయము వరకు

# నారాయణీయము

## షష్ఠ స్కంధము

### ౨౨. అజామిలోపాఖ్యానము

ఉండె నజామిళుండనగ నొక్కద్విజుండు గృహస్థ ధర్మమం
దుండి చలింప కుండు గురుయోగముచే; నొకనా డరణ్యమం
దుండగఁ జూచినాఁడఁట యయో! జననాంతర పాప సంగమై
యొండునెడన్ బజారి యగు నొక్క తుటారి మిటారికత్తియన్. ౨౧౯

అతఁడు ప్రశాంతుఁడైన సమయమ్మది; చిత్తము తత్తరించి మిం
డతపయిప్రాల దానికి నొడంబడియెన్; బరమార్థ ధర్మని
ర్థతి నటుప్రాయమున్ బదిపదుల్ గడుపన్ భవదీయనామ సం
గతుఁడగు బిడ్డమీఁద మఱిగగ్లెను వానికిఁ దీవ్రమోహముల్. ౨౨౦

ఆ యమకింకరుల్ బహు భయంకరులై మరణమ్ము వేళయై
డాయగ, ముప్వరగ్గని తడంబడి వాఁడు కుమారు నెంచి నా
రాయణ యంచుఁ బిల్చెను బురాస్మృతిఁ ద్వద్గత వాసనాబల
మ్మాయెడఁ దోడుగాఁగఁ గొడుకందలి మోహ మమోఘమై హరీ! ౨౨౧

ఎంతటి పాపియైన నగు నేమి తదాత్మకుఁడై వచించి నాఁ
డంతట నీదునామ మధురాక్షరపుంజము నంతమాత్రనే
చెంతను నిల్చి రెంతొ దయచేసి వికుంఠభటుల్ బలోద్భటుల్
వింత చతుర్భుజుల్ కనకపీతపటుల్ హరిభక్త లంపటుల్. ౨౨౨

కడువడి వాని నీడ్చిచను కాలుని కింకరులన్ భవద్భటుల్
విడువిడుఁ డం చదల్చినఁ, జలించి వడిం బగమించి వాని యా
గడముల లెక్క లెల్లఁ గడకన్ వినిపించిరి, విష్ణుపార్షదుల్
దుడుకు లవెల్లనున్ దొలఁగద్రోచి వచించిరి వారి కివ్విధిన్. ౨౨౩

ఉండిన నుండనిండు దురితోగ్రత ; దానికి మారునేఁత లే
కుండగఁ బోవునే ? మఱియునుండును దండన, మీర లెల్లరున్
పండితులే కదా ! సుకృత పాక మెఱుంగరొ వీని పున్నెముల్
పండిన విప్పుడే యనిరి వారలతో భవదీయ కింకరుల్. ౨౨౪

పలుతీరుల్ శ్రుతులందు నాస్మృతులలో భాసించు నా యావ్రతా
దులు పాపోపశమంబు సేయ మొదలున్ ద్రుంచంగ లే వాత్మ లో
పలి మాలిన్యము జిడ్డు తోముటకుఁ ద్వత్పాదాంబుజశ్రీ సప
ర్యల మించంగల దింక లేదనిరి దేవా ! త్వత్పదారాధకుల్. ౨౨౫

ఎన్నియొ పుట్టువుల్ గడచి యెన్నియొ పాపము లాచరించినాఁ
డిన్నిఁటికిన్ బ్రతిక్రియగ నిప్పుడు ప్రాణములన్ హరీ ! యనన్
మున్న హరీ ! యటంచు దన ముద్దుల బిడ్డని గూర్చియేని వా
డన్నది చాలదా యని రయారె భవచ్చరణాబ్జ సేవకుల్. ౨౨౬

మనసునఁ గాకపోయినను మాటకు వట్టి విలాసబుద్ధి నై
నను హరినామ మొక్కపరి నాలుక కొట్టకొన న్నటింప నిం
ధనముల నగ్నిగాల్చిన విధమ్మున రోగము నౌషధంబు చీ
ల్చినయటు పాపమెల్ల విదళించునటం చని రంత నీ భటుల్. ౨౨౭

యమభటు లంతటం దొలఁగి రంతట నేలినవారి భృత్య వ
ర్గము నపుడే తిరోహితము గాగ నజామిళుఁడున్ భవత్ స్మృతిన్
గ్రమమునఁ గొంతకాలము ధరన్ సుఖియించి, భవద్భటుల్ విమా
నము గొనిరాఁ ద్వదీయ సదనమ్మది సేరె వికుంఠ లోకమున్. ౨౨౮

అటు లాత్మీయభటాళి చిక్కులకుఁ బాలౌటెల్ల శంకించి మీ
రిటమీఁదన్ హరిభక్తకోటి దెసపోనే వద్దు వద్దంచు ను
ద్భటమౌ నాజ్ఞ నొసంగె దండధరుఁ డప్పా! త్వత్ప్రభావంబు లిం
తటి వేమందు మరుత్పురాలయ! కృపాధారాధరా! ప్రోవరా! ౨౨౯

## ౨౩. దక్షచరిత్ర, చిత్రకేతూపాఖ్యానము, వృత్రాసురవధ, సప్తమరుదుత్పత్తి.

అవల బ్రాచేతసుఁడు దక్షుఁ డాత్మసృష్టి
వృద్ధికై నిన్నుఁ గొల్వ నావిర్భవించి
యెనిమిది భుజమ్ములన్; వరమిడి యసిక్ని
యను వధూమణి నిచ్చినా వతని కీశ! ౨౩౦

వీనికుమారు లొక్క పదివేవురు వేవురు నారదోపదే
శాన విరక్తులై చనఁగ, శాపమొసంగెను దక్షుఁ 'డెందు కా
లానదు నీకుఁ బో' మ్మనుచు, నమ్మని యంచితభక్తి నిబ్బరం
బైన మనమ్మునం గొనియె నాతనిశాప మనుగ్రహమ్ముగన్. ౨౩౧

అఱువదిమంది కూతురుల నందెను దక్షుఁడు; తత్కులమ్ములన్
బెఱిగెను గోటికోటి; మునిమన్కుఁడు వానికి విశ్వరూపుఁ డు
క్కఱినమహేంద్రు విష్ణుకవచావృతి దైత్యులఁ గొల్వఁజేసె ని
త్తెఱగు భవత్ప్రతాపములు దెల్పవశమ్మె మరుత్పురాలయా ! ౨౩౨

కొడుకునుగోరి యంగిరసుఁగొల్చి తదీయకృపోపలబ్ధిచే
బడసినపుత్రు శత్రువులపాల్పడి కోల్పడి శూరసేనమే
లెడు దొర చిత్రకేతు వెనలేని విషాదమునొంది మోహముం
గుడిచెను నీదుమాయపయికొన్న తరంబగునే తరింపగన్. ౨౩౩

వానియెడన్ దయందలఁచి వచ్చి సురర్షియు నంగిరస్సుతో
వానికుమారు ప్రాణ మొకపాట ఘటించిన, నంతలేచి యె
వ్వాని కుమారుఁ డౌదునని పల్కుచు నాపసివాఁడు మాటలో
మానిచి మోహముం, దమసమర్చనకుం బురిగొల్పె నానృపున్. ౨౩౪

బోధమునంది యమ్మునివిభుం డుపదేశనిదేశమీయ బల్
సాధన స్తోత్రమంత్రముల సారెకు నీదగు శేషమూర్తి నా
రాధనసేసి యేఱునొక రాత్రులలోన నకుంఠబుద్ధి వి
ద్యాధరనాయకాగ్రసరుఁడై భజియించెను ని న్ననంతునిన్. ౨౩౫

తామరతూడువోలె విశదమ్మయి దివ్యఫణా సహస్రశో
భామహితంబునై స్వజన బాంధవమౌ నొక రూపుతోడ నా
నాముని సిద్ధకోటి స్తవనంబుల నందుచుఁ దోఁచి యాత్మవి
ద్యామహితోపదేశమిడి యంతటిలోఁ జనినాఁడ వీశ్వరా ! ౨౩౬

ఆ దొర భక్తకోటి దొర హర్షులమైన మనమ్ముతోడ నా
నాదిశలందు సర్వభువనమ్ముల లక్షలులక్షలేండ్లు నీ
మీది ప్రబంధముల్ హృదయమేళన మేలననేసి పాడుచున్
సాదృతి సుందరీమణుల సంగములేక చరించె నింపుగన్. ౨౩౭

ఉన్న యొకింత సక్తియదియుం దొలఁగింపగ మీరుత్రోయ న
య్యున్నత రౌప్యశైలమున నుండి మహామహులున్న గోష్ఠిలో
గ్రన్ననవ్రాలి శంకరుని గాంచి ప్రియం దొడనిల్పుకొంచె శం
భన్న స్మరారియంటయని హాసముతోఁ బరిహాసమాడినన్. ౨౩౮

ఉమ శపియించె, శాపమున కుల్కఁ దొకింతయు ; శాపమోక్షమా
యమ నడుఁగండు ; వృత్రుఁడన నాసురభావము నొంది యింద్రుఁ గ
య్యమునకుఁ బిల్చి శత్రుఁడన కాతని కాత్మ గురించి చెప్పి త
ద్భ్రమ దొలఁగించి నీ పరమధామముఁ దాఁ బడసెన్ క్షణమ్మునన్. ౨౩౯

ఇంద్రుని జంపు నూహగలదే దితి, దానికి నీదు సేవ ని
స్తంద్రతఁ జేసియున్నది, నిజ మ్మటు లుండియుఁ గాంచెనౌర ! య
య్యింద్రుని కాప్త మిత్రుల బళీ ! మరుదాఖ్యుల వేల్పులన్, దమ
స్సాంద్రులకేని నీ కొలుపు సర్వ శుభప్రద మయ్యెడున్ హరీ ! ౨౪౦

*

# నారాయణీయము

## సప్తమస్కంధము

### ౨౪. ప్రహ్లాద చరిత్ర

అనుజుం డీల్గె వరాహమూర్తి యగు దైత్యధ్వంసి నీ చేతిలో
నని శోకాన హిరణ్యపూర్వకశిపుం డత్యుగ్రుఁడై విహ్వలిం
చిన చిత్తాన నినున్ వధింతునని చేసెన్ మున్ను తీవ్ర ప్రతి
జ్ఞను దోర్దండము మూలముల్ సరచి రక్షశ్చక్ర మధ్యమ్మునన్. ౨౪౧

హరి! హరి ఘోరమైన తపమందుఁ జరించి విరించిచే సురా
సురవర జంతుకోటి నొకచోఁ దనకున్ మృతి లేనియట్లుగా
వరము గడించి పెన్ బొగరువట్టి జగమ్మలయించి యింద్రుమేల్
సిరి హరియించి నిన్ సరకునేయఁడు క్రిందును మీఁ దెఱుంగఁడున్.

నిను జంపన్ జనియెన్ వికుంఠమునకున్ నీవున్ బహిర్దృష్టి వా
పని యమ్మూర్ఖు హృదంతరాన వరిముల్వాటమ్ముగా నున్న, ని
గ్గనలే కూరక బొబ్బరించుచు దెసల్ గాలించి తూలించి పో
యెను బో పో హరి యోడిపోయెనని తానే గెల్చిన ట్లుబ్బుచున్. ౨౪౩

అవలన్ వానికిబుట్టి గర్భమునఁ బ్రహ్లాదుండు, వీణాధరుం
డవు మౌనీంద్రునిబోధ భక్తిమహిముండై జాతిచే రక్కసుం
డవు నైనన్ హరి! నీ పయిన్ వలపుమెండై సాధుసౌజన్యవై
భవుఁడై యొప్పె నశేషభక్త నివహప్రారంభ దృష్టాంతమై. ౨౪౪

తనసుతునందు నీ చరణదాస్యము దానవకోటిహాస్యముం
గని గురుశిక్షలం దసుర గట్టిగ గట్టిన, వారునేయు బో
ధనమది భద్రసాధనము దానెటుగాదని బాలకుండు నీ
వినుత యశస్సుధారసము వింపులఁదేలి కరంబు రంజిలెన్. ౨౪౩

చదువుల సారమేమనగ, సారసలోచనుమీఁది భక్తి సం
పదయని తండ్రితో నెదురుపల్కిన, నుల్కి గురూపదేశ మి
ట్టిదియని వారిఁదిట్టి మఱియెవ్వరు నేర్పనివిద్య వచ్చి ప
డ్డదియని తండ్రి నీదు చరణైకశరణ్యు నదల్చి రొప్పుచున్ ౨౪౬

శూలాగ్రమ్మునఁ గ్రుచ్చి, ఘోర విషముఁ జొప్పించి, యాశాంత శుం
డాలమ్ముల్ మెయిఁదొక్కఁబంపి, నడికొండన్ మీటి దొర్లించి, స
ర్పాళిన్ మైకఱపించి మించిన క్షుధాఘారాగ్ని నొప్పించినన్
బాలుం డించుకయేని కందఁడు భవద్భావాత్తతాదాత్మ్యతన్. ౨౪౭

ఆయది చూచి వాడును దురాగ్రహుఁడై గడు నుగ్రుఁడై యుపా
ధ్యాయుల యింటనుంచి సుతు దారుణ వారుణ పాశబద్ధునిన్
జేయ, గురుల్ దొలంగిచనఁ జీరి సురారికుమారుఁ డా సహా
ధ్యాయుల కాత్మభక్తి భరితమ్మగు వైష్ణవబోధ నేసినన్. ౨౪౮

బాలకు బోధలన్ దనుజ బాలకు లందరు గోపబాల లీ
లా లులితాత్ము లైరని కలంగి "కులాంతక ! నీ బల మ్మెవం
డాలము లేక తెల్పు" మన నర్భకుఁ "డా హరి నాకు నీకు లో
కాళికినిన్ బల" మ్మని చరాచర మాతఁ డొకం డనెన్ ధృతిన్. ౨౪౯

హరి విశ్వాత్మకుఁ డందు విందుఁగలఁడా యంచున్ సురద్రోహి స
త్వరతన్ చేఁ గరవాలమూఁచి భవనస్తంభమ్మునన్ గొట్టె; నా
తరమా పల్కఁ? కృపాంతరంగ! భవిరంతర్వ్యాప్త! వాతాలయే
శ్వర! యామీఁది భవద్భయానకరస వ్యాపార పారీణతల్. ౨౪౦

## ౨౫. నృసింహావతారము

స్తంభాఘాతరవమ్ము కర్ణకుహరాస్తంభమ్ము గూర్పన్ జగ
త్కంభ మ్మెల్ల విఘూర్ణమానమయి యా ఘోరాసురానీక రా
డ్గంభీరోగ్ర హృదగ్రవీధిఁ జటులోత్కంపమ్ముఁ గల్పించె; న
య్యంభోజాసనుఁడున్ జలించె ప్రళయాభ్రావిర్భవ భ్రాంతిచే. ౨౪౧

దిక్కుల్ దిక్కులుచూచుచున్ బఱచి యుద్రేకించి స్తంభాన నే
మొక్కో భీషణ ఘోషణమ్మనుచు లోనుద్భ్రాంతుఁడౌ నాఖలున్
ధిక్కారింప మృగంబుగాక నరుఁడేనింగాక రెండౌచు నా
చక్కిం దోచితి వక్కజమ్ముగ సటాజాలమ్ము నిక్కించుచున్. ౨౪౨

* తప్తస్వర్ణ సవర్ణఘూర్ణ చటులోదగ్రాక్ష ముద్యత్సటా
వ్యాప్తోత్కంపినికుంబితాంబరము ఖడ్గాగ్రోగ్రజిహ్వాగ్ర సం
దీప్త ప్రోద్ధత దంష్ట్రికాయుగ మహాదిగ్ధాద్రిరాడ్గహ్వరో
ద్దృప్యాస్యమ్మయి మాయుపాస్య మిరవొందెన్ శ్రీ నృపంచాస్యమై.

---

* పుటముంబెట్టిన జాళువా మిసిమికెంపుల్ నింపు కన్నుల్ సటా
చ్ఛట నిక్కన్ వడి నింగికిం దుముకుచున్ జంచద్గుహా ఘోరమౌ
నటులౌ మో మసిధారవోలెఁ బదనై యల్లాడు జిహ్వాగ్ర ము
త్కట దంష్ట్రాయుగళోగ్రమౌ నరమృగాకారమ్ము భావించెదన్.

వలిభంగస్ఫుట గండమై పృథుల హ్రస్వగ్రీవమై దోశ్శతా
కలితోద్యన్నఖపుంఖపుంఖితరుచిక్రాంత్యుల్బణమ్మై నఖో
వలయోల్లంఘి ఘనాఘన ప్రతిఘన ప్రధ్వాన నిర్ధావితా
ఖిల ఘోరాసురమౌ నృసింహమునకున్ గేల్మోడ్తు నీ మూర్తికిన్. ౨౫౪

ఇడుగో విష్ణువు ద్రుంతుఁగాకని గదా హేరాళ హస్తోద్ధతిన్
వడిఁ బైపై పడువాని బాహుయుగళిన్ బంధించి సంధింప నీ
సడరం బట్టు తొలంగి డా ల్పలకతోనై వాఁడు జృంభించె లో
నడలం డింతయు నిన్ జగత్కబళన వ్యాటోపునిన్ డాయగన్. ౨౫౫

అటు దితిజాధముండు దిరుగాడగ నీ పృథుబాహు వల్లరిన్,
చటుకనఁజుట్టి ముంగడప చాయల నీతొడ దాపి రొమ్మునన్
బటు నఖరాగ్రము ల్దిగిచి పాయలుసేసి తదుగ్రగర్భ ని
ష్కుటగళ దస్ర ధారలను గ్రోలితి వుద్భట సింహగర్జనన్. ౨౫౬

గుటగుట ద్రావి రక్తనదకోటులు మేన నలంది దైత్యు నీ
వటు లెగమీటి సర్వదితిజాధమ భక్షణ మారభింప ది
క్తటుల గుభిల్గుభిల్లనె నగమ్ములు వార్ధులు వొంగె వేల్పు లా
ర్భటపడి రాకులించె దురవస్థఁ జరాచర భూత సంఘముల్. ౨౫౭

అరుదౌ మాంసవసావపాస్థిభరిత మ్మారక్త ధారాధర
మ్మురు ధారాధర ఘోరగర్జనము నోహో! ఆంత్రమాలాసము
త్కర రౌద్రమ్మగు మూర్తిచూడ వెఱఁగై కంపించి దూరాన ని
ల్చిరి బ్రహ్మేంద్ర సదాశివాదులు సురల్ వేర్వేర నిన్వేడుచున్. ౨౫౮

నీదానుగ్రత తగ్గకున్నగని వాణీజాని పంపంగఁ బ్ర
హ్లాదస్వామి భవత్పదాబ్జముల వ్రాలన్ బూర్ణవాత్సల్య లీ
లోదీర్ణమ్మగు శాంతి నొదల కర మ్మూనించి, తత్కీర్తనా
స్వాద స్వాదువవై యయాచిత వరప్రాప్తిన్ గటాక్షింపవే. ౨౯

ఇత్యాకారక రౌద్రనర్తన సమాధీ ! తాపనీయాభిద
శ్రుత్యంత స్ఫుటగీత దివ్యమహిమా ! శుభ్రద్యుతీ ! భక్తి సా
హిత్య శ్రీ మకుటాయమాన సుషమా హేరాళ ! ప్రహ్లాద సం
స్తుత్య ! శ్రీ గురువాయు మందిర సుధాజ్యోతీ ! నమస్కారముల్. ౩౦

★

# నారాయణీయము

## అష్టమస్కంధము

### ౨౬. గజేంద్రమోక్షము

ఇంద్రద్యుమ్నుఁడు పాండ్యదేశపతి నీ కెంతేని భక్తుండు ని
స్తంద్ర ధ్యానసమాధిఁ జందనగిరిన్ దానుండగా వానిపై
సాంద్రప్రీతి నగస్త్యుఁడే యతిథియై సాక్షాత్కరింపంగ రా
జేంద్రుం డమ్మునివంకఁ జూడకయ పోయెన్ దుర్విధిప్రేరణన్. ౨౬౧

మదమునఁ గన్ను గానవటె మాన్యుని నన్ గనుగొనఁజూడ వు
న్మదకరివై చరించెద వనన్ భయమంది క్షమార్పణమ్మనన్;
సదయత నా క్షమాపతికి శాపము తప్పదుగాని భక్తి సం
పద భవదీయ సంస్మృతియుఁ బాయదనెన్ ముని యా క్షణమ్మునన్.

క్షీరాంభోనిధి నాత్రికూటగిరిపై క్రీడించుచున్ గుంభినీ
వారమ్ముల్ దశలక్షకోటి వరియింపన్ దత్కరాంభోజ వా
ర్ధారావృష్టి గజాధిరాజు పదవిన్ రంజిల్లె నారాజు; నీ
వా రావా రెటువోయి యభ్యుదయలాభస్ఫూర్తికిం బాత్రముల్. ౨౬౩

అమిత ప్రాగ్భవదీప్తి కొంత, యటుపై నాపుణ్యదేశ ప్రభా
వము కొంతై మదినెట్టితాపములు తోపన్రాక నైదాఘ తా
పము చల్లార్ప కరేణుయూథములతోఁ ద్వత్ప్రేరణన్ వారణో
త్తమ రాజన్యము చల్లులాడె గిరికాంతారాంత రంభఃస్థలిన్. ౨౬౪

ఒకచో దేవలశాపముం గనిన హూహూనామ గంధర్వ నా
యకుఁ డా నీటఁ జరించుచున్ మొసలియై హస్తీంద్రుపాదంబు ప
ట్టుక బాధింపఁదొడఁగె నుద్ధత మదాటోపాన; నీవారి నూ
రక వేధింతువు మున్న ఖండ సుఖ సామ్రాజ్యాభిషేకానకున్. ౨౬౫

నిను సేవించిన పుణ్యమై భవమునన్ వేయేండ్లు విశ్రాంతి నే
డని లేకుండగఁ బోరె వారణవిభుం డారీతి కాలమ్ము రాఁ
జనగాఁ ద్వచ్చరణస్మృతిన్ బరమనిష్ఠాయోగ మంధింప నా
తని గ్రాహగ్రహ దుర్ముఖమ్మునకు సంధానించినా వీశ్వరా! ౨౬౬

ఆర్తుండై నకొలంది పూర్వభవ దీవ్యద్ జ్ఞాన భక్తిస్స్పృహల్
స్ఫూర్తిన్ నిల్వగఁ దొండమెత్తి జలజమ్ముల్ గోసి యర్చించి యా
వర్తించెన్ మఱి స్తోత్రపాఠమదియుం బ్రాగ్జన్మ లభ్యమ్ము స
ర్వార్తి ధ్వంసము నిర్గుణాత్మక పరబ్రహ్మైక తాత్పర్యమున్. ౨౬౭

విని యా కేవల నిర్గుణస్తవము నా పిల్పిందులో లేదు నా
పనికా దీస్తుతి నన్ను గాదనుచు నా బ్రహ్మేంద్ర రుద్రాదు లా
తని కడ్డంబడ రార యొక్కరు; గరుత్మద్వాహనారూఢుఁడై
యనఘా! శ్రీహరి నీవ వచ్చితివి సార్వాత్మ్యంబు దీపింపగన్. ౨౬౮

కరిరాజున్ గరపద్మ మూత యిడి యాకర్షించి చక్రమ్ముచే
నురునక్రమ్మును గోఁత పెట్టితివి; వాఁ డొండొక్క గంధర్వుఁడై
పరగన్ శాప విముక్తినంది; యవలన్ బాత్రమ్మునై యొప్పె నీ
శ్వర! యమ్మత్తగజమ్ము నంచిత భవత్సారూప్య సంసిద్ధికిన్. ౨౬౯

ఈ కథ నిన్ను నన్ దలఁచి యింపుగ నమ్మలయానిలాంకుర
శ్రీ కొసరించు వేకువలఁ జెల్వుగఁ బాడినవారు భద్రముల్
చేకొన నేర్తురం చతని జేకొని నీ సదనమ్ముఁ జేరి నా
వో కమలేశ ! యేలుకొనవోయి ననున్ బవనాలయేశ్వరా ! ౨౬౦

## ౨౭. అమృతమథనము. కూర్మావతారము

తనకై యచ్చర లిచ్చినట్టి సుమనోదామమ్ము దుర్వాసుఁ డి
చ్చెను దేవేంద్రుని ; కాతఁడున్ విసరివై చెన్ దాని నైరావత
మ్మున ; న ద్దానిని గాలరాచె నది య మ్ముక్కోపి యింద్రున్ శపిం
చెను ; నీ పాలది లేనివారికి క్షమాశ్రీలాభ మేదీ హరీ ! ౨౬౧

అమరవిభుండు నష్టశుభుఁడై ముదిమిం బడె శాపదగ్ధుడై
యమరు లరాతి నిర్జితులునై విగతద్యుతులైరి, శంకర
ప్రముఖులు నంతటం గదలి బ్రహ్మను జూచి రతండు వారునున్
విమల భవద్వికుంఠపుర వీథికి నిన్ గనవచ్చి రచ్యుతా ! ౨౬౨

నిను బ్రహ్మాదు లనేకకాలము గుణానీక మ్మనేకమ్ముగాఁ
గొనియాడన్ గొనియాడరాని వెలుఁగై గోవింద ! సాక్షాత్కృతిన్
జనవుం గూరించి దేవతల్ దితిజులున్ సంధానమై కవ్వముం
గొని ద్రచ్చుం డమృతాన్న మక్కడలి మీకున్ లభ్యమౌ నంచనన్.

అటు లమృతాశనుల్ గదలి యప్పలలాశన కోటితోడ నా
క్కటియయి మందరాద్రి పెనుగవ్వముగాఁ గొనిరాగ దారిలోఁ
జటుకున జారిపో నుభయ సంఘము లార్వగ రేగుపండు ము
చ్చటగ ఖగేంద్రుపైనిడి వెసన్ గొనివచ్చితి వన్నగేంద్రమున్. ౨౭౪

వడిఁ దరిత్రాడు సేసికొని వాసుకి వాసికిమీఱఁ ద్రచ్చి ర
క్కడలి నశేష బీజములు గ్రాలగ ; ముందలనొన్న వేలుపుల్
బడలు వడంగఁ గొందొక నెపమ్మిడి యా తలతోకమార్చి నా
వడలి విషాగ్నిదాకి నివురై రటుపైఁ దలకొన్న రక్కసుల్. ౨౭౫

గుభులుగుభుల్లటంచుఁ బరిఘూర్ణిత దుగ్ధపయోధి నిర్భరా
రభటి నభమ్ము దాకికొనఁ ద్రచ్చగఁ, గవ్వపుకొండ క్రిందికిన్
రభసమునన్ దిగంబడ, సురల్ బెదరన్, మఱి తాల్చినావు దు
ర్లభము కఠోరపృష్ఠ చటుల ప్రభమున్ గమఠాభమున్ హరీ! ౨౭౬

నీ వెనుగాడి వజ్రకఠినీకృతమై మఱి లక్ష యోజన
మ్మై వెలుఁగొంద నబ్ధికుహరావృత దీర్ఘవపుఃప్రభావ సం
భావన నుద్ధరించితివి మందరపర్వత మీ వఖర్వ లీ
లావలమాన సంభ్రమ కలా కమనీయ కలాయకోమలా! ౨౭౭

అటు ఝటితి ప్రకారమున న్నాగిరి నెత్తిన నెత్తికొన్న త
చ్చటుల సుఖాతిరేకమున సర్వులు పొంగిరి పొంగిపోయి నీ
వట నిరువంకలందు నురగాధిపులో శ్రమమెల్ల వాప న
ప్పటికి సముద్రమున్ వెడలి వచ్చితి ముచ్చటగొల్పు చెల్వునన్. ౨౭౮

గిరగిర బొంగరమ్ముటులఁ గ్రీడగఁ ద్రిప్పుచుఁ గేలుతామరన్
బిరబిర మందరమ్ము నెగమీటుచు వచ్చిన నిన్నుఁజూచుచున్
జరచర నవ్వియచ్చరులు సారసగర్భగిరీశముఖ్యు ల
య్యెరవునఁ బుష్పవృష్టి గురియించిరి నించిన వేడ్కఁ బాడుచున్. ౨౯

భుగభుగలాడు తద్భుజగ ఫూత్కృత ఘోరవిషానల ప్రభన్
భగభగ మాడిపోవు సురవైరులపై నొక చిన్కు లేదుపో
సగము సగమ్ముగా నుడుకు సర్వసుపర్వులమీఁద కుండ పో
తఁగ గురిసెన్ భవత్కృప సుధారసపర్వ మొనర్చి యయ్యెడన్. ౨౧౦

భ్రామ్యన్నక్రతిమింగిలాకులిత మత్త్వభ్రాంతమై యబ్ధిని
స్సామ్య ప్రక్రియమై మథింపఁబడి విశ్రాంతస్థితిం బొందె; పా
రమ్యమ్మొంది కరమ్ములందు భుజగేంద్రస్వామి లాలించుచున్
గమ్యుండైతివి కామతాకృతి రుజల్ ఖండింపరారా! హరీ! ౨౧౧

## ౨౬. కాలకూటాద్యుత్పత్తి - లక్ష్మీ స్వయంవరము- అమృతోదయము

గనగన మండుచున్ విషము కంథి జనింప గలంగ నెల్లరుం
గని గరళంబు కుత్తుక నెగాదిగగా నటు లుబ్బులింగఁ డా
యన కబళించె నిందుమకుటా! యని వేల్పులు పిల్చివేడ నౌ
నని, తుహినాద్రి కన్యక యపాంగశుచిస్మిత రోచి చల్లగన్. ౨౧౨

సురభి జనించె దానిని ఋషుల్ గొని రీవ యొసంగ, వెండియున్
శరధి సురాసురుల్ దఱువ సామజరత్నము నశ్వరత్నమున్
సురతరుబృంద మయ్యమరసుందరు లందదయించి రప్పు డం
దరని సురాళి కాన్కగఁ గొనం దయచేసితి వాప్తబంధువై. ౨౮-౩

కలకల లాడుచున్ గలిమికన్నియ వన్నెలమిన్న నీపయిన్
వలపులఁగుల్క కల్కి యెలనవ్వులతో నటఁ దోఁచినంత న
క్కులుకుమిటారి తళ్కుబెళుకుల్ గని యొండొకచూపులేని చూ
పుల వెలబోసి లోఁగొని రపూర్వ తదీయవిలాస మెల్లరున్. ౨౮-౪

ఆగతి నిన్నెకోరు నమృతాగ్రజ నయ్యమరేశ్వరుండు వే
వేగమ దివ్య భర్మ మణిపీఠిక కల్లన దింపె నంతలో
మూగి యశేష మౌనికులముల్ శ్రుతిసూక్తుల నాభిషేచన
శ్రీ గదితార్థయుక్తి నభిషేకముసేసిరి చూడ్కి విందుగన్. ౨౮-౫

ఆ రుచిరాభిషేచన రసానుగత త్త్వదపాంగరోచి రా
పూర తరంగితన్ భువనమోహిని శ్రీ లలితాంగి నెల్ల బృం
దారక బృందముల్ మణికనత్కనకాంగదహారకుండలో
దార దుకూలజాలము లుదారతఁ దీరిచిదిద్ది రత్తఱిన్. ౨౮-౬

ఉరులజ్జాలసమాన మాధురికి నింకొక్కింత తోడై పయో
ధర కుంభద్వయిఁ గొనుదీగ వడఁకన్ దన్వంగి వచ్చెన్ స్వయం
వరమాలా కర సంభ్రమద్భ్రమర ఝంఝన్మంజు శింజాన నూ
పుర నాదమ్ములు తూర్యనాదములుగాఁ బూఁబోఁడి నీచెంతకున్. ౨౮-౭

అందరునున్ గుణాశ్రయులె యైనను దోషముస్పర్శ లేనివా
రిందరుఁ గారటంచు గ్రహియించి విరించి శివాది దేవతా
బృందము దాటి సూటిగ వరించె నినున్ మణికంకణావళుల్
సందడిసేయ నీదుమెడఁ జారువిలోచన వైచె మాలికన్. ౨౮౮

వేగమ నీదువక్షమున విశ్వజగజ్జననీమణిన్ గృపా
సాగర ! గారవించితివి సాగరకన్య కటాక్ష చంద్రికా
శ్రీ గురిపించె నచ్చటన చేరి యశేషజగత్కుటుంబినీ
యోగము నంది విశ్వము నహో పరిపుష్టి గడించె నంతటన్. ౨౮౯

మాదకమై పుట్టె జనో
న్మాదకమై భువన మోహనమ్మపుడు తమో
మేదురమై వారుణి నీ
వాదృతి లాలించి యిచ్చి తసురుల కదియున్. ౨౯౦

అంతట లేతమబ్బుతళు కందము గొల్పగఁ బాలవెల్లి ధ
న్వంతరి రూపమై యుదయమంది సుధారసపూర్ణకుంభ మ
ల్లంతనఁ ద్వత్కరాంబుజమునందు ధరించి స్ఫురించినావు నీ
వెంత చికిత్సకుండవొ కదే మరుదాలయ ! ఆర్తిఁ బాపుమా. ౨౯౧

## ౨౯. విష్ణు మాయా ప్రాదుర్భావము

### మోహినీవేషము

వచ్చితొ లేదొ నీదు కరపద్మమునం దమృతమ్ము రక్కసుల్
ద్రుచ్చిలి రంత వెల్లమొగముల్వడి వేల్పులు డిల్లవోవగా
నచ్చటనే తిరోహితుఁడ వైతివి నీ మహిమమ్ముచేత బల్
ద్రుచ్చులు దైత్యులెల్లఁ దమలోఁ దమరై తుమురైరి పోరులన్. ౨౯-౨

హంగగు మేనికాంతి వయసందున శ్యామవనంగ నొప్పి యు
త్తుంగకుచద్వయిన్ నడుము తూగనటింపగఁ జూచి దప్పిపెం
పుంగొని సోలిప్రాలుచు నపూర్వభవత్కుచకుంభవిభ్రమ
మ్ముం గొననెంచి కాదనిరి పూర్వసుధారస పూర్ణకుంభమున్. ౨౯-౩

ఓహరిణాక్షి! నీవెవతవో యమృతమ్మిది పంచుమంచు వ్యా
మోహము సెంది మైమరచి పొందిక డగ్గరి వేడువారి స
న్నాహము సూచి వాడవదినన్ నను నమ్మిన నవ్వుబాటు సం
దేహము లేదటంచునె పదింబడి నమ్మికపుచ్చి తందఱున్. ౨౯-౪

వాయనిపొంగుతో నమృతపాత్రము వారటు తెచ్చి చేతికం
దీయగఁ, జేఁతగా దబల నేనెదిసేయఁగ బోయియేమిగాఁ
జేయుదునో యటం చొడుపుసేసి వడిన్ గిరిగీఁసి వేల్పు లా
ప్యాయన మన్నదా కమృత మానగఁబోసి తొయారమౌనదన్. ౨౯-౫

మన మీఁదన్ వల పెంతయేని కల దిమ్మాన్యాత్మ కంచున్ విలా
సిని నీవంకనె చూడ రక్కసులు నిశ్శేషమ్ము గావింప నీ
జనమం దయ్యమృతమ్ము వంచి, నిజ పక్షమ్మౌని నీరూపుతో
జని స్వర్భానుని వ్రక్కలించితి సుధన్ సాబాల్గొనన్ శీవిమై. ౨౯౬

శ్రమ మెల్లన్ మనదై ఫలమ్మెదిరిదై సర్వస్వమున్ బోయె నం
చమరశ్రేణి నెదిర్చి రయ్యసురు లమ్మైదేవతానీక మె
ల్ల మునింగెన్ బలి మాయలోన నది యాలక్షించి యయ్యుద్ధరం
గములో నెక్కడినుండి వచ్చితివొ సాక్షాత్కార మైనావొగిన్. ౨౯౭

ఈవట కాలనేమి వధియించితి మాలిముఖాసురావళిన్
జావనఁ బుచ్చెఁ బాకు బలి జంభబలున్ మఱి నింద్రుడేచి య
చ్చో వధియించె నన్నముచి శుష్కము నార్ద్రముగాని నుర్వుచే
నావల యుద్ధ మాపితి వయారె తటాలున నారదోక్తులన్. ౨౯౮

దనుజుల మోహపెట్టుటకుఁ దాల్చిన నీ నవమోహినీ కళన్
విని కనఁగోరి భూతములు వెంబడిరా గిరికన్య వెంటరాఁ
జని చని నీదుజాడ గని సంస్తవనమ్ము లొనర్చి కోరికన్
వినిచె ననంగవైరి వెనువెంటనె నీవు తిరోహితుండవై. ౨౯౯

ఆరామమ్మున బంతి యాడుకొనుచో నాలోల నేత్రాంచల
శ్రీ రాణింపఁగ కట్టుచీర దెరలన్ శృంగారభావంబు పొం
గారన్ జేసెడు ని న్ననంగదమనుం డాలింగన క్రీడన
ప్రారంభుండయి యొప్పె మాన్మథ శరవ్యాపార లక్ష్యాత్ముడై. ౩౦౦

పఱువెత్తెన్ పఱువెత్తు నీ వెనుకనే పద్మాక్షు! ఫాలాక్షుఁ డ
త్తఱి తేజస్స్ఖలనంబు నొంది పరమార్థస్ఫూర్తియుంగాగ నే
ర్తెఱ నీచే నుపలాలితుండగుచు నీ దివ్యానుభావంబు లో
తెఱుఁగన్ జెప్పెను దేవి కిత్తెఱఁగు వాఁ డీ వేలుకోరా హరీ! ౩౦౧

## ౩౦. వామనావతారము

అనిలోఁ గూలి మహాత్ముఁడైన బలి దేవాధీశుచే, శుక్రుచే
పునరుజ్జీవితుఁడై, క్రతుప్రతతిఁ బెంపుంగాంచి బల్ విక్రమ
మ్మునఁ జక్రాయుధ ధారకుం బెదరకే ముల్లోకముల్ దానలో
గొనియెన్ వేల్పులు మూలమూలల భయోత్కోచమ్ముచే డాగఁగన్. ౩౦౨

పనవి కుమారులందరి యవస్థకుఁ, గాశ్యపమౌని జీవితే
శుని శరణొంది యయ్యదితి సొంపుగఁజేసె పయోవ్రతాఖ్య మా
యన యెఱిఁగించినట్టుల త్వదర్చనముం బరిపూర్ణ భక్తిభా
వనఁ బదిరెండురోజులు శుభస్ఫురణన్ దృఢదీక్ష పెంపునన్. ౩౦౩

వ్రతము సమాప్తియం దదితిభావము నీ మధురస్వరూపమం
దతుకగ శ్యామసుందరుఁడ వౌచుఁ జతుర్భుజుఁడౌచు నీవు దో
చితివి వినమ్రయౌ నదితిచెంత; భవత్తనయుండ నయ్యెదన్
సతతము గోప్య మీక్షణము నాదని యేగితి వాక్షణమ్మునన్. ౩౦౪

అవలఁ గాశ్యపమౌని తీవ్రవతపమం దారూఢనిష్ఠఁ వసిం
ప విరించి స్తుతిమెచ్చి నీ వదితిగర్భంబందు రా దివ్య వై
ష్ణవ రూపుఁ బ్రసవించె నిఁ పరమపుణ్యంబైన లగ్నమ్మునఁ
శ్రవణద్వాదశి నప్పతివ్రత కృపాసర్వస్వరూపా హరీ! ౩౦౫

అల పుణ్యాశ్రమ వీథి దేవగణముల్ హర్షప్రకర్షమ్ము లో
నలరఁ నించిరి పుష్పవర్షముల నుద్యత్తూర్య ఘోషమ్ములఁ
దలిదంద్రుల్ వినుతించుచుఁ జయజయ ధ్వానంబులఁ జేసి యం
జలిగావింపగఁ బూనినా వచట సాక్షిద్వామనాకారముఁ. ౩౦౬

అజినమ్ముఁ మృదుదండ మక్షవలయ మ్మమ్మౌంజి యొక్కొక్కరై
యజముఖ్యుల్ బహుమాన మిచ్చికొనగా నయ్యగ్నియుఁ వేల్చి య
క్కజముం గొల్పెడి బ్రహ్మతేజమనఁ బ్రస్థానమ్ము గావించినా
వజిత శ్రీ ప్రకృతాశ్వమేధము బలీంద్రావాస మల్లల్లనఁ. ౩౦౭

భావిమహత్త్వ వైభవము వ్యాఖ్యయొనర్చుచు మేనిగౌరవ
మ్మో వసుధాతలంబు వణకింపగ శత్రు మహోష్మవారణ
మ్మై విలసిల్లు నాగొడుగు నంది మహాసురదండనార్థమో
నా వెస దండమూని చనినావఁట ముఁ బలియజ్ఞ వాటముఁ. ౩౦౮

వని యంతంతట నర్మదోత్తర తటాంచ ద్యజ్ఞశాలాంగణ
మ్మున నీవుండ భవత్తనుప్రభల చూపుల్ సంభ్రమింపంగ నీ
యన యాభానుఁడు చిత్రభానుఁడు సముద్యద్దీప్తి యోగీంద్రుఁడా
యనయేయౌను సనత్కుమారుఁడని శంకావిష్టులై రందరుఁ. ౩౦౯

భృగుముఖ్యుల్ భవదద్భుతప్రభలలో వెల్వెల్లనై తోడితే
రగ నిన్ మోహనమోహనాకృతి; శరీరమ్మెల్లనున్ పుల్కరిం
పగ భక్తిన్ బలి పుణ్యజీవి కడిగెన్ ద్వత్పాదపద్మమ్ములన్
దగఁ దత్తీర్థము తీర్థతీర్థము తలన్ దాల్చెన్ దయాసాగరా! ౩౧౦

అటు ప్రహ్లాదుని మన్మఁడై యుదయమై యజ్ఞమ్మఁన్ విప్రులన్
జటులప్రీతి వహించుటన్ గతిన రక్షస్సయ్యనుం బొందె ధూ
ర్జటి జూటాగ్ర కుటీ నటత్సలిలధారా వాహినీరూప మి
ట్లిట నీదౌ చరణామృతాపవన మిట్లీవేలుకోరా హరీ! ౩౧౧

## ౩౧. బలి నిగ్రహము

కని దైత్యేంద్రుఁడు త్వత్తనుద్యుతుల కాకంపించి కైవంచి యి
ట్లనియెన్ నాయెడ నేమి కోరెదవు కుబ్జా! షడ్రసోపేత భో
జనమా! కాంచనమా! మణీభవనమా! సర్వంసహారాజ్య రం
జనమా! స్త్రీజనమా! యెదేనడుగుమా! సందేహమా! నీకిటన్. ౩౧౨

అనినన్ వాని యుదారవాగ్రచన నీ వాలించి వాత్సల్యమున్
గొనియున్ వానిమదమ్ము డించుటకు రక్షోనాథు వంశమ్ము వ
ర్ణనముం జేసి పదత్రయ మ్మొసఁగుమన్నా చాలునన్నావు కా
దని సర్వమ్మను నీవమై యడుగ వహ్వా నవ్వరే యెవ్వరున్. ౩౧౩

భువనేశుండను నన్ను మూఁడడుగులా పో వట్టి పిల్లాట లి
య్యవనీచక్రము కోరు మిత్తునని తీవ్రౌద్ధత్యముంజూప, తా
నవి యీనేరక యప్రతిష్ఠపడి తానై ఘోరబంధమ్ములం
దవిలెన్ దాని కనర్హుఁడయ్యుఁ బరమార్థంబైన శాంతింగొనన్. ౩౧౪

ముక్కాలిచ్చినఁ దృప్తిచిక్కదనుకో ముల్లోక మీవచ్చినన్
చిక్కంబోదన నీవు; రాజు మఱి పచ్చెన్ ధారవోయంగ నా
చక్కిన్ శోధనసేయ నీపనుపునన్ జాల్చాలు నీవద్దు పో
మ్మిక్కాన్కన్ హరిసు మ్మితం డనియె మున్నే తెంచి శుక్రుం డటన్.

భగవంతుం డిటువచ్చి నన్నడిగె నా భాగ్యమ్ము పండెన్ నిజ
మ్ముగ ముమ్మాటికి నిత్తు నంచు గురువున్ బోనాడి శప్తుండునై
తగ వింధ్యావళి ధర్మపత్నియు సుపాద్యంబీయ రాజన్యమూ
ర్ధగు డిచ్చెన్ తన సర్వమున్ సలిలధారామంత్రపూర్వంబుగన్. ౩౧౬

అమరస్పర్ధి యశేష మప్పనముసేయన్ సంశయమ్మేది తు
భ్యమహం సంప్రదదే వటో నమమ యం చన్మాటలోఁ బుష్పవ
ర్షము వర్షించిరి దేవతల్ ఋషులు నా బ్రహ్మాండ భాండమ్ముగా
నమరెన్ నీదగు దివ్యరూప మది యింతంతౌచు నంతంతయై. ౩౧౭

తనలోకమ్మును దాకవచ్చిన భవత్పాదాగ్రమున్ క్షాళనం
బొనరించెన్ విధి కుండికన్గల జలమ్ముల్ వంచి, యన్నిటఁ బా
వనమయ్యెన్ జగముల్, నటించిరమరుల్, బ్రహ్మాండముం జుట్టివ
చ్చెను భక్తాగ్రణి జాంబవంతుఁడు శుభశ్రీ భేరి మ్రోయించుచున్. ౩౧౮

అనికిన్ జొచ్చిరి రాజు నానతివినా యందోడి రాదేవతా
జనమున్ నీజనమెత్తిరాగ బలి సాక్షాత్కాలరూపుండ యీ
యన విష్ణుం డిటమున్న యోడితిమికాదా వీనితో పోరు వ
ద్దన బాతాళముఁ జొచ్చిరంతటన దైత్యానీకమొక్కుమ్మడిన్. ౩౧౯

అవలన్ గారుడ పాశ బద్ధుఁడగు దైత్యస్వామితో నీవు "మూఁ
డవ పాదానకు చోటుచూపుమిఁక బ్రహ్మాండాధిపుండీవయా
దువు కాదా" యన నప్రకంప్యమతి నీతో మూర్ధమందుంప మా
ధవ యన్ మన్మనిమెచ్చి నిన్బొగడె నంతన్ వచ్చి ప్రహ్లాదుడున్. ౩౨౦

నీదర్పమ్ము హరించినాము బలి ! యింతే పుణ్య సిద్ధుండ వ
య్యా దేవేశ్వరుఁడౌదు వీపయిన స్వర్గాతీతలోకమ్ము నో
హో దైవారు; భజింతు నాదయిన సాయుజ్యమ్ము వంచున్ మఖ
శ్రీ దీక్ష పరిపూర్తి ఋత్విజులచే చేయించినా వీశ్వరా ! ౩౨౧

## ౩౨. మత్స్యావతారము

బ్రహ్మ యాజవకల్పమ్ము పవటివేళ
దాటి నిద్రోన్ముఖుండైన తన్ముఖంబు
నుండి శ్రుతుల హయగ్రీవు డొక్క యసుర
ముచ్చిలన్ మత్స్యరూపమున్ బూనినావు. ౩౨౨

ద్రమిళ దేశేశ్వరుండు సత్యవ్రతుండు
నదిని దర్పణమొనరింప సదమల ప్ర
భాతి శయమొప్ప నొక చిన్ని బాలమీన
మిదియనన్ వాని దోయిటన్ మెదలినావు. ౩౨౩

నీటనిడ మిట్టిపడఁ జూచి నిన్ను పాత్ర
మందుకొని యింటికేతేర నంతకంత
కడరి యంతంతగా నూతియందు చెఱువు
నందు నిముడని మహిమ నీవొందినావు. ౩౨౪

యోగమహిమను నీదు నియోగమునను
నతఁడు నిన్ను సముద్రమం దవతరింపఁ
జేసి కల్ప నిరీక్షణ సేయ నతని
నిలిపినావందు సప్తాహ నియతి నేసి. ౩౨౫

ఈవు తెల్పిన రోజు రా నెలమి బంతి
లీల పెనునీట నిన్నేల తేలిపోవ
నీది పరమర్షి సప్తర్షులెల్ల తనకుఁ
దోడురా నిన్ను శరణొందెఁ దోయజాక్ష! ౩౨౬

వారు నీయాన నియ్యెల్ల ధారుణియును
నోడయై తేల దానిపై కురికినారు
ఓడయూగఁగ దానితో నూగినారు
కడలి యంతట నీవయై కదలినారు. ౩౨౭

అచట నిన్ లక్షయోజనాయతుని( జూచి,
ఎలమి మత్స్యాకృతి తళుకు బెళుకు కులుకు
నిన్ను మునికోటి నుతియించి నీదునాజ్ఞ
నీదు కొమ్మున నోడ బంధించినారు. ౩౨౮

నౌకనడపుచు మునిజనానీకమున కు
దార విశ్వవిభాగ సౌందర్య దర్శ
నమ్ము గూరిచి జ్ఞానబోధ మ్మొనర్చి
నృపుడు నిన్నెన్న నట విహరించినావు. ౩౨౯

కల్పమవధిని సప్తర్షి గణము పూర్వ
మట్లు నియమించి సత్యవ్రతాఖ్యునతని
మనిచి వైవస్వతాఖ్యు(డౌ మనువు చేసి
యా హయగ్రీవు పైకేగి తాగ్రహమున. ౩౩౦

కొమ్మునన్ వాని రొమ్మునన్ గ్రుమ్మి చీల్చి
కూల్చి యసురను వేదముల్ గొని విరించి
మెచ్చుకొన నిచ్చినావు సమీరపురవి
హారి! నారాయణా! ప్రోవరార నన్ను. ౩౩౧

*

# నారాయణీయము

## నవమస్కంధము

### ౩౩. అంబరీషోపాఖ్యానము

అల వైవస్వతపుత్రు డొప్పెను నభాగాఖ్యుండు తత్పుత్రుఁడై
యలఘుప్రాభవుఁ డంబరీషుడన సప్తాంభోధి పర్యాప్త భూ
వలయమ్మేలుచు నీపయిన్ మఱియు నీ భక్తాళిపై భక్తి ని
స్తులుడై యొప్పెను సాధువై పరమసంతోషాన నోలాడుచున్. ౩౩౨

నీకైంకర్య మొనర్చుచున్ దను ధనానీకంబు నీదన్న యా
లోకారాధ్యుని మీద నీదగు కృపాలోకమ్ముల న్నించి తా
నై కామింపక యున్నఁ బంపితివి రక్షార్థంబు రక్షోజనా
నీక క్రూరపరాక్రమక్రమభిదా నిర్వక్రమున్ జక్రమున్. ౩౩౩

అఱువదికోటి గోవుల ద్విజాళికొసంగి ముకుందు నర్చనల్
నెఱపుచు ధర్మపత్ని తననీడగ నీడది లేనియట్లుగా
జఱపెను ద్వాదశీవ్రతము చారు కళిందమునీంద్రకన్య దా
నొఱసెడు నమ్మహామధువనోర్వి యొకానొకయే డగర్వియై. ౩౩౪

అటుపై ద్వాదశి పారణమ్ముతఱి నీ యర్చావసానమ్మునన్
జటి దూర్వాసుఁడు వచ్చెఁ దానతిథియై సర్వంసహానేత ము
చ్చటగా వేడగ దేవతార్చన కనుష్ఠానార్థియై యేగె నం
తట కాళిందికి మెల్లమెల్లఁగ బరాంతస్తాపనుం డయ్యెడన్. ౩౩౫

రారేవేళకు పారణార్థ సుముహూర్త మ్మేగునోయంచుఁ దా
నీరుం గ్రోలెను భక్తమౌళి; మఱి రానేవచ్చె దివ్యేక్షణ
స్మేరుండై ముని చండకోపనుఁడు వ్రాల్చెన్ గృత్య నుద్యత్క్రుధా
స్ఫారోదార సముద్ధృత స్ఫుట జటాభారోద్ధతిన్ దూల్చుచున్. ౩౩౬

అసిధారాస్ఫుట జిహ్వికాజ్వలన నిర్యజ్జ్వాలలన్ లోకమున్
మసిసేయంజను కృత్యఁగాంచి యడుగై నంబోని యాసాధు న
య్యసహాయస్థితి నెంచి వచ్చిపడె నుద్యద్దివ్యచక్రమ్ము తా
పసువెంటం బడె నందు కృత్య శలభప్రాయమ్మునై మ్రగ్గగన్. ౩౩౭

వెనువెంటంబడు చక్రముంగని భయావేశమ్మునన్ బద్మగ
ర్భుని జేరం జనఁ గాలచక్ర మిదియేమో గర్భనిర్భేదన
మ్మన, మృత్యుంజయు డాయఁబో నతఁడు సాష్టాంగంబు సాక్షాత్సుద
ర్శన దివ్యాయుధ దర్శనాన కనియెన్ రాదడ్డమై యొక్కడున్. ౩౩౮

అటునిటు పారి తుట్టతుద కమ్మని నిన్నని మ్రొక్కుకొన్న ని
జ్జటిలుని జూచి యాశ్రితవశంవదుఁడన్ దపమేని జ్ఞానమే
నెటను బ్రపత్తితోన గడియించుఁ బ్రతిష్ఠను; అంబరీషుఁడు
న్నట కటువోయి యాతని పదాంబుజమున్ శరణందుమా యనన్.

అన నీయాన మునీంద్రుఁ డాప్రభుని పాదాబ్జమ్ములంబట్టగా
జన వారించి నృపుండు చక్రమును సంశ్లాఘించి పంపన్ సుద
ర్శనమేగెన్ ఋషిరాజమౌళి యట నా రాజర్షిమౌళి క్షమా
వినయమ్ముల్ హరిభక్తియుం బొగడి దీవించెన్ సమగ్రమ్ముగన్. ౩౪౦

రాజటు చూచి చూచి మునిరాకకునై యొక యేడు చిత్తము
ద్వేజనమొంది నేటి కిటు విందిడి విప్రునిఁ దేర్చియంపి తాఁ
భోజనమాచరించె మునుముంగటికంపె నినున్ భజించె నీ
తోజతగూడె; నన్ను దయతోఁగనరా! గురువాయుమందిరా! ౩౪౧

# ౩౫. శ్రీరామ చరిత్ర

రాయన రావణుం దునుమరా యన వేల్పులు; కోసలాన నం
దీయగ ఋశ్యశృంగు డొనరించిన యిష్టిని బాయసమ్ము దా
మాయెడ గ్రోలు పంక్తిరథు నంగనలం దుదయించినావు రా
మాయణ మాలికాభరణులౌ నలుమూర్తులు నీవయై హరీ! ౩౪౨

జనకుం డంపగఁ గౌశికాత్త మఖరక్షాదీక్ష లచ్చన్నతో
జని గాధేయుఁ డొసంగు మంత్రయుగళిన్ శాంతాధ్వఖేదుండవై
మునియానన్ జగమేలఁ దాటక సమున్మూలించి దివ్యాస్త్రముల్
గొని సిద్ధాశ్రమ మేగుదెంచితికదే కోదండరామప్రభూ! ౩౪౩

అట మారీచు నదల్చి యమ్మఖశిరమ్మందాడు రక్షస్సులన్
పటు బాణంబులఁ జించి పాదరజమున్ బైసించి కల్యాత్మయౌ
నటుగావించి యహల్య జాంద్రమకుట ష్మామ్మవిల్లు ఖండించి మీ
రటు మా జానకి చెట్టబట్టి మఖదగ్ధదున్ ధమ్మలున్ దోడరాన్. ౩౪౪

దారిన్ నిల్పియు భార్గవుం డవల సంధానించి స్వీయప్రభన్
దారిన్ బోవ; నయోధ్య కేగి యట సీతాయుక్తుడై తమ్ముతో
నారీతిన్ భరతుండు మాతులకుల మ్మందుండఁ బట్టాభిషే
కారంభంబును దండ్రి సేయ వనవాసారంభమై కైకచే. ౩౪౫

జనకాజ్ఞన్ జనకాత్మజానుజులతోఁ జాపంబు చేబూని తోఁ
జనుదేరం జన మాపి, యాగుహునిచే సంవాహితమ్మైన నా
వను గంగానది దాటి యవ్వల భరద్వాజాశ్రమం బేగి యా
యనకున్ మ్రొక్కి తదాజ్ఞనుంటి జటివై యా చిత్రకూటాద్రిపై. ౩౪౬

భరతోక్తిన్ విని పుత్రశోకహతుఁడై స్వర్గస్థు డౌ తండ్రి క
బ్బురపుం బత్తి నివాపమిచ్చి భరతుం బూనించి శ్రీ పాదుకల్
ధరణిన్ మ్రొక్కియు నత్రి దండకవనిన్ దైత్యున్ విరాధాఖ్యుఁ గూ
ల్చి రహిన్ శ్రీశరభంగు ముక్తి పదవిం జెందించినా వీశ్వరా! ౩౪౭

అటుపై మౌనులగొల్చి బాసయిడి దైత్యశ్రేణి ద్రుంపన్, దప
శ్చటులుం గుంభజు మ్రొక్కి వైష్ణవ మహాచాపంబు బ్రహ్మాస్త్ర మా
దటఁ బ్రాపించి, జటాయువుం బితృసఖున్ దర్శించి గోదావరీ
తటమం దంగనతోడఁ బంచవటి మోదంబందినా వచ్యుతా! ౩౪౮

మరుబారిన్ ధృతివాసి శూర్పణఖయుం బ్రార్థింపఁ ద్రోనాడ రా
క రహిన్ లక్ష్మణుచెంత కంప నలుకన్ ఖండించె ముక్కుం జెవుల్
ఖరుఁడున్ దూషణుఁడున్ ద్రిమూర్ధుఁ డది యాలక్షించి దండెత్త నం
దర మ్రందించితి వాక్షణాన పదివేల్ తత్సైన్య మొక్కండవై. ౩౪౯

అటుపై చెల్లెలు సెప్ప రోషవివశుండై రావణుం డంప న
చ్చట మారీచుఁడు మాయలేడియయి యాసంగొల్ప నీదేవి ము
చ్చట దీర్పంజని చంప నార్చె నది మీ సౌమిత్రి యందేగినం
తట సీతన్ హరియించె రావణుఁడు వంతన్ మున్గితీ వంతటన్. ౩౫౦

వెదుకంబోయితి రీరు; కూల్పఁబడి యావీథిం జటాయుండు మీ
కది యెల్లన్ వినిపించి ప్రాణములు వాయన్; వాని స్వర్గాన కం
పి దయన్, దారిఁ గబంధుఁ జంపి, శబరిన్ వీక్షించి పంపా తటా
స్పద, శ్రీ వాయుజుఁ జూచి పొంగితివి ; నన్ వాతాలయా! ప్రోవరా!

౩౫. శ్రీరామ చరిత్ర

హనుమంతుండు కపీంద్రునిం గలుప నీ వంగుష్ఠమాత్రమ్మునన్
ఘనమౌ దుందుభిమీఁటి యెక్క మలికిన్ ఖండించి సాలమ్ము లే
డును, వాలిన్ మఱి భ్రాతృఘాతి యని చాటుం జెంది వాలించి హా
యని వేగించితి వర్షకాలము వియోగార్తిన్ మతంగావనిన్. ౩౫౨

అనుజోక్తిన్ గపిరాజు భీతిఁ గపిసేనానీకముల్ చేర్చి సీ
తను వేగన్ వెదకంగఁబంప దగు వార్తల్ సెప్పి నీ యుంగర
మ్మును వాతాత్మజు వ్రేలి కుంచి కడు సమ్మోదించి నీ వంప జ
య్యన కోతుల్ పలుపాటులన్ వెదకి రాయా దుర్గమార్గమ్ములన్. ౩౫౩

హరి! మున్నర్జును కోర్కె తీర్పను దదీయాజ్ఞన్ జగద్భారమౌ
పరమబ్రాహ్మణశత్రు రాజులను గూల్పన్ రేణుకాదేవి కం
దరలోనం గడగొట్టు బిడ్డ వగుచున్ రామాభిధానంబునన్
ధరణిం బుట్టితి వీవు భార్గవకులానందానుసంధాయివై. ౩౬౩

పదునాల్గేడుల యీడులోనె శ్రుతిలాభ మ్మొంది గంధర్వుపై
మదిభ్రాలన్ గని తల్లిఁ జంపుఁడనఁగా మారాడు నయ్యన్నలన్
దుదముట్టించియుఁ దండ్రియాన మఱి యా తోబుట్టులన్ దల్లినిన్
ముదమొప్పన్ బ్రతికించికొంటివి; వరమ్ముల్ కొంటి మీ యమ్మచే.

మును గొనివచ్చె మీ జనని ముచ్చటకై శ్రుతిసూక్తి వేల్పుటా
వును జమదగ్ని; తండ్రి పనుపున్‌గొని శంకరుఁ గొల్చి మంచుగొం
డను గొని గండ్రగొడ్డలి నడంచి తదుక్త సురారికోటి నం
తన కని నీదు మిత్రు నకృతవ్రణు వచ్చితి వాశ్రమానకున్. ౩౬౫

వేటకుఁబోయి యర్జునుఁడు విందయి గో వొనరించు విందులన్
వీటికిఁబోయి గోవుఁ గని వేగొనిరమ్మని మంత్రిఁ బంపఁ బ
త్తీట మునిన్ వధింప సురధేనువు రేగి యశేషసేన న
ప్పాటన మట్టువెట్టెనట వత్సముఁ దోడ్కొని వాడు పోవఁగన్. ౩౬౬

అట మీ తండ్రియు శుక్రుచే బ్రతికి నిన్నంపింప నీ మిత్రుతో
నటకుం బోయి మహోదరుం డొసఁగు దివ్యాస్త్రాళిఁ జేపట్టి యు
ద్భటరథ్యధ్వజచోదకమ్ము రథ మాపైనెక్కి సామోక్తిచే
నటు గోవత్సము నీయనన్న నృపు రమ్మన్నావు యుద్ధానకున్. ౩౬౭

అయుతమ్మౌ సుతకోటితోఁ బదియునే డక్షౌహిణుల్ సేనతో
డయి సేనాపతి మిత్రకూటములతో వ్యాజృంభితాయోధనుం
డయి వాడెత్తి భవత్కుఠార శరజాలాచ్ఛిన్న సేనాంగ సం
చయుఁడై పైఁబడెఁ జావగామిగులు దత్సైన్యమ్ములున్ బారిపోన్. ౩౬౮

లీలావారిత నర్మదాసలిలకేళీదృప్త రక్షోమద
వ్యాలుంటాక భుజా సహస్ర విగళచ్ఛస్త్రాస్త్రుఁడై చక్రమే
మూలన్ దాకమి చక్రిగానెఱిగినన్ మోదించి ధ్యానించి పా
పాళిన్ బాసి భవద్ధతుండయు పరమ్మందెన్ పదమ్మయ్యెడన్. ౩౬౯

వంతన్ దత్సుతు లేగి నీ జనకుఁ జంపన్ రేణుకాకాంత తా
నంతన్ గుండెలు బాదుకో, శపథ మీవై పట్టి ధ్యానించి నీ
చెంతన్ బాణములున్ రథమ్ము నిలువన్ జేపట్టి నానా దిశా
క్రాంతిన్ ద్రుంచియు త్రెంచి చేసితివి నిఃక్షత్రమ్ముగా మేదినిన్. ౩౭౦

పునరుజ్జీవితుఁ జేసి తండ్రి ; నృపులన్ ముయ్యేడుమారెత్తి చం
పిన రక్తాన శమంత పంచకమునన్ వే తర్పణ మ్మిచ్చి ద
క్షిణ గావించియు కాశ్యపాదుల కిలాశ్రీ, సాల్వుతోఁ బోరి యా
సనకాదుల్ హరి వీనిఁ జంపు ననఁగా శాంతించినా వంతటన్. ౩౭౧

శరముల్ డించి మహేంద్ర మందు తపమున్ సల్పంగ నయ్యబ్ధి ని
ద్ధర గోకర్ణముదాక మున్గ మును లంతన్ వేడ ధ్యానించి విల్
శరమాగ్నేయముచే నదల్చి జలధిన్ సర్వేశ ఈ కేరళ
మ్మరిదిన్ నీ స్రువ మెత్తి యెత్తితివి వాతాగార ! నన్ బ్రోవరా ! ౩౭౨



శ్రీరామకృష్ణాయనమః

# నారాయణీయము

## దశమ స్కంధము

### ౩౭. కృష్ణావతార ప్రసంగము

ఆనందాత్మక పుణ్య విగ్రహ ! భవద్వ్యాపాదితుల్ కర్మశే
షానం గొందఱు రాక్షసుల్ ధరఁ బునర్జన్మించి ; రా మోపు పా
పానం బర్వయి మోయలేక దివిషద్వర్గమ్ము ముందేగఁగా
గానంబోయె ధరిత్రి స్వాశ్రయగతున్ గంజోద్గతున్ ద్వత్సుతున్. ౩౭౧

"అక్కట ! పాపకోటి బరువై యడగారితి, వార్ధిఁ గ్రుంగెదన్
దిక్కిఁక నీవ, నీ వడుగు దేవత లిందఱె నా యవస్థ" యం
చెక్కుడు ఘోష వెట్టెడు మహింగని వేల్పుల యమ్మొగమ్ములున్
దక్కక చూచి నెమ్మది విధాత నినుం దలపోసె నయ్యెడన్. ౩౭౨

ధ్యానము సేసి యవ్విధి "సురాళి ! నిజమ్ము ధరిత్రిమాట, శ్రీ
జానియె యీమెకున్ మనకు సర్వుల కిప్పుడు రక్షకుం డుమా
జానినిగూడి పాల్కడలి చాయకుఁబోదము మ్రొక్కికొంద మ
వ్వాని నుతింత మా"నన జవమ్మున వా రట కేగి రందఱున్. ౩౭౩

అంతంతం జని మందమంద పవన వ్యాలోల దుగ్ధాబ్ధి తీ
రాంతానంతపదాన నీ చరణ దివ్యాబ్జద్వయచ్ఛాయ వి
శ్రాంతమ్మైన నిలింపకోటి కజుఁడున్ సాక్షాత్స్వయంవ్యక్తి న
త్యంతానందము గూర్చు నీ పలుకు లిట్లై వించె విన్నట్లుగన్. ౩౭౪

ఎఱుఁగుదు మీకు నిప్పుడమి కీ దశ ముష్కరులైన రాజులన్
బొఱయుట, పూర్ణ రూపమునఁ బుట్టెద యాదవవంశ మందు, నం
దఱు నిఁక మీరు నంగనలు నన్ గొలువన్ జనియింపుఁ డంశలన్
మఱి చని వృష్ణివంశమున, మంగళమొ నిఁక మీఁదటన్ ధరన్. ౩౭౭

విని నీ కర్ణరసాయనమ్ములు నుడుల్ వేల్పుల్ సుఖస్వాంతులై
కని త్వద్దివ్య కృపామృతాప్లవనరంగత్తృప్తి నుండంగ, నీ
ఘన సాన్నిధ్య భవిష్య పుణ్య మధురన్ గల్యాణ దివ్యోత్సవ
మ్మును నయ్యెన్ వసుదేవ దేవకులకున్ మున్లోకకల్యాణమై. ౩౭౮

అంతట నూత్న దంపతుల నంపుచు సారథియై రథాన ని
క్కాంతకుఁ గల్గు నెన్మిదవ గర్భము నిన్ ఖలు జంపునంచుఁ బ
ల్కింతగ నీదుపల్కె వినువీథి వినంబడఁ, గంసుఁ డన్న సం
భ్రాంతమనస్కుఁడై కొనెఁ గృపాణముఁ జెల్లెలి సంహరింపగన్. ౩౭౯

అయ్యయొ ! పెండ్లి కూతురుగదయ్య సహోదరిఁ బ్రోవుమన్న వాఁ
డియ్యకొనండు; పుట్టగనె యెల్లకుమారుల దెచ్చియిత్తునా
నియ్యకొనెన్; యదూద్వహుఁడు నిచ్చెను దొల్తటి బిడ్డఁ, జంపరాఁ
డయ్యెను వాఁడు ఱాకటికియై సుతిమెత్తన చిత్త మొక్కెడన్. ౩౮౦

నీ సంకల్పముచేత నారదుఁడు వానింజేరి యోకంస ! స్వ
ర్వాసుల్ యాదవులెల్ల, మీరొ విను బూర్వస్వర్నివాసుల్, మదిన్
వీస మ్మెంచవు నిన్ వధించు హరి వా; వేగన్ బదభ్రష్టులన్
జేసెన్ యాదవులందుఁ బెద్దల; వధించెన్ దేవకీసూనులన్. ౩౮౧

ఘనుఁడా శేషుని వైష్ణవాంశమును సంకర్షించి గర్భమ్ము నీ
వన నీ మాయయె రోహిణీజఠరమం దర్పింప, సచ్చిత్సుఖా
త్మనిరూఢిన్ మఱి దేవకీజఠర మంతన్ జేరినా వా సురల్
గొనియాడన్; పరభక్తి నీఁగదవె మాకున్ రామకృష్ణా ! హరీ ! ౩౭-౨

## ౩౮. శ్రీ కృష్ణావతారము

నీ నునుమేను వెల్వడి వినీలరుచుల్ దులకించెనన్న చం
దాన నభమ్ము నెల్లెడ ఘనాఘనపఙ్క్తులు గాఱుగ్రమ్మె యెం
తే సలరారె వర్షఋతు వీ వవతారముసేయువేళ సు
జ్ఞాన ఘనస్వరూప ! భగవత్పదవాచ్య ! రమామనోహరా ! ౩౮-౧

చలువల్ గ్రమ్మె దిశావకాశములు, వాంఛాసిద్ధియై పుణ్యక
ర్తలు హర్షింపగ, మూఁడులోకములకుం దాపాంతమౌనట్లుగా
నిలపై నీవవతార మెత్తితివి తండ్రీ ! యర్ధరాత్రానఁ గ
ల్వలతేఁ డప్పుడె తూర్పుకొండకొన పైపై తొంగిచూడన్ హరీ ! ౩౮-౨

* అనయ మ్మయ్యణిమాదివైభవము తొల్కాడంగ సౌవర్ణ నూ
తన కేయూర కిరీట కంకణ కనద్ధారావళుల్ గుల్కగా
ఘన శంఖాబ్జ గదా సుదర్శనములన్ గైసేసి మేఘద్యుతిన్
గననైనావట సూతికా గృహమునన్ గైశోర రమ్యాకృతిన్. ౩౮-౩

---

*అణిమా ద్యష్టవిభూతి వైభవము దొల్కాడంగఁ గేయూర కం
కణ మాణిక్య కిరీట హారమణి రేఖల్ గుల్కఁ గౌమోదకీ
ఘన చక్రాంబుజ శంఖముల్ గరములన్ గ్రాలంగ మేఘ ప్రభన్
గననైనావట సూతికా గృహమునన్ గైశోర దివ్యాకృతిన్.

ఆయెడ లచ్చి నీదు హృదయాంబుజ పీఠి వసించి హాస ల
జ్జాయుత దృష్టి వెన్నెలఁ బ్రసారము సేసి ఖలుండు కంసు నా
జ్ఞాయుతిఁ గ్రమ్ము చీకఁటుల చాయ నలక్ష్మిఁ దొలంగఁ జేయ శో
భాయతిఁ దేజరిల్లితి గదయ్య ! ధగద్ధగితాద్భుతద్యుతిన్. ౩౮౬

ధీరోదాత్తము యోగిబృందము సమాధిం బట్టుకోలేని యా
కార మ్మెట్టెదురై కనుల్ చెమరుపంగా మై గగుర్పాటు పొం
*గారన్ గందొవఁ దేనెతేట యయి డాయన్ నిండు సౌందర్యభాం
డారమ్మం గని హర్ష గద్గదిగతోడన్ శౌరిఁ దా నిట్లనెన్. ౩౮౭

ఓ పరమేశ ! ఓ వరద ! ఓయి హరీ ! కరుణింపవోయి నన్
దాపలతాలవిత్ర ! సమతాస్తుతిపాత్ర ! సమస్త సృష్టి లీ
లా పరికల్ప నాద్భుత కలాకలనా ! కరుణా కటాక్ష సం
వ్యాపృతి నా శ్రమమ్ముడుపరా ! యనియెన్ వసుదేవుఁ డయ్యెడన్. ౩౮౮

అమ్మయు హర్షబాష్పసలిలాప్లుత గాత్రలతాభిరామయై
నెమ్మి నుతించె నీ సొగసు ! నీ తలిదండ్రుల కాత్మ జన్మ జ
న్మమ్ముల జ్ఞప్తికిం గొలిపి మాధవ ! దేవకి కోరుకొన్న సౌ
మ్యమ్మగు రూపు దాల్చితివి మానుష చారుకిశోర వేషమున్. ౩౮౯

న న్నటడించి నందు సదనమ్మునఁ బుట్టిన కొమ్మఁ దెచ్చికొ
మ్మన్న భవత్ప్రచోదనకు నవ్వసుదేవుఁడు యోగు లాత్మలో
నెన్నఁడుఁ దాల్చు నిన్ను వహియించెఁ గరమ్ముల ; నప్పు డొప్పినా
వన్న ! సరోరుహాగ్ర కలహంస కిశోర మనోరమాకృతిన్. ౩౯౦

---

గారన్ నిన్ మకరందధార యయి డాయన్ నిండు సౌందర్యభం
డారమ్ము న్గని హర్ష నిర్భరమునన్ డగ్గుత్తికన్ భక్తిగన్.

పడగల్ విప్పి ప్రవాహ మాపి మణిదీప జ్యోతులం జూపి శే
షుఁడు మున్ముందుగఁ ద్రోవ సూపి నడువన్ శూరాన్వయాంభోధిచం
ద్రుఁడు నిన్ దాల్చి ప్రయాణ మయ్యె నిటు లెందున్ నీ ప్రభావమ్ము లే
ర్పడు నీరీతులఁ దాపవేగ ముడిగింపన్ రార ! మావల్లభా ! ౩౯౧

## ౪౯. యోగమాయానయనాది వర్ణనము

చేతులన్ ని వహించి యదుశేఖరుఁ డభ్రనటత్తరఙ్గ సం
ఘాతను సర్వకల్మషవిఘాతను దాటఁ జనన్ గళిందసం
జాతను నింద్రజాల మన జాల్కొని యన్నది చిన్న పిల్ల కా
లై్వ తులకించె నాక్షణమునం దఱకాలు మునుంగుపాటియై. ౪౯౨

నిద్రా ముద్రిత పాశుపాలకము నిర్నిద్రారుదద్బాలిక
మ్ముద్రోద్ఘోరుకవాటముం బశుపగేహోపాంతవాటమ్ము స
చ్ఛిద్రాపా ! చని సూతికాశయనవాసిం జేసి యా శౌరి దీ
వ్యద్రక్తిం జనె నంత నెత్తికొని మాయాకేళికన్ బాలికన్. ౪౯౩

బాలిక పోరిడన్ నిదురఁబాసి హడల్కొని పాఱి నౌకరుల్
వ్రాలి వచింప నప్పురిటివార్తను, గంసుఁడు బెంగటిల్లి బెం
బేలయి జుట్టు వీడి వెను వెంటన పర్విడి దేవకమ్మ కెం
గేల వసించు బాలఁ గని కించవడెన్ దలక్రిందులై యెదన్. ౪౯౪

అగుఁ గపటాత్ముఁ డైన మధుహంతకుమాయ యిదెల్ల నిక్కమే
యగునని తల్లి చేతి శిశు వయ్యది తామర తూడు నొక్క యే
నుఁగు వడి లాగినట్లు మది నూల్కొన లాగె నజాస్వరూపమై
సొగసులు గుల్క నా శిశువుఁ జొన్పి శిలన్ వడి రాచె నయ్యెడన్. ౩౯౫

అటుపయి నీదుసేవకుఁ డయారె భయావహ మృత్యు పాశముల్
దటకునఁ దప్పు కొన్నటులఁ దప్పి తటాలున వేరరూప మ
ప్పటఁ గొని క్రిందికిం బడక వాయు పథమ్మున నంటిపోయి తా
నట వెలుగొందె సంవిక సదష్టభుజాస్ఫురదాయుధద్యుతిన్. ౩౯౬

ఓరి నృశంస కంస! నను నూరక రాచిన నేమి వచ్చె, నీ
వారసికొమ్ము నీ హితవు నంతకుఁ డొండెడ నీకుఁ బుట్టె నం
చారహిఁ బల్కి నీదు చెలియల్ వెలసెన్ భువి పెక్కు దేవతా
గారములం దనేకతను గాంచి మరుద్గణ గణ్యమానయై. ౩౯౭

మరుసటి ప్రొద్దునన్ గిరిజ మాటలు కంసునినోట విన్న ము
ష్కరు లదటింతలేక నిను జంప వడిన్ జెలరేగి నల్దెసల్
దిరిగిరి బాలఘాతుకులు తీరి ప్రలంబ బకాది దానవుల్;
కొరకొరలాడు నక్కటిక గుండెల కంకని క్రౌర్య ముండునే. ౩౯౮

ఇంతులు నందు నింటఁ బురిటింట యశోదమ ప్రక్కలోన నొ
క్కింతన చిన్ని నీ యడుగు లెత్తుచు నేడ్వగ, గొల్లభామలున్
వింతగ మా యశోద మగబిడ్డ గనెం గనుడంచుఁ జాటి ర
త్యంతము గోకులమ్ము ప్రమదాకుల హర్ష సమాకులమ్ముగన్. ౩౯౯

అద్దిర నిన్ డపించ కుసుమాభ శరీరుఁ గుమారుఁ జూచి పల్
ముద్దులు గుల్కు నీ చెలువముం గనుదమ్ములఁ ద్రావి నందు న
మ్ముద్దియ పాలొసంగి నవముగ్ధ మనోహర బాలమూర్తినిన్
ముద్దిడి గెల్చె ముజ్జగము పుణ్యవతీ తిలకమ్ము లందఱిన్. ౪౦౦

అప్పుడు నందగోపుడుఁ త్వదభ్యుదయ మ్మెదఁగోరి యెంతయున్
ముప్పిరిగొన్న హర్షమున పుణ్యులు విప్రుల కీయకున్న దే
మప్పుడు ? గోపకుల్ సలుప నట్టిది మంగళ మేమియున్న దో
యప్ప ? మహార్తిబో నడపవయ్య ! జగత్త్రియ మంగళోదయా ! ౪౦౧

## ౪౦. పూతనామోక్షము

పన్నులు గట్ట నందుఁడు శుభస్ఫురణం జన రాజధాని కం
దెన్నియొ దుర్ణయమ్ము లొనరింపఁ దలంచిన కంసువార్త లం
దున్న తదాప్తవర్గము మహోగ్రతయున్ వసుదేవుఁ డెంచి తా
నున్నవి యున్నటుల్ దెలిపి యొయ్యన నాప్తత సూపి వెండియున్.

నీకు బిడ్డఁడు గలుగగా నాకుఁ గలిగి
నంత యానంద పరవశ మ్మయ్యె చిత్త
మనుచు వసుదేవుఁ డాత్మీయ జనకభావ
మదియుఁ గడు నేర్పుతోడ గోప్య మ్మొనర్చె. ౪౦౩

భీషణము ఘోషణము దాని వేష మదియు
విని కని యశేషజనమును వివశమయ్యె;
రమణు లసుర యురమ్ముపైఁ బ్రాకులాడు
నట్టి నిన్నెత్తి యక్కున నొత్తి రపుడు. ౪౦౯

అంగనలు లోకమంగళమంగళమ్ము
లైన నీ నామముల సకలాంగములకు
రక్ష వెట్టిరి సాధు సంరక్షణైక
దక్ష ! నన్నేలి కొనర కటాక్ష ముంచి. ౪౧౦

## ౪౧. గోపీ గోపాలక లాలనము

నందుఁడు శౌరిమాటకు మన మ్మరియాడగ నింటి కేగుచున్,
ముందర పెద్ద బ్రమాకులు సమూలము గూలగఁ గూలి యందుఁ జా
వొందిన రక్కసిం గని, యహో ! యని డెందము కొందలించి యే
మందును నిన్నొకానొక మహార్థ మెదన్ శరణందె నయ్యెడన్. ౪౧౧

గోపిక లెల్లరున్ దెలిపి ఘోషయొనర్పగ గొల్ల లెల్లరున్
లోపల వింతయుం జడుపు లోఁగొన గొడ్డట ఖండ ఖండముల్
వాపి పిశాచి దేహమును బల్లెకు దవ్వులఁ జేర్చి పేర్చి తా
ర్పేపగిదిన్ దహించిరొకదే కడు నచ్చెరు వౌను దత్కథల్. ౪౧౨

నీ వటు పాలు ద్రావి యెలయించిన పుణ్య విశేష వాసనన్
పావనమైన దాని మెయి పైపయి లేచిన ధూమమెల్ల బల్
త్రోవల గ్రమ్మి యయ్యగురు ధూపమొ గుగ్గులు ధూపమోయనన్
దావుల నించె నాశ్రితజన ప్రియవల్లభ! దుష్టదుర్లభా! ౪౧౩

నా తను వంటు నా క్షణమునన్ బహు పుణ్య విశేష సౌరభ
మ్మి తెఱఁగై రహిన్ బరిమళింపక మాన దటంచు వల్లవీ
వ్రాత మెఱుంగఁ జేయుటకొ పాపిని పూతన మేను పుణ్య గం
ధాతతముం బొనర్చితి వయారె దయారస సాగరా! హరీ! ౪౧౪

"ఘోర పిశాచిచేఁ బడక కుఱ్ఱఁడు దక్కె నిదేమొ యీశ్వర
ప్రేరణ" మంచు నింతమునుపే వసుదేవుఁడు సెప్పె నంచు, వి
స్మేర విలోచనాత్ములయి చెంగున గోపకులమ్మి నీ ముఖాం
భోరుహ దర్శనైకరస పూరములందు మునింగి రచ్యుతా! ౪౧౫

ఆవల నాడునాటి కొక యందము చందము పెంపునొంది నా
నావిధ మంగళాభ్యుదయ నవ్యవిలాసముచేఁ బ్రమోద సం
భావితమై యెసంగె వ్రజవాట ముదార రమావిహార లీ
లావసథ త్వదీయ చరణాంబుజ నిత్యనివాసమై హరీ! ౪౧౬

నీ సుకుమార వేషమును నీ దరహాసము నీదు హాస్య వి
న్యాస విలాసముల్ మఱగి యచ్చిక బుచ్చిక లాడుకొంచు నె
ట్లో సరిదిద్ది యింటిపను లొప్పులకుప్పను నిన్నెచూచి యు
ల్లాసము చెందుచుందు రబలల్ మఱి మైమఱపందుచుందురున్. ౪౧౭

నీ లలితాంగ సంగరుచి నించిన వేడుకతో వ్రజాంగనల్
హేలగ చేత నందుకొని యింకొక చేతికి నందియిచ్చి యు
య్యాలగ నూచి పాడ నరుణారుణ నవ్య సరోజ పీఠికా
దోలిక నూగు నక్కొదమ తుమ్మెదతోఁ దులతూగినా వటఁ. ౪౧౮

నిను దొడమీద నుంచుకొని నించిన వేడుకఁ బా లొసంగుచుఁ
కనికని నీ మనోజ్ఞ వదనమ్మును నవ్వులఁ బుల్కరింపగఁ
మును మన గోపి నోము లెవి నోచెనొ యయ్యనుభూతియేమొ యె
వ్వని తరమౌనురా తెలిసి పల్కగ నన్ దయనేలరా! హరీ! ౪౧౯

## ౪౨. శకటాసుర భంజనము

వలనొప్పన్ జిఱుబొజ్జనిండ నటులన్ బా లిచ్చి మీ యమ్మ నీ
తొలిజన్మర్క్ష మహోత్సవమ్మునకు విందుల్ సేసి యాప్త ద్విజా
వళి పుణ్యాంగన లందరం బిలిచి సంభావించుచున్; సందడిఁ
దలఁ బింకొక్కటిగాగ నిన్ను మఱచెన్ వంటింటి గుమ్మమ్ములోఁ. ౪౨౦

ఆరసి చూచుచుండుఁ డని యావిడ యచ్చట నిల్పినట్టి కౌ
మారక బృందమున్ భయసమంచితమై పొనరించినట్టి హా
హారవ మేకమై భవదుపాంతమునందు హఠాత్ పరిస్ఫుటత్
దారుచటచ్చటారవము దారుణమై వినిపించె నయ్యెడఁ. ౪౨౧

సంతత తద్రవశ్రవణ సంభ్రమణశ్రమకంపితోత్కచ
క్రాంతి భరానఁ గౌను వడకంగ వ్రజాంగన లేగి కాంచి రు
ద్దాంత వినిష్పతచ్ఛకట దారుణ దారవ ఖండ మధ్యగున్
వింతగఁ దోచు నిన్ను నరవిందముఖున్ నిజభక్త సమ్ముఖున్. ౪౨౨

ఇంతటిఁ జిన్ని పాపనికి నేమొకొ యాపద సంభవించె నం
చెంతయుఁ దత్తరించి పలవించుచు నందుఁడు గొల్లలున్ ద్విజుల్
పొంత యశోద చంక నిడి ముద్దిడ నాడుచునున్నఁ జూచి ని
న్నంతట నెమ్మదిం బడసి రశ్రుజలార్ద్ర విలోల నేత్రులై. ౪౨౩

ఇది యేమే మిది యెట్టి దెట్టి దిదియె ట్లైట్లయ్యె నాశ్చర్య మి
య్యది శంకింప విశంకటమ్ము శకట మ్మప్పాట నిష్పాటిత
మ్మదె ; కొంచెమ్మను గారణమ్ము గనరాదయ్యెంగదాయంచు ని
న్నెదుటన్ ముక్కున వ్రేలుపెట్టుకొని యట్లే చూచి రయ్యందఱున్. ౪౨౪

ఆకటఁ జిక్కి పాల కని యాకులుడై తన చిన్నిపాద మే
మో కదలించినాఁ డితడు నొయ్యన నయ్యది తాఁకి వ్రయ్యలై
యీకడఁ గూలె బండి, తిలకించితి నే నిది నే నటంచుఁ దా
మేకముఖమ్ముగాఁ బలికి రెల్లరు గోపక బాలకుల్ ప్రభూ ; ౪౨౫

అననుగతంబు, సుంత నిజ మంటకుఁగా దిది, ముక్కుపచ్చ లా
రని నిసువుల్ భయంపడి యిటాడెద రింతియ కాని వేర కా
దనిరటఁ గొంద రందుఁగల యయ్యలు, కొందరు పూతనాగతిన్
గని యగు నేమొ కాదనుట గాదని సందియ మంది రచ్యుతా ! ౪౨౬

ఇది పవడంబు డంబు హరియించు పదమ్మిటు గంటువోయె, నొ
ప్పిదము దొరంగి కందినవి బిడ్డని చేతులు తమ్మిపూవులం,
చదిర ! కృపాతరంగిత హృదంతరలై తరళాక్షు లెల్ల ని
న్నెదఁ గదియించి మేన్పులకరింపుల ముద్దులు వెట్టి రంతటన్. ౪౨౭

అమ్మకచెల్ల ! చిన్నశిశు వప్పుర మేళు కృపాతరంగ పా
తమ్మిటు నెట్టి నంతటగదా యొక యొడ్డునుబట్టి దక్కె నా
డిమ్మిటు తెమ్మటంచు నిను నెత్తి కవుంగిటఁ జేర్చి నందుఁ డ
బ్రమ్మగు హర్షముంబడసి నమ్మెయి నెమ్మెయి పుల్కరింపగన్. ౪౨౮

శకటమునందు నక్కె నిను జంపగ దైత్యుడు వచ్చి నీదు కా
లికి నటుదాకి కూలెను బళీ ! యొక యింత రజమ్ముగాని రే
గకయ ; యదేమి చిత్రమొ జగత్పతి ! కేవల శుద్ధ సత్త్వరూ
పక మగు నీ స్వరూపమున వాఁడు లయించుట నిక్క మీశ్వరా ! ౪౨౯

ఆయెడ విప్రకోటి భవదాప్తుల పూజల నెల్లఁ గాంచి యా
చేయు నశేష మంగళ విశేషము లందును గొల్లవాఁడ నీ
చేయు విచిత్ర బాలక విశేష విలాసములన్ విముగ్ధులన్
జేయుచు నుల్లసిల్లితివి శ్రీ గురువాయ పురేశ ! ప్రోవరా ! ౪౩౦

## ౪౩. తృణావర్త వధ

ఒకతఱి నో మరుత్పురవిభూ! యొడిలో నిడి ముద్దులాడు న
మ్మకు భరియింపరాని బరువై మఱి తోఁచిన మోయరాని ని
న్నొకట! యశోద శయ్యపయినుంచి విచిత్ర మిదేమి విడ్డుర
మ్మొకొ యని సందియం పడుచు నొక్కెడఁ దా నిలుదీర్చుచుండగన్.

వర్తిత ఘోరఘోష పరివర్తితమై పెనుధూళి రేగి స
ర్వావృతమై యశేష దిశ లల్లుకొనన్ సుడిగాలి వీచి చి
న్మూర్తి! హరించె నిన్ భువన మోహనమూర్తిని; వాఁడె పో తృణా
వర్తుఁడు రాక్షసాధముఁ డపార బలావినివర్తుఁ డయ్యెడన్. ౪౩-౨

కన్నుల ధూళి క్రమ్ముకొని కానగరా కిదియేమి దారుణ
మ్మన్న భయాన గోపజన మందరు వంత మునుంగ నయ్యొ! మా
యన్న! యెటైతి వన్న! కనుమన్న! యటంచటు సేరవచ్చి చూ
చె న్నిను జేరి మీ జనని చెప్పగరాని విషాద వేదనన్. ౪౩౩

అంతట దానవుండు, హరి! నీవట మోయగరాని భారమై
నంతట నందె చచ్చుపడి యవ్వడి దగ్గి యొడల్ దిగాల్పడన్
గంతులు దక్కి యంద యడగారె క్షతాఖిల పాంశు ఘోషమై
కొంత యదోషమైన వ్రజ ఘోషము నిండె యశోద ఘోషమున్. ౪౩౪

విని యాక్రందన మింటికిన్ మఱలి యావ్రేలెల్ల నాలోచన
మ్మొనరింపన్, వెలవెల్లనై యసుర యోహో! సర్వముక్తిప్రదున్
నిను ముక్తుం బొనరింపనెంచె; నవుగా నీవా దురాత్మున్ విము
క్తిని గావింపమి వాఁడ రాలిపడె నిందున్ మృత్యువాసన్నమై. ౪౩౫

ఆ యేడ్పుల్ పెడ బొబ్బలెల్ల విని గోపానీక మత్యాకుల
మ్మై యా ముంగల నొక్కరాతిపయి వ్రేగై కూలి సర్వ ప్రజా
పాయమ్మౌ పెనుదేహ మట్టై కని రప్పా! నవ్వు తొల్కాడ నీ
వై యారొమ్మునఁ బ్రాకులాడుటది యత్యాశ్చర్య మయ్యెన్ విభూ! ౪౩౬

పెనుశిలదాకి నుగ్గయిన పెద్ద యొడల్ విడి ప్రాణమేగినన్
దనుజుని రొమ్ముపై కెగసి నవ్వుచు బ్రాకుచు నాటలాడు చుం
డిన నిను గోపు లెత్తుకొను ఠీవి గనన్ గిరి శృంగ సంగతిన్
గనిన మహేంద్ర నీలమణిఁ గైకొను నందము దోఁచె నంతటన్. ౪౩౭

నందాది వ్రజబృంద మొక్కొకరె నిన్ నారాయణున్ సచ్చిదా
నంద బ్రహ్మముఁ గౌగిలించికొని యానందాన ముద్దాడఁ, గ
న్విందై గోపిక లట్టి ముచ్చటలకున్, వేడ్కం గొనన్ నీవ ము
న్నుందే వ్రాలితి తత్కరాబ్జముల; నామోదాత్మ నిన్ మ్రొక్కెదన్. ౪౩౮

ఎందులఁ జొత్తు, మే ముపచరింతుము, బిడ్డని రక్షవెట్టి మ
మ్మందఱ నేలువాఁడు ప్రణతార్తి హరుండగు వాఁడు వాఁడె గో
విందుఁ డటంచు, నిన్ను మఱి వేడిరి నీదగు రక్షణార్థ మే
మందుమొ! అయ్యొ యమ్మ మఱి యందఱు గోపకు లేకవాక్యతన్. ౪౩౯

వాతాత్మక దనుజునికి వి
ఘాతము గల్గించినావు; ఘనమటరా నా
వాతము హరియించుట; యో
వాతాలయ! మఱియు మఱియుఁ బ్రార్థన నీకున్. ౪౪౦

## ౪౪. నామకరణోత్సవము

తను వసుదేవుం డేకత
మనుపన్ గర్గుండు జ్యోతిషాచార్యుఁడు వ
చ్చెను మీ యింటికి నిష్క్రియుఁ
డనఁబడు నీ కెల్ల విధులు ననువుగ నడుపన్. ౪౪౧

నందనుని కుత్సవము లా
నందమ్ముగఁ జరుపుఁడనుచు నందుఁడు పలికెన్
మందస్మిత సుందర వద
నేందిరుఁడగు యోగి బృంద వృందిష్ఠు మునిన్. ౪౪౨

యదువంశ గురుత్వ మ్మొ
ప్పిదముగ నిది యార్యధర్మ విధియని గర్గుం
డదె యన్నయ్యకు నీకున్
ముదమునఁ బేర్వెట్టె నొడలు పులకింపంగన్. ౪౪౩

ఒకటా రెండా యితనికి
నొక వేయికిమించి పేరు లున్నవి నామం
బొకడేల యనుచుఁ బేర్కొనె
నకలంకుని నిన్ను గర్గుఁ డటఁ బేర్వేరన్. ౪౪౪

ఉనికిని గృషి ధాతువు దె
ల్పున; ఆనందస్వరూప బోధ'ణ'కార
మ్మున నగును, బాపరక్షక
మనియును కృష్ణాఖ్య నాతఁ డద్దిర యుంచెన్. ౪౪౫

రామాది దివ్యనామము
లేమో మీ యన్న కన్వయించెన్ ముని ని
న్నేమో యతిమానుష మహి
మా మూర్తిగఁ దెలిపె గుప్తమార్గమున హరీ! ౪౪౬

శ్రీహరి నీ బిడ్డనితో
స్నేహముగని నరుఁడు మాయచే శోకముచే
మోహమ్ముఁ గనఁడు, వానికి
ద్రోహమ్మొనరించి యందుతోన నశించున్. ౪౪౭

గెలుచుం దైత్యుల, బంధుల,
నిలుపు న్నిర్వాణపదము నీడల, శ్రుతులన్
గొలుపున్ విమల యశమ్ముల,
నలఘుం డని నీ విభూతు లమ్మని పలికెన్. ౪౪౮

తరియింతువు దుర్గమ్ముల;
జరియింతువు ధన్యవృత్తి స్వాస్థ్యముగని యు
ద్ధర నంచు గర్గముని శ్రీ
హరి వని నిన్ దెలుపకుండ నన్నియు దెలిపెన్. ౪౪౯

గర్గాచార్యులు చని రప
వర్గద! నందాది సకల బంధువులు సుహృద్
వర్గమ్ములు నీతో సం
సర్గమ్మున నలరి రట్లు సాకుము కృష్ణా! ౪౫౦

## ౪౫. బాలక్రీడలు

ఆనందాధిపు నింటి కెల్లతొడపై యన్నయ్యయున్ నీవునున్
సానందంబుగ నుచ్చల చ్చరణ గుంజన్మంజు మంజీర శిం
జా నాదమ్మునఁ జెంగలించి కర మాస్ఫాలించి జానుద్వయ
మ్మూనం బ్రాకుట సూడ ముచ్చట గదన్నా! దేవకీ నందనా! ౪౫౧

అలకలు మోముపై గునిసియాడఁగ, గొంచెము గొంచెమైన న
వ్వులఁ బలుమొగ్గలం దళుకు బొంపిరి వోవగ, రత్నకంకణా
వళి మణికట్టు లందుఁ బొదువన్ జరణమ్ములు పద్మరాగ కాం
తులఁ దులకింప మీ సొబఁగు తోఁచెను విశ్వ విమోహనమ్ముగన్. ౪౫౨

వింతలు గుల్కఁ గం దొవలు విచ్చి కనన్ వ్రజవాట మెల్ల మీ
చెంతనఁ జప్పటల్ సరువ చి ర్నగవుల్ తొలుకంగ దూకి కే
రింతలు గొట్టుచున్ బొరిపొరిన్ వదనాబ్జము త్రిప్పిచూచు చిం
తింతనరాని ముద్దు ఘటియించిరి మీ బలరాము డీవునుౝ. ౪౫౩

లీలగఁ బ్రాకుచుౝ బడుచు లేచుచు మేనులు ధూళి గ్రుంగ మి
మ్మోలిన చూచి లేనగవులూని మునుల్ కయిమోడ్పు పెట్టగా,
జాలిగఁ దల్లు లెత్తికొని చక్కన నక్కునఁ జేర్చి ముగ్ధ గో
పాలు రటంచు ముద్దు లిడు వైభవ మద్భుత మయ్యెరా ! హరీ ! ౪౫౪

స్తనకుంభమ్ములఁ బాలుచేపగ యశోదాదేవి నాతండ్రి ! ర
మ్మనుచున్ ని న్నొడిఁజేర్చి పాలొసఁగుచో నంతంత లేనవ్వు లిం
పెనయౝ వచ్చియురాని పల్వరుస నెంతేనిౝ నిగారింపు చిం
దిన నీ మోమటుచూచి గోపి మురియుౝ నీతోడిదే లోకమై. ౪౫౫

నడకల్ నేర్చి కుమార గోపకులతో నానా శిశుక్రీడలన్
దుడుకుల్ సూపుచు ని ల్లిలుం దిరుగుచున్ దూకించుచుౝ లేగలౝ
వడిమైఁ బెంపుడు పిల్లులౝ జిలుకలౝ బట్టౝ దువాళించు మీ
యొడుపుల్ సూచుచు నవ్వి పట్టుదురు మిమ్ముత్సాహులై గోపకుల్. ౪౫౬

హలధరు తోన నీ మసలు నట్టి యెడౝ దమ చూపు వ్రాలగా
లలనలు పుత్ర మిత్ర హితులౝ దలపోయక యింటి కృత్యముల్
జలుపగ రాగ కోర్కెఁ గొన సాగగఁ ద్వద్గత చిత్తవృత్తులై
వలపుల నెంది రయ్యెడ నవారిత భావనిరూఢి గోపికల్. ౪౫౭

నవనవనీత మింద యదునందన ! కొమ్మనఁ గొమ్మలందరున్,
దవిలి గ్రహించుచున్ కలపదమ్ముగఁ బాడుచుఁ జక్క నాడుచున్
యువతులు వెట్టు నేతులవియుం దిని మీఁగడ పాలు బొజ్జ నిం
తువు నవపక్వముల్ గొలిపి తోయజ నేత్రలు బుజ్జగింపగన్. ౪౫౮

పెరుగుల్ నేతులు దొంగిలించితని గోపీ ముగ్ధ చిత్తమ్ములం
దిరవుంగాంచవు కోపమున్ వగపు, తండ్రీ ! సర్వ చిత్తమ్ములన్
హరియిం, తావల మించి యెత్తెదవు బ్రహ్మానంద పాథోధిలోఁ,
గరుణా సింధుఁడ వేలుకోఁగదర నన్ కైవల్య దీక్షాగురూ ! ౪౫౯

"బలి యాచించితిఁ గాక యిప్పు డబలావర్గమ్ము యాచింతునే !
యలుసై పోయెద" నన్న నిశ్చయముతో నా యాచనావృత్తి కె
వ్వలనన్ బూర్తిగ స్వస్తిచెప్పి యిపు డీ పాల్పెర్వులున్ వెన్న ప్రము
చ్చిలు నీ కొంటెతనాలకున్ దిగితి లక్ష్మీ మాన చోరా ! హరీ ! ౪౬౦

## ౪౬. విశ్వరూప సందర్శనము

మును యశోద యొడిని మురువుగా శయనించి
నీవు పాలు ద్రావి యావులింప
విశ్వరూప మందు విశదమ్ముగాఁ జూచె
ముగ్ధగోపి నీదు మోమునందు. ౪౬౧

ఆటలాడమఱగి యచటి బాలకులతో
ఫలము లేక మోస పఱచి తనుచు
కోపమెత్తి యమ్మకుంజెప్పి రేవేవా
కొం౦టెవనుచు మన్ను తింటి వనుచు. ౪౬౨

ప్రళయమందు మన్ను జలములున్ మొదలుగా
సర్వ భక్షణమ్మొ జరుపు నీకు
నల(త సేయునన్న యలుకుతో గొల్లది
కొసరి కసరి నిన్ను గోపపడియె. ౪౬౩

ఓరి దుడుక ! నీ వయో మన్నుతిన్నా(డ
వటర నిజము సెప్పుమనుచు నడు(గు
నమ్మతోడ లేదు లేదమ్మ యిది వట్టి
మాట యంటి వొక్క-మాటు నవ్వి. ౪౬౪

అంద రిందు నిక్క- మనుచుండ( గాదందు
వేది మోముతెఱువు, మేన కందు,
ననగ( జూపినా(డ వవ్వేకు నీ నవ్వు
మోము విచ్చు తమ్మిపువ్వువోలె. ౪౬౫

మన్నురుచికి మనసు గొన్న మీయమ్మకు(
దనివి తీర్పవలయు ననియొ యేమొ
భూమి యొకటిగాదు భువనముల్ బదునాల్గు(
జూపినావు కరుణ జోపినావు. ౪౬౬

ఒక్కమూల జలధి యొకమూల గగనమ్ము
నాహా ! రసాతలమ్ము నొక్కచోట
*మనుజు లొకట దేవదనుజు లొక్కట దాన
గానబడని దొకటి గానఁబడదు. ౪౬౭

పాల కడలిలోనఁ బవ్వళించెడువాని
నిటు వికుంఠ సీమ నేలువాని
తనదుముంద చిన్ని తనయుఁడై నగువాని
గాంచె నిన్ను నీ మొగమ్మునందు. ౪౬౮

అఖిల లోకములకు నాటపట్టగు నీదు
మోముసూపి యిట్లు ముద్దు సూపి
తోఁచి జనని కనులఁ దోచిన జగ మెల్ల
వట్టి కల్ల సేసి పెట్టినావు. ౪౬౯

ఇంతసేసి తత్త్వ మింతగాఁ దెలిసిన
జనని నపుడ ప్రణయ చకితఁజేసి
ప్రాకివచ్చి, అమ్మ ! పా లీయవే యంటి
వేలుకొనర చిత్ర బాలకుండ ! ౪౭౦

---

* ...దేవదనుజు లొక్కట నీదు
మోమునందు లేని దేమనందు.

## ౪౭. ఉలూఖల బంధనము

పెరుగు ద్రచ్చుచుండ వేవేగఁ జని కవ్వ
మొడిసి బట్టి, చన్ను గుడిచినావు
వడి యశోద తల్లి యొడిలోన బుడిబుడి
యాట లాడి ముద్దు మాట లాడి. ౪౭౧

సగము పాలుద్రావి చక్కని చిఱునవ్వు
మోము సూపి నీవు ముద్దు గులుక
పాలు పొంగి డింపవలె నంచు మీ యమ్మ
పరువు పెట్టె జఘనభరము వడక. ౪౭౨

త్రావుచుండ నడుమ రసభంగ మొనరించె
ననుచు నమ్మమీఁద నలుకఁబూని
కవ్వమూని పెరుగు కడవపై నడచినా
విట్టి దుడుకుసేత లెందుఁ గలవు ? ౪౭౩

అప్పుడైన చప్పు డాలించి మీ యమ్మ
వెఱచి పఱువువెట్టి వేగవచ్చి
చూచె నీచకీర్తి సొగ సెల్ల నవనిపై
నిండె ననఁగఁ బెరుగు నిండుకొనఁగ. ౪౭౪

వేద వీథు లందు వెదకి పట్టగనైన
నిన్ను బట్టఁబోయి నిలిచి చూచె
వెఱ్ఱితల్లి యింటి పిల్లికి నరచేత
వెన్నముద్ద వెట్టు చున్నవాని. ౪౭౫

పట్టి ! నిన్నుబట్టి వట్టి భయాభిన
యమ్ము సేయు మోముదమ్మి సూచి
చలమునన్ యశోద సఖుల ముందర నిన్ను
గట్టఁ ద్రాడు వెదకి పట్టి దెచ్చె. ౪౭౬

యోగి జనము పట్ట నుంకింతు రెవ్వని
నట్టి నిన్నుబట్టి కట్ట నెంచి
ఇంట ద్రాడు లన్నియుఁ జుట్టినన్ బెత్తె
డెడము వడియె గోపి జడను వడియె. ౪౭౭

వింత పడుచు పడుచు కాంత లెల్లరు చూడ
చెమట లొలసి యొడలు చిడిముడి పడు
జనని జూచి జాలిగొని నిత్యముక్తుండ
వయ్యు బంధమునకు నియ్యకొంటి. ౪౭౮

రోటఁ గట్టి యింక మాటాడ కుండురా
కొంటె కుఱ్ఱ ! యనుచు గోపి చనగ
నంతము న్నులూఖలాంతరమ్మునఁ దాచు
కొన్న వెన్న తినుచుఁ గులికినావు. ౪౭౯

పాశ ముక్తులైన భాగ్యవంతుల వళ
మ్మగు మహానుభావుఁ డయ్యు జనని
పాశములకుఁ జిక్కువడుట వేల్పులు మెచ్చి
రాప్త సులభ! నన్ను నాదుకొనర! ౪౮౦

## ౪౯. యమలార్జున భంజనము

మోదమున సురలు విను దా
మోదరుఁడని పొగడంగ బొజ్జ యొత్తుకొనంగా,
వే దరిసి, రోటితో నీ
వాదట మద్దులను జూచి తట రెండింటిన్. ౪౯౧

కావలెనంచు శంభుకృపఁగాంచిన యయ్యణిమాది సంపదన్
గావరమెత్తి నిన్ను మదిఁ గానని యానలకూబరున్ మణి
గ్రీవుఁ గుబేరసూనుఁ దిలకించితి వత్తరి నత్తరుత్వశా
పావధి యంతలోన సరి యౌటరుదే హరి నీదు చూపులో. ౪౯౨

మును గంగానదిలో నశేషదివిషన్ముగ్ధాంగనా రత్న ప
ఙ్క్తిని మించంగల మించుబోణులు జలక్రీడా వినోదమ్ము లం
దనువర్తింప వివస్త్రులై చెలఁగి యోలాడంగఁ ద్వద్భక్తి చం
దన సేవాదరుఁడైన నారదుఁడు నంతం జూచె వారిద్దఱిన్. ౪౯౩

చెలువలు దత్తరించి తమ చీరలు గట్టుకొనంగఁ జూచియున్
దలఁగక దుర్మదాంధులయినం గని భక్త్యుపశాంతి సిద్ధి వా
రలకగుఁగాత మంచు మధురమ్ముగ శాంతము లేక సౌఖ్యముల్
గలుగవటంచుఁ బాడె ననుకంప నిలింపమునీంద్రుఁ డచ్చటన్. ౪౧౪

చిరకాలము మీరర్జున
తరువులరై యుండి విష్ణు దర్శనమై కాం
తురు మీ పదమనఁ జెట్లై
సురిఁగిరి నీ రాక కెదురు సూచుచుఁ బల్లెన్. ౪౧౫

తొందరవడ కా తరువుల
సందున రో లీడ్చికొంచుఁ జనఁగా నది య
మ్మందల నడ్డము వడి యే
మందు సమూలముగఁ గూలె నమ్మది తరువుల్. ౪౧౬

అటు నీవు చెట్ల విరువఁగఁ
దటుకున నా వృక్ష గర్భతలమున వెలుఁ గొ
క్కటి తోఁచె యక్షు లిరువురు
నటఁదోఁచి నినున్ నుతించిరఁట గోవిందా! ౪౧౭

ఎవరెవరేమి దేవతల నెన్నివిధమ్ములఁ గొల్చి రేనియున్
జివరకు నిన్నె చేరుదురు; శ్రీ శివపాద సరోజభక్త సా
ధువులు నిలింపమౌని కృపతో నటుగోరి యనన్యముక్తివై
భవమును జూరలాడిరి భవచ్చరణైక శరణ్యులై హరీ! ౪౧౮

తరుదారణ దారుణరవ
పరికంపితమయ్యె గోపవర్గము; లజ్జన్
బరికింప గోపి, ముక్తిదు
మురహరు నిన్ దండ్రి తరువిముక్తు నొనర్చెన్. ౪౮౯

హరిమహిమఁ జెక్కు సెదరక
తరుమధ్యమునందుఁ జిక్కి దక్కిన శిశువం
చరసి నినున్ గొనివచ్చిరి
పరమేశ్వర! శరణు నన్ను బాలింపు హరీ! ౪౯౦

## ౪౯. బృందావన గమనము

నీ మహిమమ్ములం దెలియనేరని గొల్లలు గొల్ల పల్లెలో
నేమియుఁ గారణమ్ము స్ఫురియింపక చట్టనఁగూలెఁ జెట్టు లిం
కేమి యుపద్రవమ్ము లిఁక నిక్కడఁ దోచునొయంచు సంశయో
ద్దామ మనస్కులౌచుఁ బలుదారులఁ బోఁ దలపోసి రయ్యెడన్. ౪౯౧

ఉపనందుఁ డనెడి గొల్లం
డపుడు భవత్ప్రేరణమున నటకుఁ బడమటన్
విపినము బృందావనమన
నపరిమితామోదమధుర మది గలదనియెన్. ౪౯౨

బృందావీథులు గోష్ఠముల్ జలిపి కన్విందైన గోబృందమం
దందు న్నిల్వ క్షణమ్ములోఁ గదలి యత్యానంద సందోహులై
నందాదుల్ వెనువెంబడిన్ నడువ నంతన్ మీ యశోదమ్మ యిం
పొందన్ నిన్నొడిఁజేర్చి యందుఁ జనె నెంతో ముచ్చటల్ గుల్కుచున్.

అల యంబారవమ్ములయందు బండ్ల
చక్రములఁ గుల్కు కిరకిర శబ్ద మందు
నెడనెడన్ నీదు బుడిబుడి నుడుల సొగసు
గ్రోలుచున్ దూర మెఱుఁగ రా గోపసతులు. ౪౯౪

ఘుమఘుమలాడు కుంద సుమకోమల గంధవహమ్ము హర్ష వి
భ్రమ మొదవింపఁ బచ్చనగు పచ్చిక పచ్చలు దాపినట్టి కు
ట్టిమ మనిపింప నవ్వనము శీవికి నందలి వింత యందచం
దములకు నీవునున్ మురిసినావు ముకుంద! మునీంద్ర వందితా! ౪౯౫

అల బృందావన వీథుల
నిలు దీరిచె గోప బృంద మెల్లరు నుండన్
చెలు లగు గోప కిశోరులఁ
గలిసి మెలిసి తిరిగి తిరిగి కాంచితివెల్లన్. ౪౯౬

వంకర టింకరల్ దిఱిగి వచ్చుచు నచ్చము తీయనౌ రస
మ్మంకిత మిచ్చుదానిఁ గలహంస వచః కలహాస్య వైభవ
మ్మంకువ సేయుదానిని నవోన్మిష దబ్జముఖిన్ గృపా కటా
క్షాంకితఁ జేసి తందుఁ గమలాక్ష? కళింద మునీంద్ర నందనన్. ౪౯౭

* నెమళుల్ గేకల నింపుసొంపు గొలుపన్, నీరంధ్ర రత్నచ్ఛటా
సముదాయమ్ము లుదాత్తశోభ నిలుపన్, స్వాయంభువమ్మైన లో
కముదాకం గల శృంగముల్ గులుకఁ జొక్కమ్మైన గోవర్ధనో
త్తమ శైలమ్మటఁ జూచినావఁట ముకుందా ! ముక్తికాంతాప్రియా !

బృందావన వీథుల శిశు
బృందముతో మసలినాఁడ విందందటఁ గా
ళిందిం గుటిలం జూచితి
సుందరిఁ దను వలచుదాని జూచిన భంగిన్. ౪౯

## ౫౦. వత్సాసుర బకాసుర సంహారము

జుమ్మని తుమ్మెదల్ ముసరు చోటుల నీటులుగుల్కు బృంద నం
దమ్మగు మందలన్ బశుపనందనులన్ బలరాముఁ గూడి బె
త్తమ్మను గొమ్ముబూరయును దాలిచి, వేణువు నూది నేత్ర ప
ర్వమ్మగు మేనిసొంపు లలరం గయికొంటివి పాశుపాల్యమున్. ౫౦౦

లచ్చి కరారవిందముల లాలితముల్ భువనావనమ్ములౌ
త్వచ్చరణమ్ములన్ బరమపావన మవ్వనవీథి నంపగా
నచ్చట లేని సంపదలు నందము లున్నవె చెట్లు తీగలున్
ముచ్చటగొల్పె నందు జలముల్ పొలముల్ గిరులున్ ఝరమ్ములున్. ౫౦౧

---

* నెమళులు కేకలన్ వలపు నింపుచు నించిన రత్నకాంతి పూ
రములఁ దరంగితమ్మగుచు బ్రహ్మపద మ్మెనయంగఁ జాలు శృం
గముల నభంగ భంగిమమునన్ గనువిందొనరించు శైలరా
జముఁ గనుగొంటి వవ్వనము చాయల గోకులవర్ధన మ్మొగిన్.

యమునాతీర విశాల శీతలసమీరాలోల బృందావనీ
సముదంచ త్తృణశయ్యలం దొకట నుచ్చైశ్చారు గోవర్ధనో
త్తమ మూర్ధమ్మున వేణు వూదుచును వత్సశ్రేణి బాలించునా
సమయానన్ గనినావు రక్కసుని సాక్షాద్వత్సరూపున్ హరీ! ౫౦౨

తోకను మీఁది కెత్తికొని దూటుచు నించుక ముట్టె వంచి నీ
లోకువ సూచి క్రుమ్ముటకు లోఁదలపోసెనొ లేదొ వాని కా
ళ్లాక యొకింతలేక కొని యద్దిర! గిర్గిరఁ ద్రిప్పికొట్టి బల్
ఢాక నడంచి ప్రాణ మెడలన్ వడిఁ జిమ్మితి వృక్ష వాటికన్. ౫౦౩

జాతి దురంతకుం డసుర చాగిపడన్ మఱి గూలె వృక్ష సం
ఘాత మరణ్యముం దెలుపిగా; నటఁ గూటువగట్టి దేవతా
వ్రాతములెల్ల నీ శిరముపై నవకల్పక పుష్పమంజరుల్
ప్రీతమనస్కులౌచుఁ గురిపించిరి దుందుభి వాద్య ఘోషలన్. ౫౦౪

అనుపమ సౌరభ ప్రచురమై కురిసెం బువు వాన నీ శిర
మ్మునఁ బయినుండి యేమనెడి ముగ్ధకుమారులఁ గేలిసేసి వెం
టనె "యసురన్ వడిన్ విసరుటన్ దరుమండలి నుండి పైకిఁ బో
యిన విరిసోన జల్లుపడియెన్ నిజ"మంటివి మాయలాఁడవై. ౫౦౫

చెలికాం డ్రీవును మండువెండవడి గాసిం జెంది సూర్యాత్మజన్
జలము ల్ద్రావగ నేగి చూచితి రుదంచత్పక్షవిక్షేపు ని
శ్చల వజ్రాయుధ విస్మృతోద్ధతగరుత్సంఛేద నాన్యాదృ శో
జ్జ్వల కైలాసగిరీంద్రతుల్యు బకు సాక్షాత్కంససంసేవకున్. ౫౦౬

గోపులు దప్పికన్ జలము గ్రోలుచునుండ బకుండు పర్వునన్
నీపయిఁ దూకి నిప్పునటు నిన్గబళించి దహించు సెంచి, తా
నోపకగ్రక్కి ముక్కున నహో! మఱి చీల్పగఁబోవ దుష్టని
ర్వాపణచుంచువై యసుర గ్రక్కులు సేసితి చీల్చి చంచువుల్. ౫౦౭

ముసు జనె నాడుతోడనుచుఁ బూతనఁ జూడనో, యింకమీఁద వ
చ్చును చినతమ్ముఁడం చెదురుచూచి యఘాసురు నాదరింపనో
చనెననఁగా బకుండు యమసన్నిధికేగిన, నింటికేగి తం
దును సుమనోగణమ్ము సుమనోగణముం గురిపింప నీపయిన్. ౫౦౮

మురళీనాదము దూరమందె విని యా ముగ్ధాంగనల్ హర్షవి
స్తరులై మిక్కిలి తత్తరించెదరు బృందావీథులందుండి స
త్వరుఁడై వచ్చెడు నిన్నుజూడఁగ యశోదానంద దృక్చందనా!
గురువాయూరుపురీవిహారకలనా! గోబృంద హృన్నందనా! ౫౦౯

## ౫౧. అఘాసుర సంహారము

ఈ వొకనాడు గోప శిశుబృందముతో వఱువాత లేచి బృం
దావన వీథులందు యమునాతటినీవట శాద్వలమ్ములం
దావుల మేప నేగు నపు డక్కడఁ జల్దుల నారగింపఁగా
నేవెవొ వింతవింత చవు లీను రుచు ల్గొని యేగినా వొగిన్. ౫౧౦

నిజరుచితోఁ గళింద తటినీతటమందుఁ జరించుచుండఁగన్
ద్రిజగములం బవిత్ర మొనరించు భవచ్చరణాంబుజద్వయీ
రజ మొడ లెల్లఁ బూసికొని రక్తిమెయిన్ బులకించుచుందు ర
క్కజ మొనరించు నీ సొగసు గన్గొను ముచ్చటజెంది సన్మునుల్. ౫౧౧

పచ్చని పచ్చికల్ మొలచు పట్టుల బాలురు నీవుఁ గ్రేపులన్
మచ్చిక మేపుచున్న తఱి మార్గమునన్ శయనించునట్లు తా
నచ్చము దోఁచి మీ తెరువు నంతయు దానయి యాక్రమించెఁగాఁ
గ్రచ్చర న య్యఘాసురుఁ డఘస్ఫురణన్ బహుభీషణాకృతిన్. ౫౧౨

ఉండినవాఁడ వున్నటుల నొక్క క్షణమ్మున దూర మేగఁ బెన్
గొండను బోలెఁ దత్తనువు గోచరమై మఱి వానినోరు ను
ద్దండ గుహాముఖ మ్మయిన దాన విహార కుతూహలమ్ముచే
నొండు తలం పెఱుంగ కట నొక్కొకరే చొరబారి రర్భకుల్. ౫౧౩

క్రేపులతోడ గోపకులు కేవలముం బొరపాటుచేత సం
తాపిత దేహు లౌట బహు దారుణ పన్నగ గర్భముం జొరం
ద్రాపయి మిత్రకోటిఁ బరిపాలన సేయగ నీవునున్ గృపా
రూప ! యెఱింగి చొచ్చితివి క్రూర మహోరగ గర్భగోళమున్. ౫౧౪

పాము గళమ్ము నె న్నడుమఁ బట్టగ రానటు మేను వెంచు నీ
చే మఱి యూపిరాడ కది చేడ్పడి తన్నుకొనంగ నీవు ను
ద్దామత దాని కుత్తుకఁ బదంపడి చీలిచి గోప గో శిశు
స్తోమము నాపదం గడువఁద్రోచి వెలిం బఱతెంచి తీవునున్. ౫౧౫

అసుర శరీరమున్ వెడలి యద్భుతమౌ నొకవెల్గు నిల్చె నా
కసమున నీవు వచ్చుదనుకన్; వెలి కీవరుదెంచినంతటన్
వెస నది లీనమయ్యెఁ; గడువేడుక నచ్చరలాడి రంత నీ
యసదృశ కీర్తి పాడి రఖిలామరగాయనగాయనీమణుల్ ! ౫౧౬

కమలభవాది నిర్జర నికాయము విస్మయమంది కొల్వఁ జొ
క్కములగు లీలలన్ గమల కర్ణిక చుట్టునున్న రేకుల
ట్లమరిన బాలురన్ నడుమ నల్లన బువ్వల నారగించు నం
దము మురిపించినాఁడవు గదా ! నడిమింట నినుండు వెల్గఁగన్. ౫౧౭

నడుమున దిండుజుట్టు వసనమ్మున నొక్కెడఁ గొమ్ముబూర యొం
డెడ మురళిన్ వడిన్ జొనిపి యెల్లరతో నెకసక్కెమాడుచున్
బుడిబుడి ముచ్చటల్ గులికి మున్ బెరుగన్నము ముద్ద చేతిలో
నిడికొని యారగించితిగదే సురబృందము నిన్నుతింపగాన్. ౫౧౮

కదిసి నిలింపనాయక నికాయముతో మఖ భోజనమ్ము సే
యుదువఁట, యంతకంటెఁ బ్రియమో ! మఱి యీవనభోజనమ్ము సే
సెదవు కుమార గోపకులచెంత హరీ ! యని దేవబృంద మె
న్నెదరు మరుత్పురీనిలయ నిన్, నను బ్రోవర భక్తవల్లభా !

## ౫౨. గోవత్సాపహరణము

ఏ యవతారమందు స్ఫురియింపని నీ దురితాపనోద లీ
లాయతమైన నేటి మహిమాతిశయమ్ముఁ బరీక్ష సేయఁగా
మాయను బెంచి మందలను మాయము సేసెను వెఱ్ఱిబ్రహ్మ వి
శ్వాయత సృష్టికర్తకు లయాభినివేశ మదేమి కర్మమో! ౫౨౦

కదుపులఁ గానమిన్ బసులకాపరు లెంతయుఁ గొందలింప న
య్యదనునఁ దెచ్చువానివలె నాలరిబ్రహ్మ యొనర్చు మాయలో
నొదిగినవానిఁబోలె జని తొయ్యన కొంచెము తిన్నముద్దతో;
నదనది సూచి యక్కడి వ్రజార్భకులన్ హరియించె బ్రహ్మయున్. ౫౨౧

ఒక్కండయ్యును దూడలున్ వ్రజ శిశువ్యూహమ్మునై మాయచేఁ
జిక్కమ్ముల్ దధిభాండముల్ మురళులున్ జేఁగఱ్ఱలున్ బూరలున్
బెక్కై ముందటి యన్నిరూపు లగుచున్ వేర్వేర బృందావనిన్
జక్కంగా విహరించి వచ్చితిగదే సాయంతన మ్మింటికిన్. ౫౨౨

ఆవుల్ లేగలు బాలరూపములు నీవై చిక్కముల్ బూరలే
వేవో నీవయి వాని నెల్ల మఱి నీవే తాల్ప గోగోపికా
భావమ్మందిన తల్లులందరు నపూర్వమ్మైన యానంద వి
స్ఫా వైరాజ్యము చూరలాడిరి భవత్సర్వాత్మభావమ్మునన్. ౫౨౩

తమకుఁ బిడ్డగ మున్ను జీవు నొకనిఁ దర్కించి యాత్మీయుగాఁ
గుమతుల్ రాగము పెంచి రింత వరకుఁ గోగోపికాబృందముల్;
తమకున్ బిడ్డగ నేడు కేవలము నాత్మఁ బొంది తారెట్టి యం
దము నానందము నందిరో తెలిసి యెన్నఁ శక్యమే యేరికిఁ. ౫౨౪

* చనెనటు లొక్కయే డెఱుక సాలియుఁ జాలక మున్ను దాను దా
చిన మఱి నేడు సూచిన యశేష కుమారక గోకదంబముఁ
గని వెఱగందె నవ్విధి కనత్కనకాంగద భూషణుల్ ఘనా
ఘన రుచులుఁ జతుర్భుజులు కాంచనచేలురు నంద రొటకుఁ. ౫౨౫

సిరికిరవైన మేనులు నశేషఫణీంద్ర ఫణాగ్రమందు ని
ద్దుర నటియించుచుఁ మొగుచు తోరపుఁ గన్నులు గల్గువారలఁ
వరసనకాది యోగిజన వందితులయ్యెడు వారి మిమ్మొకొ
క్కరి విడిగాఁ గనుంగొనియెఁ గంజభవుం డభిరామమూర్తులఁ. ౫౨౬

ఆమెడ మాయగ్రమ్మ హృదయమ్మున మోహితుఁడై యనంత నా
రాయణ మూర్తులఁ మఱి స్వయమ్మటఁ గింకరులైన తన్ను నా
తోయజసూతి సూచిన యనుక్షణమే కబళార్ధ పాణివై
డాయఁగ వచ్చి నావటఁ దటాలున నొక్కఁడుగాగ నొక్కఁడై. ౫౨౭

---

* వనజోద్భూతి సనాతనాద్యతన గోపాలార్భక శ్రేణిఁ గ
న్గొని యేడవ్వల, నున్నతెల్వి పెడి సంకోచింపఁగా నూత్నమూ
తనులన్ శ్రీ మకుటాంగదాభరణులన్ దర్శింపఁగాఁ జేసినా
వన ! పీతాంబరులన్ జతుర్భుజుల నవ్యాంభోద సంకాశులన్.

అంతట విశ్వనాథు పదమంటి నినుం గొనియాడి బ్రహ్మ యం
తంతన యింటికిం జనఁగ, నర్భకబృంద మమంద హర్ష వి
భ్రాంతిని బొంది మంచగొనిరాఁ జనినాఁడవు గొల్లపల్లెకుఀ;
వంత సమస్తముం దొలఁచి వాతనికేతన ! ప్రోవరా ననుఀ. ౫౨౮

## ౫౩. ధేనుకాసుర సంహారము

కడచి బాల్యమ్ము మిసిమి పౌగండమూని
చిన్ని తువ్వాయులన్‌గాచు చిన్ని పనికిఁ
జొరక గోలోకముంగాచు చొరవఁ బూని
నావు భువనైక పరిపాలనావినోద ! ౫౨౯

పవనపురనాథ ! నీదు ప్రవర్తన మ్ము
పక్రమమునకు సమనురూపముగ నడచెఁ
బూనిగోత్రాపరిత్రాణమునకు నవత
రించితివికాన యదె యుద్యమించి తిపుడు. ౫౩౦

రాముతోఁ గూడి యవ్వన రామణీయ
కమ్ము గనుగొంచు సుఖముగాఁ గలిసితిరిగి
సఖుఁడు శ్రీదాముఁ దెలిఁగింప సంతసమున
నీవు ధేనుక వనమున కేగినావు. ౫౩౧

లీల నీ మాటపై సముత్తాల తాళ
తరుల బలరామమూర్తి హస్తముల నూప
సరస తాళఫలమ్ము లుద్ధుర కఠోర
మూర్తి ధేనుకుఁడున్ డుల్లి పుడమిబడియె. ౫౩౨

ధేనువులఁగాచు పనికదా పూనివచ్చి
నాఁడఁ దద్వధ మెటుసేయు వాఁడ ననుచు
తలఁచి కాఁబోలు బలరామువలన నమర
వైరి జంపించినాఁడ వుదార చరిత ! ౫౩౩

వాని బంటులు నక్కలై వచ్చినంత
బలుఁడు నీవును నేరేడు పండ్లు రాలఁ
గొట్టిన ట్లందరం గొట్టి తాటి
వనములం దాడుకొంటి రే వలపు లేక. ౫౩౪

కలిగె నీ వవతరించి నందులకు ఫల మ
టంచు వేలుపు లెల్ల నుతించుచుండ
నీవు నిదిగో ఫలమ్మంచు నెలమి నవ్వి
తాటిపండ్లారగించి తందరను గూడి. ౫౩౫

జంబుకవధమ్ము నీవట జరిపి బంధ
ముక్తి నొనరించితని బంధముక్తిగోరి
చెలఁగి తానును శ్రుతి సుప్రసిద్ధమైన
యదియ పేరూనె వరణుఁడం చాత్మనెంతు. ౫౩౬

తేనెలూరుచు గుంజు నెంతేని గలుగు
నురవయిన పండ్లు తిని తృప్తిపొరసి ముదము
నెనసి తిన్నన్ని మఱిమోచికొనుచుఁ దోడి
బాలకులతోడ నింటికి వచ్చినావు. ౨౩౭

ధేనుకుఁడు గూలెఁగూలె నంచూని మధుర
ఫలము లానుచు లోకులు పాడి నిన్ను
జేరి జయజయ యని చిరంజీవ యనుచు
నాడి రనిలపురేశ ! న న్నాదరింపు. ౨౩౮

## ౨౪. గోగోపోజ్జీవనము

ముందొకనాడు చూచె ఖగపుంగవు సౌభరియన్ మునీంద్రుఁ డా
నందమునొంది నీ కొలువునకు బదిరెండగునేండ్లు నిల్చి కా
ళింది జలమ్ములన్ దపము లీలగఁజేయుచు భోగలోలమై
యందు వసించు మీనములయందుఁ గనెన్ దరిలేని స్నేహమున్. ౨౩౯

కడువడి నాకటన్ నకనకంబడి నీదగు వాహనమ్మ య
క్కడ నొక చేపపిల్ల దినగాఁగని యమ్మని యుమ్మలించి య
ప్పుడ శపియించె నా ఖగవిభున్ బొగరెక్కి యొరోరిపక్షి! యి
య్యెడ నొకప్రాణి నీవు భుజియింతువొ మేను త్యజింతువంచొగిన్.

అదె సమయానఁ గాళియమహాఫణిదుర్విషగర్వ ధూర్వహుం
డదిర ! గరుత్మదర్థమగు నా బలి తాన భుజించినంతఁ ద్వ
త్పద జలజార్చకుండు వినతాసుతుఁ డీసున తెక్కలార్చి యం
దదలిఁచి సర్పముం దరిమె నయ్యది యా హ్రదవారిలోబడన్. ౫౪౧

కుతకుతఁ గ్రాగె నమ్మడుగు ఘోరమహాహి విషాగ్నికీలలన్
సతమత మయ్యెఁ దత్తటమునన్ దరుషండము మింటఁబారు ప
క్షితతులు గుప్పగూలె విషకీలల యవ్వడగాలిసోకి య
చ్యుత ! కరుణారసార్ద్రమయి యొప్పె భవద్ధృదయమ్ము నయ్యెడన్. ౫౪౨

యమునాతీర వనాంత వీథి నొకనా డన్నయ్య రాకుండ వే
గమ నీ వేగినవేళ నుద్ధతి నిదాఘక్షుబ్ధమై దప్పికన్
గుములం జొచ్చి సహింపనేరకట గో గోపాలబృందమ్ము లా
త్రమునన్ గేవలమున్ విషమ్ము విషమంతన్ద్రావి రొక్కుమ్మడిన్. ౫౪౩

త్రావిన యాక్షణ మ్మెడలి ప్రాణములందఱు నేలఁగూల గో
పావళి గోకదంబ మది యప్పుడఁ కన్గొని చేరవచ్చి సం
జీవితముం బొనర్చితివి చెల్వగు నయ్యమృతమ్ము వర్ష ధా
రావళినించు నంచిత కటాక్ష రుచుల్ వెలయించుచున్ హరీ ! ౫౪౪

అవయవముల్ నిరంతర సుఖామృత వర్షమునందు దోగ నే
డవుర యిదేమిదేమనుచు నల్లన నందరు లేచి చూచిరా
దవుల నినున్ గ్రహించి తుది త్వత్కృతమంచు భవత్ప్రభావ వై
భవములవెన్నొ మున్గనిన వారగుటన్; నిను గౌగిలించుచున్. ౫౪౫

స్తోక స్తే భాగ ఏవాఖిలభువన యా దృశ్యతే త్ర్యంశకల్పం
భూయిష్ఠం సాంద్రమోదాత్మక ముపరి తతో భాతి తస్మై నమస్తే.

అవ్యక్తం తే స్వరూపం దురధిగమతమం తత్తు శుద్ధైకసత్త్వం
వ్యక్తం చా ప్యేతదేవ స్ఫుట మమృతరసాంభోధికల్లోలతుల్యమ్
సర్వోత్కృష్టా మభీష్టాం తదిహ గుణరసేనైవ చిత్తం హరంతీం
మూర్తిం తే సంశ్రయేఽహం పవనపురపతే పాహిమాం కృష్ణ రోగాత్.

## ౧౦౦

అగ్రే పశ్యామి తేజోనిబిడతరకలాయావళీలోభనీయం
పీయూషాప్లావితోఽహం తదను తదుదరే దివ్యకైశోరవేషమ్
తారుణ్యారంభరమ్యం పరమసుఖరసాస్వాదరోమాంచితాంగై
రావీతం నారదాద్యై ర్విలసదుపనిషత్సుందరీమండలైశ్చ.

నీలాభం కుంచితాగ్రం ఘన మమలతరం సంయతం చారుభంగ్యా
రత్నోత్తంసాభిరామం వలయిత ముదయచ్చంద్రకైః పింఛజాలైః
మందారస్రఙ్నివీతం తవ పృథుకబరీభార మాలోకయేఽహం
స్నిగ్ధశ్వేతోర్ధ్వపుండ్రా మపి చ సులలితాం ఫాలబాలేందువీథీమ్.

హృద్యం పూర్ణానుకంపార్ణవ మృదులహరీ చంచలద్భ్రూవిలాసై
రానీల స్నిగ్ధ పక్ష్మావళి పరిలసితం నేత్రయుగ్మం విభో తే
సాంద్రచ్ఛాయం విశాలారుణకమలదళాకార మాముగ్ధతారం
కారుణ్యా లోకలీలా శిశిరిత భువనం క్షిప్యతాం మ య్యనాథే.

ఉత్తుంగోల్లాసినాసం హరిమణిముకురప్రోల్లసద్గండపాళీ
వ్యాలోలత్కర్ణపాశాంచితమకరమణీకుండలద్వంద్వదీప్రమ్
ఉన్మీల ద్దంతపంక్తి స్ఫుర దరుణతర చ్ఛాయ బింబాధరాంతః
ప్రీతిప్రస్యంది మందస్మిత మధురతరం వక్త్ర ముద్భాసతాం మే.

బాహు ద్వంద్వేన రత్నోజ్జ్వలవలయభృతా శోణపాణిప్రవాలే
నోపాత్తాం వేణునాళీం ప్రసృతనఖమయూఖాంగుళీసంగశారామ్

కృత్వా వక్త్రారవిందే సుమధుర వికస ద్రాగ ముద్భావ్యమానై
శ్శబ్ద బ్రహ్మామృతైస్త్వం శిశిరితభువనై స్సించ మే కర్ణవీథీమ్.

ఉత్సర్పత్కౌస్తుభశ్రీతతిభి రురుణితం కోమలం కంఠదేశం
వక్షః శ్రీవత్సరమ్యం తరళతరసముద్దీప్రహారప్రతానమ్
నానావర్ణప్రసూనావలికిసలయినీం వన్యమాలాం విలోల
ల్లోలంబాం లంబమానా మురసి తవ తథా భావయే రత్నమాలామ్.

అంగే పంచాంగరాగై రతిశయవికసత్సౌరభాకృష్టలోకం
లీనానేకత్రిలోకీవితతి మపి కృశాం బిభ్రతం మధ్యవల్లీమ్
శక్రాశ్మన్యస్తతప్తోజ్వలకనకనిభం పీత చేలం దధానం
ధ్యాయామో దీప్ర రశ్మిస్ఫుటమణిరశనా కింకిణీ మండితం త్వాం.

ఊరూ చారూ తవోరూ ఘనమసృణరుచౌ చిత్తచోరౌ రమాయా
విశ్వక్షోభం విశంక్య ధ్రువమనిశ ముభౌ పీతచేలావృతాంగౌ
ఆనమ్రాణాం పురస్తా న్న్యసనధృతసమస్తార్థపాళీసముద్గ
చ్ఛాయం జానుద్వయం చ క్రమపృథులమనోజ్ఞే చ జంఘే నిషేవే.

మంజీరం మంజునాదై రివ పదభజనం శ్రేయ ఇత్యాలపంతం
పాదాగ్రం భ్రాంతి మజ్జ త్ప్రణతజన మనోమంద రోద్ధార కూర్మమ్
ఉత్తుం గాతామ్ర రాజ న్నఖరహిమకర జ్యోత్స్నయా చాశ్రితానాం
సంతాపధ్వాంతహంత్రీం తతి మనుకలయే మంగళా మంగుళీనామ్.

యోగీంద్రాణాం త్వదంగే ష్వధికసుమధురం ముక్తిభాజాం నివాసో
భక్తానాం కామవర్ష ద్యుతరుకిసలయం నాథ తే పాదమూలమ్
నిత్యం చిత్తస్థితం మే పవనపురపతే కృష్ణ కారుణ్యసింధో
హృత్వా నిశ్శేషతాపాన్ ప్రదిశతు పరమానందసందోహలక్ష్మీమ్.

అజ్ఞాత్వా తే మహత్త్వం యదిహ నిగదితం విశ్వనాథ క్షమేథాః
స్తోత్రం చైత త్సహస్రోత్తర మధికతరం త్వత్ప్రసాదాయ భూయాత్
ద్వేధా నారాయణీయం శ్రుతిషు చ జనుషా స్తుత్యతావర్ణనేన
స్ఫీతం లీలావతారై రిద మిహ కురుతా మాయురారోగ్యసౌఖ్యమ్.

ఇతి శ్రీః శ్రీః శ్రీః

తీరుగఁ బ్రాణముల్‌వడసి ధేనువు లబ్బురమైన యుబ్బునన్
జేరి నినున్ గనుంగొనుచు నిచ్చట కన్నుల హర్ష బాష్పముల్
ధారలుగాగ నించుచును దంద్రి! నినుఁ వడి చుట్టువారి యం
భారవముల్ పొనర్చె ఋషభస్వర మంద్ర మనోజ్ఞ మూర్ఛనఁ. ౫౪౭

తనువెల్లఁ బులకించెఁ జూడుమిదె యంతర్వీథినానంద మూ
ర్ఛనకాఁబోలిది దుర్విషగ్రసన మాశ్చర్యమ్మ గోవింద! క
న్గొను మావంక ముకుంద! రమ్మనెడు నాగోపాల బృందాభినం
దనముల్ వందన మందుకొంటివి గదన్నా నందగోపార్భకా! ౫౪౭

ఈ విధి ముక్తులౌ జనము నెల్లర భక్తుల రోగముక్తులఁ
నీవొనరించుచుందువు వినిర్మల ముగ్ధకటాక్ష వీక్షణా
ప్లావమొనర్చి తాదృశ కృపాపరిపాక సుఖాతిరేక సం
భావన నాకొసంగఁ దగవా గురువాయుపురాధి నాయకా! ౫౪౦

## ౫౫. కాళియ మర్దనము

అల ఘోరతర మ్మగు సర్ప మటఁ
దొలగింపగ నుద్ధుర ఘోరవిషా
గ్నుల గాలికి నాకులు మాడిన యు
జ్వలనీపము సత్వర మెక్కి హరీ! ౪౪౯

నవపల్లవ సుందర దివ్య పద
చ్ఛవి నించుచు వృక్షము నెక్కి వడిన్
దవు దవ్వుల నంతన దూకితి వా
క్కవడిన్ తరగల్ కలగం బడగాన్. ౫౫౦

భువనత్రయమున్ బూనిన నీ బ
ర్వవశమ్మయి నీరటు పొంగి వడిన్
భువమెల్ల యెడన్ మునిఁగించెఁ దదు
ద్భవ భంగతతుల్ బహు ఘోషమిడన్. ౫౫౧

నదిలో సుడిగుండములై ధ్వని య
న్ని దెసల్ నిగుడక నెఱి దప్పివడిన్
గదలెన్ మఱి నీ కడ కయ్యహి నె
మ్మదిలేక మదిన్ బటురోషమునన్. ౨౫౨

తలలన్ బదివందల నగ్ని కణ
మ్ములు రాల్చు విషమ్మును దాల్చు నహిం
దిలకించితి వద్దిర! పెక్కుతలల్
గల యంజన శైలము గన్నయటుల్. ౫౫౩

జ్వలదక్షి పరిక్షర దుగ్రవిషా
నల మూర్పుల జింద మహోహి మహా
బలు నిన్ గఱచెన్ బహుభంగుల చే
ష్టలు దక్కగ బొజ్జను జుట్టుకొనెన్. ౫౫౪

దరినిల్చి నినుఁ దరిసింపక యం
దరు మందలు కొందలమంద గృహాం
తర సీమ నిమిత్తము లన్ని శుభే
తరముల్ గని తత్తర మంది రొగిఁ. ౫౫౫

త్వరగాఁ జని గోపకు లందఱు నిఁ
సరవిఁ గని ప్రాణము లిత్తుమనఁ
గరుణఁ ఫణి బంధనముఁ విడి చె
చ్చెర వచ్చి తటన్ జిఱునవ్వులతో. ౫౫౬

ఫణిరాజ ఫణాభరణాయిత కిం
కిణి నూపురముల్ కెరలఁ గర కం
కణ కింకిణి నిక్వణనమ్మొగ న
ర్తన మాడితి మెత్తనిపాదములఁ. ౫౫౭

వ్రజవాసులు సంబర మందిరి స
ద్ధ్వజ మెల్లరు నిఁ రహిఁ బాడిరి ద్యోః
ప్రజ పూవులు నీపయి నించి రిటుల్
త్రిజగన్నటమూర్తివి వాతపతీ! ౫౫౮

## ౫౬. కాళియానుగ్రహము

కుండలమండలమ్ము తళుకుల్ కులుకఁ గులికించి పన్నగా
ఖండలుమీఁదఁ దాండవ మఖండ గతిం బొనరింప నింగి యం
దుండి నిలింపకాంతలు నహో మఱి పాడిరి యాడి దేవతా
మండలి దుందుభిధ్వని సమంచిత మంగళఘోష మీసఁగన్. ౫౯

తలయం దందది వ్రాల్చి వంచు కొలఁదిఁ దప్పించి గుప్పించి యా
తలపైపైతలకెక్కి పాదజలజాంతర్జ్యోతి యంతస్తమ
స్సుల నెల్లన్ మథియింపఁ దత్ఫణి శిరస్సుల్ ద్రొక్కి నర్తించినా
వెలమిఁ ద్వత్కరతాళమేళనము నెంతే ముచ్చటల్ గూర్పగన్. ౬౦

చావునఁ దప్పి భంగపడి జాలయి రక్తము నీరు రక్తమై
పోవ హ్రదమ్మునఁ ఫణివిభుం డవసానదశం జరింప ల
క్ష్మీవిభుఁడైన నీపద సమీపమునన్ బడి కాళియాహి ప
త్నీవిసరమ్ము దుఃఖపరిభీకృత ధీవికృత ప్రచారమై. ౬౧

చిరకాలానకు మున్ను గ్రోలిన భవచ్ఛ్రీస్వానుభావామృత
స్ఫురణన్ లీనత నొందు చిత్తములతో శోధించి మౌనీంద్రులే
నరుగన్ రాని క్రమమ్మునన్ స్తుతికథావ్యాసక్తులై పాడి ర
చ్చెలువం దచ్చెరువైన నిన్ ఫణిఫణా శృంగార రంగాగ్రగున్. ౬౨

పన్నగ సుందరీగణము భక్తి గనుంగొని పొంగి సత్కృపా
భ్యున్నతి జీవితమ్ము పరిపూర్తి యనుగ్రహ మిచ్చినావు నా
గన్నకు; నీకునై తనువు నప్పన చేసి ఫణాసహస్ర ఫే
లన్నవరత్న దీధితి కలాపము దీపము వెట్టి మ్రొక్కఁగన్. ౧౬౩

"రమణక మింక పొమ్ము దధి రాజిలు; నం దహివైరి యెట్టి వై
రముఁ గొన డెత్తి రాఁ డిది వరమ్ము సుమీ" యని నీవు పంపగన్
సుమధురమైన నీపలుకు సొంపు గణించి యశేషనాగ సం
ఘము తన వెంబడిన్ నడువగా నటకున్ నడచెన్ ఫణీంద్రుఁడున్. ౧౬౪

కాళియు నంగనామణులు క్రమమణిద్యుతి పుంజ రంజిత
శ్రీలగు హారముల్ నగలు చెల్వగు స్వర్ణ దుకూలజాలముల్
హేలగనీయఁ దాల్చి మఱి యేగితి వద్దరి నున్న హర్ష బా
ష్పాలసదృగ్విలాసులగు నాప్తులతో నరసంజ ప్రొద్దునన్. ౧౬౫

చిప్పిలుకొంచు నక్కటికి చీఁకటి గ్రమ్మె, జనమ్ము పల్లె కిం
కిప్పుడు పోవుటెట్లని శయించిరి తో నిదురించి ; రంతలో
గుప్పున గారుచి చ్చలముకొన్నది యెక్కడినుండి వచ్చెనో
యప్ప ! భవత్పదాశ్రయు లనాశ్రయులై రపు డేమి చెప్పుదున్. ౧౬౬

మేల్కని కావు కావు మను మిత్రులఁ గావఁదలంచి వారిపై
నాల్కలు సాచి మ్రింగ జవనమ్మునఁ గ్రమ్ము దవాగ్ని కీలలన్
జుల్కనఁ ద్రావిపైచితివి చోద్యము లన్నిఁటి కాటపట్టు నీ
కల్కి ముఖమ్ము గావలయుఁగా కరుణావరుణాలయా ! హరీ ! ౧౬౭

అద్దిర వర్ణమాత్రమున నా శిఖియందలి పీతభావ మి
ష్టద్ది క్రియా విధిన్ వెలసెనంచును గోవులఁగాచు గొల్లలున్
సుద్ధులు వాడి నివ్వొగడు సొంపది యింపొనరించె; కృష్ణ ! మే
ల్గద్దరి వీవు నాడు రుజలన్ దురితమ్ములఁ ద్రోలలేవటే ! ౫౬౮

## ౫౭. ప్రలంబాసుర వధ

బలరామునితో బృందా
స్థలి కేగితి వొక్కనాఁడు చక్కని వేస
మ్ములు పూని యాప్త మిత్ర
మ్ములతోడన్ గోకదంబములతోడ హరీ ! ౫౬౯

బృందావన సౌందర్యము
సందర్శింపించి హలికి స్వైర విహా రా
నందముతో భాండీర వ
టిం దరిసితి చెలులు వెంబడింబడి రాగన్. ౫౭౦

రక్కసుఁ డొకఁ డతి కర్కశుఁ
డక్కడఁ బ్రాలంబ బాహుఁ డగుచుఁ బ్రలంబుం
డుక్కున నిన్ బొరిగొను తలఁ
పెక్కి నిసున్ గదిసె గోప హేలాకృతియై. ౫౭౧

తెలిసియుఁ దెలియని యట్టుల
చెలిమిం గొని వానితోడఁ జెలు లందరితో
నల మట్టి నీడఁ గ్రీడన
ములఁ జొచ్చితి ద్వంద్వయుద్ధములఁ దలపడుచున్. ౫౭౨

బలరాముని దొక్కటి నీ
బల మొకటిగ గోపకుల విభాగించి భవ
ద్బల భీరువు రక్కసు నీ
వలనున నుండుటకు నిష్టపడితివి కృష్ణా ! ౫౭౩

తా నోడి యోడ కుండిన
వానిని మోయంగవలయు పణమున భక్తా
ధీనతను జాట మోయగ
నూసితి శ్రీదాము నీవ యోడి ముకుందా ! ౫౭౪

గెలుపరి నెత్తికొనిచనన్
వలసిన పందెమున నాప్తవరు శ్రీదామున్
దల మోచినావు నా దా
సులకున్ నే దాసుఁడ నటంచుఁ జాటు ముకుందా ! ౫౭౫

మోయుచు మోయంబడు చిటు
లై యందరు నడువ, నోడి యా రాక్షసుఁడున్
మోయుచుఁ జనె బలభద్రు న
పాయము నీవలన నెంచి బహుదూరముగన్. ౫౭౬

దూరము గొనిపోఁబోవ న
పార భరమ్మగుచుఁ దోచె బలరాముఁడు స్వా
కారముఁ గొనె రాక్షసుఁ; డా
క్రూరాకృతి కంతవాడు కొండల పడియెన్. ౫౭౭

పొడవడరు నొడలు గని కడుఁ
దడబడి బలరామమూర్తి తద్దయు నీమో
మెడనెడఁ గనుచున్ జడియక
సుడియన్ దృఢముష్టి దుష్టు చూర్ణము సేసెన్. ౫౭౮

ఖలు ప్రబలుఁ జంపివచ్చిన
బలు సుబలుం గౌగిలించి వలపొల్కతి వ
వ్వల మీ యిద్దరి పైపై
నొలికించిరి పూలజల్లు లోకపై వేల్పుల్. ౫౭౯

ప్రాలంబవధముచే భువ
నాలంబనమైతి కాలయాపన మేలా
రోలంబచికుర! పవనపు
రాలంబ! రుజల్ హరింపరా నిను గొల్తున్. ౫౮౦

# ౫౮. దవాగ్ని మోక్షణాదికము

బాలురతో విహార పరిపాటిఁ జరించి ప్రలంబుఁ జంపు నా
లీలల నీవు నుండ, నవలీలగ నావులు దాటిపోయి వా
హ్యాళికిఁ జొచ్చి కోమల తృణాంకుర శీలనఖాదనైక సం
శీలము లౌచు దవ్వరిగి చేరె నిషీక వనాంత సీమకున్. ౫౮-౧

గోవులు గ్రీష్మబాధ యొకకొంచెము తోపని చారుపుణ్య బృం
దావని దాటి ముంజవనమం దటు సొచ్చి నిదాఘ తాపమున్
దావక దుర్వియోగ పరితాపముఁ గూడి తపింపఁజేయ బి
ట్టావిరియుం బొగల్ మలయు నంబువులన్ బడి స్తబ్ధమై చనెన్. ౫౮-౨

అప్పుడు నీవు తోడి సఖు లారసి దూరముపోయి దారికిం
దప్పి యిషీక నామక వనమ్మున మందలు చిక్కికొన్న య
మ్మప్పు గ్రహింపఁ, దెత్తునని ముందుగ నీ వటువోయినంతనే
గప్పున రేగి నల్దెసలఁ గ్రమ్మె దవాగ్ని శిఖాకలాపముల్. ౫౮-౩

హాహాకారము పుట్టి నల్దెసల దావాగ్నిచ్ఛటా జిహ్వికా
స్వాహాకారమునన్ సగమ్ము హుత మయ్యె, దీనదీనమ్ముగన్
"పాహి శ్రీహరి పాహి పాహి త్రిజగద్బంధో"యటం చార్త బా
ధాహర్తన్ శరణంది రచ్చట నినున్ ద్వద్భక్త గోపార్భకుల్. ౫౮-౪

మీరు భయంపడన్వలదు మీకభయ మ్మిదె కంట్లుమూసికొం
డీరహి నన్న నీపలు కటే యొనరించిరి; యింక నేది యా
ఘోర దవాగ్ని ? యెక్కడిది కొండొక ముంజవనమ్ము ? తొంటి బాం
డీరము తోఁచె, నచ్చట నటించిరి యెప్పటివోలె నందఖున్. ౫౮౫

జయమౌఁ గాత జయమ్ము నీకగుత కృష్ణా ! యేమి నీమాయ వి
స్మయద మ్మంచు నుతించువారలను సంభావించి లేనవ్వులన్,
రయమెుప్పన్ నవపాటలాది సుమమాత్ర గ్రాహ్యానైదాఘ ని
శ్చయమౌ నవ్వని సంచరించితి వుదంచ ద్బాల కేళీరతిన్. ౫౮౬

నీదగు సేవవోలె నవనింగల పఙ్కము లింకఁ జేయుచున్
నీదుభుజమ్ము నట్లుగ ననిందిత తేజము జాలుకొల్పుచున్
నీదయ లేనివానివలె నిస్తుల తాపభరమ్ముఁ బూను గ్రీ
ష్మోదయముం గ్రమించితి వహో యమునాతటినీతటమ్మునన్. ౫౮౭

నీ మేనిన్ జిగిమించు మబ్బుగమితో నీ స్వర్ణపీతాంబర
శ్రీమించం గల మించు మేలి సిరితోఁ జెల్వొందు వర్షాగమ
మ్మామీఁదన్ భువనైక హర్షదము దానై రాగ గోవర్ధనో
ద్దామాద్రీంద్ర గుహన్ గ్రమించితివి తద్వర్షార్తవాహర్నిశల్. ౫౮౮

గుహలో నున్న నినున్ మహామహు నటన్ గోవర్ధనస్వామి య
న్వహ మర్చించెను మొల్లలన్ గడిమిపూల్ వాసించు పుష్పాంజలిన్ ;
రహిఁ గీర్తించె నతంతు స్వాంతర వనాంతః కేకి కేకారవ
స్పృహణీయమ్మగు మేఘరంజనముగా వినిపించి షడ్జశ్రుతుల్. ౫౮౯

అవలన్ శ్రీ శరదాగమమ్ము భవదీయాప్తాంతరంగమ్ము పో
లె విశుద్ధమ్మగు నంబుపూరముల హాళిన్ గ్రోల్చు, లాలించుచున్
నవముల్ కోమలముల్ తృణమ్ము లట సానందమ్ముగా మేపుచున్
బవనాధీశ్వర ! మందగాచి తటు నన్ గాపాడ రారా హరీ ! ౫౯౦

## ౫౯. వేణుగానము

నవతాపింఛ సుమైక కోమల మనంతప్రేమ సందోహన
మ్మవురా ! విశ్వవిమోహన మ్మయిన బ్రహ్మాకార సచ్చిత్సుఖ
స్తవనీయమ్మగు నీదుమూర్తి గని కాంతల్ మన్మథాక్రాంతలై
వివశత్వమ్మునఁ జెంది చొక్కిరట గోపీమానచోరా ! హరీ ! ౫౯౧

మఱిమఱి మన్మథోన్మథిత మానసలై వ్రజసుందరీ జన
మ్మఱిముఱి నిన్నె చూడవలె నన్న తలంపులు నంతకంతకున్
గుఱికొన, నీవు ప్రొద్దునన గోవుల గావ నరణ్య సీమలన్
దఱియుట కోర్వలేక పరితాపము చెందుచునుండి రిండ్లలోన్. ౫౯౨

నీ వెంటన్ గను లప్పగించి హరిణీనేత్రల్ మనోదృష్టి బృం
దా వీథిన్ జను నీదురూపు గనుచున్ ద్వద్వేణు గానామృత
శ్రీ విందుల్గొని దవ్వుదవ్వులనె నీ చిత్రాతిచిత్ర ప్రసం
గా విర్భూత వినోదలై మురిసి రయ్యో ముచ్చటల్ గుల్కుచున్. ౫౯౩

కానన సీమకుం జని యొకానొక చల్లని చెట్టునీడ నెం
తేని మనోహరమ్మయిన యిమ్మన వ్యత్యయ పాదముద్రపైఁ
బూనిక నిల్పి వేణువును బూరణముం బొనరించినాఁడ వ
ద్దానఁ జరాచర ప్రకృతి తన్మయమై విలసించెఁ జిత్కళన్. ౫౯-౪

అసమ శరప్రహార వశమయ్యె నశేష నిలింపభామినీ
విసరము, నిర్వికార పదవిన్ నిలిచెన్ బశు పక్షి సంఘముల్
వెస శిలలున్ గఱంగియటు వెల్లువగట్టెఁ బ్రభూ ! భవత్కృపా
రస భరిత మ్మఖండ మధురమ్మగు తన్మురళీరవ శ్రుతిన్. ౫౯-౫

కలకల వేణురంధ్రములఁ గ్రమ్మి చలించెడు నంగుళీదళ
మ్ములు లయతాళ సంగతుల ముద్దులు గుల్కెడు పాదపల్లవ
మ్ములు గల నీయొయారమును ముద్దియలందఱు నిండ్లలోననే
తలఁచి తలంచి మోహమునఁ దత్తరముంగనసాగి రయ్యెడన్. ౫౯-౬

సందియ మింతలేక దివిషద్రమణుల్ భవదీయ దివ్య మూ
ర్తిం దరిసించి నీ చరణరేఖలు దాకిన యవ్వనాంత మం
దెందును నీదువెంటఁ జరియించు మృగమ్ములు పక్షులెల్ల గో
బృందము ధన్య ధన్యము గదేయని ముచ్చటగుల్కి రాత్మలన్. ౫౯-౭

చెలువగు వేణుభుక్త రసశేషము నీ మధురాధరామృత
మ్మెలయగఁ గ్రోలు ముచ్చటది యెప్పు డొకప్పుడు నేని తీరునో
యలవికిఁగాని వట్టి యడియాసలఁ జిక్కితి మంచు సంభ్రమా
కులమతులైరి గోపికలు కొంచెముగాని మనోజ వేదనన్. ౫౯-౮

ఈవిధి నించువిల్తుఁ డెనయించు ననుగ్రహదృష్టిచేత నీ
పై వలపుల్ చిగిర్చి మురిపమ్ము లెలర్పగ రోజురోజు మో
హావిలచిత్తలై వ్రజ కులాంగనలందరు నింట నిత్య కృ
త్యావళి నిర్వహించుటదియైన నెఱుంగకపోయి రయ్యెడన్. ౯౯

అనురాగమ్ము స్వభావసిద్ధము; ప్రయత్నాధీనమై ముక్తి వ
చ్చును రాకుండనువచ్చు; గోపికల కిచ్చో రాగమోక్షమ్ములై
క్య నిరూఢిన్ లభియించె నీదుదరి; భాగ్యమ్మన్న భాగ్యమ్మిదే
యనిలాగార విహార ! యాదవకిశోరా ! నన్ను బాలింపరా ! ౧౦౦

## ౧౦. గోపికా వస్త్రాపహరణము

హా యని కన్య లెల్ల కుసుమాయుధు నోర్వక నీ పదాబ్జ దా
స్యాయతి కోరికోరి సికతాకృతి నా యమునా తటానఁ గా
త్యాయని నిల్పి కొల్చి తరళాక్షులు వేకువ జాములన్ వ్రతా
ధ్యాయమునం దదేకమతులై రి భవద్గతులై చరించుచున్. ౧౦౧

*చంచలనేత్ర లన్నిదికిఁ జాగి యుషఃప్రభ వెంబడించి రా
నించెడి నీ యశః కథ లనేకము గానము సేసికొంచు న
త్యంచిత భక్తి గౌరి కుపహారశతమ్ముల నారగింపు కా
వించిరి ; నందనందను వరించి నుతించిరి సర్వమంగళన్. ౧౦౨

---

*చారు విలోకనల్ నదికిఁ జాగి యుషఃప్రభ వెంబడింప శృం
గారము లొల్కు నీ కతలు గానముసేయుచు గౌరిఁగొల్చి యొ
య్యారము భక్తిఁ గొల్పి యుపహార శతమ్ములు నిల్పి యంబికన్
కోరిరి నందసూనుఁ దమకుం బతిసేయు మటంచు పొందికన్.

ఈవిధి నొక్కమాస మొనరించిన నోము ఫలమ్ము నీవయై
శ్రీవర యామునాంతతట సీమల నచ్చపలాక్షులన్ గృపా
ప్లావిత దృష్టిఁజేలెడు తలంపున వచ్చితి వంతలోన నీ
భావము భక్త భావరస భావితమై యనుధావమై హరీ! ౬౦౩

కన్నియ లావ్రతమ్ము తుదఁ గట్టిన చీరలు విప్పి గట్టునన్
గ్రన్ననఁ బ్రోవువెట్టి *యమునాజల ఖేలన మాచరించుచున్
మున్నిను గాంచి సిగ్గువడి మోములు వంచినవేళ చీర లీ
వన్ని హరించి పొన్నతరు వక్కొనమ్మకు నెక్కి యుంటివే. ౬౦౪

ఇచ్చటి కేరు వచ్చి కొనుఁ; డెవ్వరి దెయ్యెయి చీర యెంచికొం
డిచ్చెదఁ జారులోచన లివే యనుచున్ దరహాస వైభవ
మ్మచ్చు పడంగ నీవు పరిహాసము సేయగఁ, గన్య లెల్ల నీ
మెచ్చుల నిచ్చకంపు మెరమెచ్చుల మోహము నొంది రచ్యుతా! ౬౦౫

ఓయి! చిరాయువై మనగదోయి! కిశోర! త్వదీయ దాసులన్
న్యాయమె తమ్ముఁదాము మఱపందగ మోసముసేసి యిట్లు గాఁ
జేయుదె యంబుజాక్ష! దయసేసి వడిన్ దయసేయు చీరలా
రా! యని వేడ నిచ్చితి స్మితాంశుక మెంతటి జాణవో హరీ! ౬౦౬

వారిఁదొలంగి గట్టునకు వచ్చి కరమ్ములు దోయిలించి య
వ్వారిజనేత్ర లీవగతి వారికిఁ గావునఁ వల్వ లిమ్మనన్;
వారు పవిత్ర లౌటగని వస్త్రములెల్ల యనుగ్రహించి శృం
గారరసోచితమ్ము నొక మాట యనుగ్రహ మిచ్చినా వటన్. ౬౦౭

---

*యమునాసలిలమ్ముల నోలలాడుచున్.

మీవల పే నెఱుంగుదును. మీ రుచితోత్తర మీవలంతు, లీ
తావులు యామునాంత సికతాస్థలు, లిందలి రేలు చంద్రికా
ప్లావములన్నఁ దేనియలు వంచెడు నీ వదనారవింద శో
భావధిఁ గాంచికాంచి చని రంగన లిండ్లకు మెల్లమెల్లనన్. ౬౦౮

ఈవిధిఁ గింకరీజనము నేలుచు నెల్లర, వల్లవీమణి
శ్రీవలయాగ్ర నాయకరుచిన్ గరుణా శిశురుండవైతి బృం
దావన రత్నభూషణ మనంగ మరుత్పురసౌధ వీథికా
ప్లావిత పావనామృత కళా! పరితాపము దీర్పరా! హరీ! ౬౦౯

## ౬౧. మునిపత్నీ మహానుగ్రహము

బృందారణ్యముదాటి గోపశిశు గో బృందమ్ముతో దూరమం
దందందున్ విహరించుచున్ హృదయమం దాత్మీయ భక్తప్రజా
సందోహమ్మగు విప్రపత్నులకు సాక్షాద్భక్తియో గైక సి
ద్ధిం దర్శింపగఁజేయు కౌతుకము నుద్దీపింప నంతంతటన్. ౬౧౦

నిలువన్ నీడయుఁ గానరాని యడవిన్ దృష్ణాకులమ్మై క్షుధా
విలమై యున్న కిశోరగోపకుల మున్వీక్షించి యొక్కింత దా
పుల యజ్ఞ మ్మొనరించుచున్న ద్విజులన్ పొం డన్న మర్థించి మీ
రలు వేవేగమ తెచ్చికొండని దయార్ద్రస్వాంతుఁడై పంపగన్. ౬౧౧

చని నీ పేరటు సెప్పి యన్నమడుగన్ సర్వేశ ! యా ఛాందసుల్
మును సర్వమ్మును గాంచి కాననియటుల్ శ్రుత్యర్థ సంపన్నులై
వినియున్ సర్వము గొంచెమే విననటుల్ విప్రోత్తముల్ కద్దు లే
దని ప్రత్యుత్తర మీయరై రదికదా యాశ్చర్య మిప్పట్టునన్. ఉ౧౨

అట్టు లనాదరాన గురియై పసికుఱ్ఱలు చిన్నఁబోయి నీ
పట్టున కేగుదెంచి! రది భావ్యము; యజ్వల యందునెల్లఁ గ
న్పట్టు నభక్తభావ మొకనాటిదకాదు యథార్థ మిట్లు చూ
పట్టగ నెట్లు సేయుదురు భక్త సమర్చన నీవు కోరినన్. ఉ౧౩

నన్నెఱిఁగింపుఁ డా ద్విజజనమ్ముల భార్యల కట్టులైన వా
రన్నము మీకుఁ బెట్టఁగల రందఱుఁ జాలి కరంగిపోయి నా
నన్నువ నవ్వచే మధురమౌ భవదుక్తి గ్రహించి చిన్నిగో
పన్నలు వెండియున్ జని ద్విజాంగనలన్ మఱి వేడిరన్నముల్. ఉ౧౪

ఇమ్మెయి నిన్ను బేర్కొనినదే తడవై త్వరనెంది సోమిదే
వమ్మలు జడ్డనన్ బహువిధాన్నములన్ గొని బంధుజాల మ
డ్డమ్ముగ వచ్చినన్ విద్రిచి డాయగ వచ్చిరి నిన్ను జాల కా
లమ్ముగఁ జూచువేడ్క సఫలమ్మగు టిప్పటికంచు నుబ్బుచున్. ఉ౧౫

శిరమునఁ దూగు పించియము చెక్కిళులన్ మణి కుండల ద్యుతి
స్ఫురణము కన్గొలంకులను బూర్ణ దయారస పూర మొప్పగా
కరకమలమ్ము నొక్క చెలికాని భుజాగ్రమునందుఁ జాచి యం
దొరగి యొయార మొప్ప నిలుచుండిన నిన్ గని రంబుజేక్షణల్. ఉ౧౬

నీ దరి కేగుదెంచు నొక నీరజలోచన నడ్డగించి పో
రాదని చేయి పట్టుకొని ప్రాణ విభుం డొక యజ్వ నిల్ప, ని
న్నే దరిసించి ధ్యానమున నింతి కృతార్థత నెంది కేవల
త్వోదితమైన ముక్తిపద మొందెఁ దటాలున బంధముక్తయై. ౬౧౩

వారలు పెట్టు భోజ్యము లవారిగ నీవట నారగించి య
వ్వారి ననుగ్రహించితివి త్వత్తను సంగతి కోరి వారు సం
సారము లిండ్లు వాకిళులు సర్వము వీడగ ; యజ్ఞపూర్తి క
వ్వారల నంపి తాసతుల భర్తలు తప్పన కాదరింపగన్. ౬౧౪

తమయెడఁ దప్పిద మ్మరసి ధన్యలు భార్యలటంచు భక్తిచం
దము గని సద్విమర్శనమునన్ గల తత్త్వ మెఱింగి బ్రాహ్మణో
త్తము లగు యజ్వ లందరు సదా వినుతించిరి నిన్ మదార్తి స
ర్వమును హరింపవోయి గురువాయు పురీవరమందిరా ! హరీ ! ౬౧౫

## ౬౨. *ఇంద్రయాగ భంగము*

ఒకతఱి గోపకుల్ మఘవు నూహఁదలంచి యజింప యజ్ఞసా
ధకములఁ గూర్ప, వాసవు మద మ్మణఁగింపగ నీవువోయి యా
సకల మెఱింగి తా నెఱుక సాలనటుల్ "దమచేయు యజ్ఞ మే
మొకొ"యని ప్రశ్న సేసితి మృదూక్తుల నందముఖాప్త బంధులన్. ౬౨౦

ఇది యయ్యింద్రుని దృష్టిసేయు మఖమౌ నేఁటేట వర్షించి యు
ల్లదె యాతండు సుఖింపఁజేయు నిల, వర్షాయత్తముల్ మానవా
భ్యుదయమ్ముల్, పశుబృందముల్ తృణజలమ్ముల్ గ్రోలి జీవింప, మా
బ్రదుకెల్లన్ మఱియున్ దదేకరసనిర్వాహ్యమ్ముగున్ నాయనా ! ౭౨౧

అనఁగా నాపలుకాలకించి సరస మ్మామీఁద నీవంటి వే
మన నింద్రుండటె వాన యిచ్చునటె వహ్వా ! యేటి సత్యమ్మ ? చా
లు, నదృష్టమ్మది సృష్టికిం దగినయట్లున్ వృష్టి గల్పించు నెం
దు; నరణ్యమ్మనఁ జెట్టు లేమి బలి యింద్రున్ గూర్చి యీనేర్చెదిక్.

నచ్చిన సత్యమౌ కులధనమ్మ లహో ! మన కిందు మంద, లీ
వచ్చును గొండరాజునకు వాని సుఖానకుఁ బూజ; దేవతా
భ్యర్చయులౌదు రీధరణిఁ బొల్చెడు నియ్యలవేల్పు లందుచే
నిచ్చటఁ బూజలిచ్చుటది యెంతయు ముచ్చట యంటి వాప్తులన్. ౭౨౩

మదిఁగొని నీదుమాట మతిమంతులెపో యట నాలకాపరుల్
గొదుకక పారులన్ గొలిచి కొండకుఁ గొప్ప బలిక్ ఘటించి యొ
ప్పిదముగఁ జుట్టునుం దిఱిగి వెట్టిరి గుట్టకు మ్రొక్కులెల్ల, నీ
వచె గిరిరూపమై యెదుటనై బలియెల్ల భుజించినావటన్. ౭౨౪

అటుపై గట్టిగఁ బల్కినాపు వితథమ్మైపోయెనే నాదు ప
ల్కులటు లీ కొండ స్వయమ్ముగాఁగొనె బలిక్ హీహీ ! యనన్ వారు నిం
తటి గోత్రుండిఁక గోత్రవిద్విషుఁడు పంతమ్మెత్తి దానెత్తి యి
చ్చుటకుక్ వచ్చినఁ బ్రోచు నీతఁడని స్వాస్థ్యమ్మొంది రానందమున్. ౭౨౫

పరమప్రీతిని నిన్నుగూడి చనిరప్పా ! వార; లల్లంతలో
విరసమ్మై నిజ యజ్ఞభంగ మదియుఁ, విన్నంత కన్నంత నీ
సరకెల్లన్ దనుదా నెఱింగియు రజశ్ఛాయా సమాక్రాంత దు
ర్భర హృద్భారుఁడు సైపఁ డింద్రుఁడు భవత్ప్రాప్తోన్నతిఁ బొల్చియున్.

మనుజుండై మధుహంతయే యగును బో ! మా మీఁదనే యెత్తి యి
ట్లనయమ్మున్ వినయేతరమ్ము గొనెనే నస్మత్స్వభా ప్రాభవ
మ్మున కింకేటి ప్రతిష్ఠ మంటగలిసెన్ బో; గొల్ల యైశ్వర్య మిం
తననే కూల్తు నటంచు నింద్రుఁ డెగిసెన్ దర్పించి ని గ్గెల్వగఁ. ౬౩

వడి నీ నిల్చిన కొండఁ గూల్పఁ బ్రళయాభ్రశ్రేణి నభ్రమ్మునన్
నడిపింపన్ గొని వజ్రముం గొని వియన్నాగేంద్ర యానమ్మునన్
నడిచెన్, లోనన నవ్వుకో దహనుఁడున్ వాయ్వాది దిక్పాలు ; రె
క్కడ నెవ్వాఁ డిటు మోసపోఁడు త్రిజగత్కాంతా ! భవన్మాయకున్. ౬౪

ఇటు వజ్రాయుధుఁ డెత్తి క్రుద్ధుఁ డగునే నింకే మనాతజ్కా మిం
కిట మాకున్, ద్విజకోటి సత్కరుణ మాకీకొండ వాత్సల్య ముం
డుట సాలున్, గిరిభేది యింతకును రాఁడున్ పోఁ డిదేమంచు నీ
వటు లున్నావు మరుత్పురేశ ! మురహంతా ! వంతలన్ బాపుమా ! ౬౫

## ౬౩. గోవరనోద్ధరణము

ఆక్షణ మక్షత స్తనితమై పరిజృంభిత కంపితాఖిలా
శాక్షితియై వ్రజస్థలిని జక్కన సూటిగఁ గాఱుగ్రమ్మెఁ దా
నీక్షణ గోచర మ్మగుచు నెల్లెడ బమ్మి వియత్పథానఁ బ్ర
త్యక్షమునయ్యె మేఘనివహమ్మట నిల్చిన నీకు ముందటన్. ౬౩౦

పడగలి రాళ్ళకున్ సుడిసి పైఁబడు నేనుఁగు తొండమంతలై
జడిగొను వర్షధారలను జాగి యిలన్ నలుమూలలందునున్
బడి కుపితాత్ముఁ డింద్రుఁ డిదె బాధలఁ బెట్టెడు "పాహి పాహి" యం
చడలగ గోపమండలి, భయంపడవ ద్దనినాఁడ వండయై. ౬౩౧

"కుల మిది గోత్ర దైవతము, గోత్రరిపుం డొనరించువాని ని
వ్వలనునఁ బాపునట్టి పని వానిది, మీ కనుమాన మేల" యం
చెలమి నొకింత నవ్వి వచియించుచునే యటు చిట్టి చేతులన్
గొలిపియు మట్టుతోఁ గదిపి గొబ్బున నెత్తితి వగ్గిరీంద్రమున్. ౬౩౨

అటుపై నా గిరిక్రింద వాన చినుకింతైనం బడన్ రాక యం
తట నమ్మెత్తని సైకత స్థలిని నానా సాధన శ్రేణితో
నట గో గోప కిశోరుల న్నిలిపి నీ హస్తాంబుజాగ్రమ్ము నం
దిటు గోవర్ధన మొక్క చిన్ని గొడు గట్టై పట్టినా వద్దిరా! ౬౩౩

నగ మిట్లీవు ధరించియుండ గిరిక్రిందన్ బాలికల్ నెచ్చెలుల్
సొగసు ల్గుల్కుచు ముచ్చటాడుకొనుచున్ జొక్కంగ నీ చెంతనే
తగ వర్తించెడు నాల మేను లోకచేతన్ గోకుచుండంగ విం
తగు నీ యంద మొయారమున్ గని యమందానందులై రందఱున్. ౬౩౪

ఎంతో దొడ్డది కొండ వామకరమం దిట్టే ధరించెంగదా
ఎంతేఁ గాలము చిత్రచిత్రముగదా యీ చేఁత, యద్రీంద్ర తు
ల్యాంత స్సారుఁడు వింత బాలుఁ డగు నౌనౌ నంచు నిన్ జూచి య
త్యంతాశ్చర్యముతోడఁ జెప్పికొని రాయా లీలలన్ గొల్లలున్. ౬౩౫

అహహా ! వటుండు గంద్రయగు నద్దిర ! వీనికిఁ జేయినొచ్చెనా
యిహిహి ! గిరీంద్రమున్ వదల కేమగు నంచును వెక్కిరించి వృ
త్రహుఁ డటు లేడురోజు లొక ధారగ నూరక రాళ్ళవాన యి
మ్మహిఁ గురిపించె నీ భువన మండల మెల్ల వణంకి పోవగన్. ౬౩౬

అడుగు గదల్ప కీ వచట నట్టె నిలంబడ, మేఘపఙ్క్తి నీ
రొడుచుక పింజపింజలయి యొయ్యన గాలికిఁ దూలిపోవ, నె
క్కుడఁ గనుగొందువో యనుచు గాటపుశంక మరుత్ప్రభుండు దా
పడుచును లేచుచున్ వడిగఁ బారె మరుత్పథ వీథులన్ హరీ ! ౬౩౭

పెనువాన వెలిసి వెలికిన్
జన గోవులు గోపకులము, చయ్యన శైల
మ్మును దించి వచ్చి కౌఁగిట
నినిచితి హర్షమునఁ బొదలు నీవారి నటన్. ౬౩౮

ధరణి సమస్తము నెత్తెడు
బిరుదున కీధరణీధరము పెద్దదె యిదియున్
భరమదె యని సుర లెన్నిరి
గురువాయుపురేశ ! యేలుకొనరా ! నన్నున్. ౬౩

## ౬౪. గోవింద పట్టాభిషేకము

గోపకులమ్ము కొండయటు గొబ్బున మీటుట మున్నుగాగ ను
ద్దీపితమైన నీమహిమ తెల్లముగాఁ గని విశ్వభర్త గా
నోపు నటన్న నిశ్చయము నొంది కుమారుని జాతకమ్ము నే
రూపమొ యంచు నందుని నిరూపణ సేయగ వేడి రయ్యెడన్. ౬౪.౦

నందుఁడు సెప్పి రివ్విధమునన్ మును గర్గమునీంద్రు లంచు న
య్యందర కాప్తవర్గమున కానతియిచ్చెను నీప్రభావ; మే
మందును వారికిన్ వలపు లగ్గలమయ్యెను నీదుపైన ము
న్నందటి కంటె నీయెడన ముద్దులు ముచ్చట లెచ్చె నీశ్వరా ! ౬౪౧

అవమానమ్మునఁ దత్త్వ విస్ఫురణమై యా దేవలోకేశ్వరుం
డవనిన్ వ్రాలి తనంత దేవగవి తోడై వచ్చి నీసన్నిధిన్
స్తవముం జేసెను ద్వత్పదాబ్జ వినతోద్యన్మౌళి రత్నచ్ఛటా
ప్లవన క్షాళిత హృద్గుహాగహన గర్వస్ఫూర్తియై యల్లనన్. ౬౪౨

గోవిందుం డవు డైతి, వందు దివిషద్గోమాత పాల్చేపి నీ
పై వాత్సల్యము సూపి చేసెఁ ద్రిజగత్పట్టాభిషేకమ్ము హ
ర్షావేగమ్మున *నన్నిలింపపతి యయ్యైరావతానీత గం
గా వాఃపూరములం జొనర్చె నభిషేక శ్రీవిధిఁ నీకటఁ. ౬౪౩

లోకమ్ముల్ మఱి మూఁడు సేలు దొర వాలో గోకులమ్మేల నా
సేకమ్మొందగ గోపవాటము వహించెఁ నీ ప్రభావాన నా
నాకమ్మందునఁ గాని యంతకవలన్ వైకుంఠ మందేని యా
లోకింపఁ వల నింతలేని సిరులన్ లోకైక రక్షామణీ! ౬౪౪

నందుం డొక్క ప్రభాతవేళ యమునా స్నానమ్ము గావించుచు
న్నం దోడంగొనిపోయె నవ్వరుణు చెంతఁ నిల్చు భృత్యుండు; లో
నాందోళించి నినుఁ భజించి వరుణుం డర్పించె మీతండ్రీ, నీ
వుం దోడ్తెచ్చితి, వీకథన్ దెలిపె నాపుణ్యుండు నీవారికిఁ. ౬౪౫

హరివీవంచును నిశ్చయించి భవదీయమ్మైన ధామమ్ము స
త్వరమే చూతుమటంచు నాశపడు నీవారిం గటాక్షించి నీ
పరమ మ్మన్యదురాపమైన పదముఁ భద్రాతిభద్రమ్ము సుం
దరపౌనంతకు సుందర మ్మదియు నంతఁ జూపినా వీశ్వరా! ౬౪౬

పరమానంద రసప్రవాహ నివహ వ్యాపూర్ణ కైవల్య సా
గరమం దూరక పెక్కుకాల మిటు మున్కల్వెట్టు నయ్యాలకా
పరితండమ్ముల నుద్ధరించి తటు లాపై నీకు నీవై యహో!
పరిపూర్ణాత్ముఁడ వీవు కృష్ణ! సకలబ్రహ్మ స్వరూపా! హరీ! ౬౪౭

---

*..........నన్నిలింపపతి య య్యైరావతావర్జిత
శ్రీవైహాయస గాంగపూరముల నాసేకించెఁ దానున్ నినున్.

ఏ యవతారమందు మును పెవ్వరి కందని నీ పదమ్ము నా
హా! యిటు భక్తులన్ గరతలామలకం బొనరించినాఁడ వ
య్యా! యటుగాన నీవు పశుపాకృతి నున్న పరాత్ముఁడౌదువౌఁ
రా! యదువంశ భూషణ! దయం గనరా! గురువాయుమందిరా! ౬౪౮

## ౬౫. రాసక్రీడ, గోపికల బృందావనాగమనము

వ్రతపూర్తిన్ మును గోపికామణులకుఁ బాగ్దానముఁ జేసి య
చ్యుత! కందర్ప మహోత్సవ, మ్మదియు నిచ్చో నింక చెల్లింప నూ
దితి నీ వేణువు యామునాంతవని నెంతే సాంద్రచంద్రాతపో
ద్గతి నయ్యెల్ల దిగంతముల్ శిశిరతాక్రాంతమ్ములై రంజిలన్. ౬౪౯

మురువొప్పన్ భువనాంతరాళముల సమ్మూర్ఛింపఁగాఁ జేయు సు
స్వర సంతానిత తాన మూర్ఛనముగాఁ ద్వద్వేణునాదమ్ము సుం
దరు లందందున వీనులన్ నినిచి తత్తాదృఙ్మనోమోహ మొం
ది రనిర్వాచ్యము స్వానుభావము రసార్ద్రీభూత ధీగమ్యమున్. ౬౫౦

వారింటఁ బనిసేయుచుఁ సుతులకుఁ బాలిచ్చుచుఁ భర్తృసే
వార్తిఁ జరియించుచుఁ సకలముఁ వర్జించి నీవేణునా
దారంభమ్మున ముగ్ధలై నిలిచి రాహా! యేగి నీవున్న కాం
తారానన్ గమలా మనఃకమల కాంతా! లోకకాంతాకృతీ! ౬౫౧

మురళీనాదము విన్నయాక్షణమునన్ ముగ్ధాంగనల్ గొంద రా
భరణమ్ముల్ గయిసేయుచున్ సగములో పర్వెత్తి నీ వెంటనం
టిరి సర్వాంగ సమగ్రభూషితల కంటెన్ వారె యర్ధాంగరా
గరుచిన్ మించి రుచించి రద్భుతముగాఁగంజాక్ష! నీచూడ్కికిన్. ఉ॥౨

హారమొక్క నితంబినీమణి నితంబాగ్రమ్మునన్ దాల్చి, కం
గారై కంఠమునన్ ధరించి మఱియున్ గాంచీ కలాపమ్ము, నిన్
జేరన్ వచ్చె ముకుంద! స్వీయజఘన శ్రీహారి యానంచు నీ
కారీతిన్ విశదమ్మొనర్చుటకునో యన్నట్టు లభ్రమ్ముగన్. ఉ॥౩

ఏతెంచెన్ గుచసీమఁ గంచుకములే కింకొక్క వామాక్షి త
న్నే తన్వంగియుఁ జూడకుండ నట నిన్నీక్షించు వేగమ్మునన్
బ్రాఁతిన్ నిస్తుల నిర్భర ప్రణయ సామ్రాజ్యాభిషేకార్థ మే
మో తానొక్క సువర్ణ పూర్ణకలశమ్మం బూని యేతెంచెనాన్. ఉ॥౪

లేమల్ గొందఱు గేహముల్ విడిచి రాలేకాత్మలన్ గట్టిగా
నీమూర్తిన్ దలపోసి పాసి తనువున్ నీసచ్చిదానంద కే
ళీమూర్తిన్ పర మేక మద్వయమునన్ లీనాత్మలై రౌర! యా
భామల్ మాధవ! ధన్యధన్యలుగదే భక్తానుకంపానిధీ! ఉ॥౫

పరమాత్ముండని కాక జారుఁడనుచున్ భావించియున్ గోప సుం
దరు లప్పారమహంస్యమైన గతి నందంగల్గినా; రట్టి నిన్
బరమజ్యోతిని బ్రహ్మవస్తువు మదిన్ ధ్యానించి యానంద సా
గరగర్భమ్మయినట్టి యా యమృతమున్ గైకొందు మేమున్హరీ! ఉ॥౬

మృదుహాసార్ద్ర విముగ్ధ సుందర ముఖశ్రీతోఁ గృపాలోక సం
పదతో నె ట్టెదుటన్ నటించు నిను లావణ్యాంబుధిం గాంచి ర
య్యదనన్ నీదరిఁ జేరి చుట్టుకొని యయ్యబ్జేక్షణల్ విశ్వ స
ద్ధృదయగ్రాహి ! సమీరగేహి ! కరుణాబ్ధీ! పాహి ! పాహి ! ప్రభో !

## ౬౬. రాసక్రీడ - ధర్మోపదేశము

వచ్చిరి విరితూపులఁ గడు
నొచ్చిరి తీర్చెదన మఱి మనోరథమని నీ
వచ్చపలాక్షులతోఁ బల్
ముచ్చటలకుఁ జొచ్చి తొర మును వామోక్తిన్. ౬౫౮

మునులు విన గగనమున కుల
వనితల ధర్మమ్ము లెల్ల వాక్రుచ్చితి నీ
వనినది ధర్మ్యము, నీ చే
సినది యవిశ్వాస్య మమల ! చిన్మయరూపా ! ౬౫౯

విరసములగు నీ మాటల
హరిణీలోచనలు దీనలయి కడుఁ, గరుణా
శరధీ ! మము విడువకు మని
పరిపరి విధములను దుఃఖపడఁ జొచ్చి రటన్. ౬౬౦

చెలుల విలాపాలాప
మ్ముల జాలిన్ మనసు కరఁగి పూనితి యమునా
పులినములన్ స్మరకేళీ
కలనములన్ గోపకన్యకా కులములతో. ౬౬౧

ఇందుకరస్యందమ్ముల
విందయి యమునాతటాంత వీథుల గోపీ
సుందరుల పైట చెఱఁగుల
నందము లగు సంస్తరముల నాసీనుఁడవై. ౬౬౨

ముద్దు గులుకు హాస్యమ్ముల
ముద్దుల బిగి కౌఁగిలింపు ముచ్చటలన్ బల్
సుద్దులఁ జేసే కొని య
మ్మొద్దియలన్ వగల మిగుల మురిపించి తటన్. ౬౬౩

వలువలు హరించి నప్పుడు
వలువలు హరియింతు ననిన వాగ్దాన మ్మి
వ్వలనన్ రసవివశ స్వాం
తల కింతుల కప్పగించి తనియించి తహో! ౬౬౪

నునుజెమట లొలయ మొల్లల
కెనయగు లేనగవుఁ జిల్కరించు ముఖాబ్జ
మ్మునఁద్రిజగన్మోహనుఁ డగు
నిను గౌఁగిటఁ జేర్చి ముదము నించిరి పడఁతుల్. ౬౬౫

అంగారమయుఁడ వెడసిన
శృంగారమయుండ వెనసి చిత్రము ''సంగే
ష్వంగా రమయ స్తత్ర'' య
నంగా నంగనలఁ గూడి నర్తించి తటన్. ౬౬౬

రాధా తుంగ పయోధర
సాధు పరీరంభ పరమ సౌఖ్యాదరు నా
రాధింతు నిన్ను వాయుపు
రాధీశ్వర ! సకలరుజల హరియింపు హరీ ! ౬౬౭

## ౬౭. భగవత్తిరోధానము, అన్వేషణము

పరమానంద రసాత్మకుండవగు నీ వాల్లభ్యముం జెంది నీ
కరుణన్ భోగవిలాసముల్ మరగి యక్కన్యల్ మహానంద వి
స్తరలై చెంది రఁ టింత యింతయని యెంచన్రాని సౌభాగ్య ని
ర్భర గర్వాతిశయమ్ము భక్తజనహృత్పంకేరుహేందిందిరా ! ౬౬౮

వలచెన్ విశ్వమనోభిరాముఁడు రమాప్రాణేశుఁ డేవేళ నా
వలలోఁ జిక్కె నమాయికుండతఁడు నావైపంచు నొక్కొక్కరే
తలపం జొచ్చిరి స్వాభిమానముల కాంతల్, చూచి యవ్వారిచూ
డ్కుల కీవందక కొంత చాటయితివో గోవింద ! యప్పట్టునన్. ౬౬౯

మనసున కించి గర్వమనుమాట యెఱుంగని రాధ గూడి వే
చని చని దూరదూరముగ స్వైరవిహార మొనర్చినాఁడ వ
వ్వనివని నిన్నునే వెదకి పారము లేని వియోగ వేదనన్
గనిరట గోప కన్యకలు కంజదళాయతలోచనల్ హరీ ! ౬౭౦

కాంచితె చూత ! చంపకమ ! కంటివె మాహృదయమ్ముదొంగ నొ
క్కించుక కర్ణికార మెఱిఁగింపవె ! మల్లిక చూడలేదటే
కాంచనచేలు, మాలతిరో! కాంచితె మీరలు బాలవల్లు లొ
క్కించుక దెల్పుడంచు పలవించిరి ముగ్ధలు త్వద్గతాత్మలై. ౬౭౧

అడుగో గోచరమయ్యె దొంగ అడుగో అబ్జాక్షి ! నాముందటే
యిడుగో యంచును భావనానయనమం దీక్షించి నిన్నాకులం
పడుచున్ గోపి యొకర్తు నెచ్చెలులకున్ బద్మాక్ష ! నిన్గూర్చి యి
న్మడిగా దుఃఖము వెంచె శూన్యమున నిన్ లక్షించినట్లై హరీ ! ౬౭౨

అటు త్వద్ధ్యాన సమాధియోగమునఁ దాదాత్మ్యమ్ము సిద్ధింప నిం
కటుపైనన్ యమునాతటమ్మునఁ ద్వదీయాకార వేష క్రియా
నటనమ్ముం బొనరించుచున్ వెదకుచున్ దర్శించి రల్లంతలోఁ
బటు గర్వంపడి నిన్ను బాసి యట విభ్రాంతాత్మయౌ రాధికన్. ౬౭౩

ఆతఱిఁ జీఁకటుల్ వడెడు నంతకు నవ్వని యంత గోప క
న్యాతతి నీకునై వెదకి యంతట నయ్యమునా తటాంత సం
కేత పదానఁ గూడికొని కిన్నెర మ్రోసిన యట్టు లేడ్చి సం
గీతము మేళవించిరి మృగీనయనల్ బహురాగ భంగిమన్. ౬౭౪

ఆవిధిఁ గాసిచెంది విరహాకులలైన వ్రజాంగనాతతిన్
గావఁ గృపారసాబ్ధివి జగత్త్రయ మోహన మోహనుండవై
యీ వెలనవ్వులన్ జిలుకరించుచు నించిన వేడ్క గోప క
న్యావళికెల్ల నెట్టయెదురై నటియించితి వా క్షణమ్మునన్. ౬౨౫

కాంతుని దర్శన మ్మగునొ కాదొ యటంచనుకొంచు సంశయా
క్రాంత మనస్కలైన వ్రజకాంతలు గాంచి నినున్ దటాలునన్
సంతసమంది మిక్కిలిగ సల్పని యందము చంద మేమి శ్రీ
కాంత ! మరుత్పురేశ ! దయ గన్గొని నా పరితాప మార్పవే ! ౬౨౬

## ౬౮. *గోపీ సాంత్వనము*

కమలలోచనల్ గాంచి నిన్నటన్
ప్రమద సంభ్రమల్ పఙ్కజేక్షణా !
అమృతధారఁ దోఁగాడినట్టులై
స్తిమిత భావముం జెంది రచ్యుతా ! ౬౨౭

వనిత నీ కరాబ్జ మ్మొకర్తు సి
గ్గనక పూని మోహైకత ప్తయై
ఘన పయోధరాగ్రాన నుంచి నిన్
మొనసి నిల్చె మై పుల్కరింపగన్. ౬౨౮

ఉవిద కోమల మ్మూని నీ భుజ
మ్మవుర ! కంఠమం దట్టె చుట్టి తా
వివశయయ్యెఁ బల్ వేడ్క ప్రాణమన్
పవన మాపి లోఁబట్టి నట్లుగన్. ౬౭౯

బిడియ మెల్లఁ బోవీడి బాల య
ప్పుడు త్వదాస్య తాంబూల చర్విత
మ్మొడిసి శ్రీ ముఖాబ్జోల్లసద్రుచుల్
పొడమ రంజిలెన్ బూర్ణకామయై. ౬౮౦

కరుణవాసి నన్ గానఁ బాసితే
తరుణి యింక నిన్ దాకునంచునన్
సరసిజాక్షి రోషానఁ గంట నీ
ర్దొరుగఁ జూచె నిన్ దోయజేక్షణ ! ౬౮౧

అనుపమ ప్రమోదాప్త వల్లవీ
జనముతో నదీ సైకతమ్ములన్
ఘనకుచాంబరా కల్పితాసన
మ్మునను కుంకుమా మోదముద్రపై
మొనసి నిల్చితో ముగ్ధ మోహనా ! ౬౮౨

కరుణ తీర్లనేకమ్ము; లెందుఁ గొం
దరు దయాపరుల్; స్వాప్తులందుఁ; గొం
దరు మహామహుల్ తద్గతాత్మలం
దరయ నిట్టులం చాడి రంగనల్. ౬౮౩

తరుణులార! నిస్తంద్రరాగ వి
స్ఫురణు వేరుగాఁ జూడకుండు నన్
బర నిష్ఠ నాపై ఘటింప ని
ట్లురసి చేసినా నంటి వయ్యెడన్. ౬౮౪

అయి! వినుండు పుణ్యాంగనల్ మత్తే
మయిన వల్లభ మ్మొనె మీ వలెన్
భయము లే దిటన్ రమ్యయామినీ
చయమునందు నిష్ఠన్ రమింపుఁడీ. ౬౮౫

అన నమంద హర్షాప్తి గోపికా
జనము తోడరాఁ జారు రాస ఖే
లన మహోత్సవో ల్లాసివైతి పా
వన పురాగ్ర సంవాస! ప్రోవరా! ౬౮౬

## ౬౯. రాసక్రీడ

వేనలిన్ నెమలిపింఛియమ్మెగుర, వీనులన్ మకర కుండల
శ్రీనటింప సరసీజహారమణి రేఖికా ద్యుతులు గుల్క నిం
పౌ ననంగ లలితాంగరాగ సకలాంగ సౌరభ సమగ్రముం
గా నటత్కనక కాంచికాంచిత వికంపి పీత వసనమ్ము న
మ్లాన కాంతి మణిమంజు నూపుర విలాస మెంతుఁ గమలాలయా
ప్రాణ వల్లభము రాసకేళి మధురమ్ము నీదగు స్వరూపమున్. ౬౯౧

మండితోరుపరిమండలానఁ గుచమండలాకలిత కంచుళీ
గండలోల మణి క్రమకుండలిని గామినీ కలిత మండలిన్
దండి నొక్కొ,క్కతె దండ నొక్కఁ డయి దాను మా రమణ ! నిండి రే
యెండగాయఁ జరియించి నీవు నటియించి నా వచట రాసముల్. ౬౮౮

వాసుదేవ ! యిటు భాసమాన రసవద్విలాస గుణసౌరభ
మ్మాసనేసి కుతుకాకుల మ్మగుచు నన్నిలింప మునిమాట ను
ల్లాసభూషణ విలాస పేశల విలాసినీ శతసమావృత
మ్మై సురాళి యొకటై వియత్పథరథాళి గ్రమ్మకొనె నంతటన్. ౬౮౯

పిల్లగ్రోవి వినిపించు తాన సమవేతగాన కలరాగ లీ
లోల్లసద్గతుల నుచ్చలత్పదపయోజ తాళలయ భంగిమన్
ఘల్లనంగ మణి కంకణాళి కరకంజ మానుకొని మూపులం
దల్ల శ్రోణి చలదంబరల్ నెఱపిరంగనల్ ఝణఝణంఝణల్. ౬౯౦

తారతార విధృత స్వరానుకృతి ధన్య గానరసలీలలో
హారి రత్నమయ హారభార లులితాంగరాగ మణిభూషణా
పూరమై సురలు పూలవానలను ముంచి పొంచి తిలకించి మ
ఘ్హారె ! మూర్ఛిలిరి సచ్చిదాత్మకత సాగు నీ యెడల లీనమై. ౬౯౧

తీవబోణి మెయి తీగఁ గ్రొంజెమట తేలి తూలి శ్రమసోలికన్
గ్రేవ మూఁతవడ నిల్చె నీ భుజము కేల నానుకొని ; యొ_ర్తు కె
మ్మోవి ముద్దుగొని పుల్కరించె నిను మోసగించి చలితాలక
శ్రీ విలాసమై చేరి నీ భుజము శ్రీ పటీరరస నిస్స్రుతిన్. ౬౯౨

కాంత నీ హసితగండమాని నిజగండ మాచలిత కుండల
మ్మంత నానె సుకృతైకసేవధి త్వదాస్య పూగరస చర్వితం
మ్మంతు లిట్లు గని రెంతో యున్మదము చొక్కి పొంది నిను నిందిరా
క్రాంత విహృతి విశ్రాంతి మందిరుని రాసకేళి బహు సుందరున్. ఉ౯ ౩

ఆగెగాన, మటనాగె వాద్యము క్రమాప్తి బ్రహ్మరసతన్మయ
శ్రీగడించి మఱి నేసి రంగనలు నృత్యమాత్రము నెఱుంగఁజా
వేగమం దెడలు నీవియున్ విరియు వేణియున్ బ్రిదులు పైకయున్
ఆగిపోయె దివి నన్నివెల్లు లవురౌర ! చిత్రమిది యేమనన్. ఉ౯ ౪

మోదసీమ జగముల్ గఱంచి రసముగ్ధకేళి విరమించి, యా
మీద నొత్తిడుల మేనులన్ జెమట మించు సుందరులు మన్మథో
న్మాదలందఱికి మాన్మథోత్సవ మొనర్చి తొక్కొకరి కొక్కరూ
పై దయాసదన ! యందఱందఱ పురార్జితాభ్యుదయచోదనన్. ఉ౯ ౫

వింతకేళి మురిపించి ముచ్చటలు వించి లాలనము నించి నీ
వంత యామున వనాంతకేళుల లతాంతసౌరభ నితాంతశ
య్యాంతపాళుల వనాంతలీలల సుహాసినీశత విమోహన
మ్మెంతొ నేసితి వాకించుకై విసరి యించు చల్లనగు తెమ్మెరన్. ఉ౯ ౬

ఇట్టు యామినుల నెల్ల భామినుల నీవ యందముల కందమై
యట్టె యేగి హృదయైకగమ్యమగు నద్వయామృతరసాబ్ధిఁ జే
పట్టఁజేసి పశుపాలకాంగనల బ్రహ్మశంకరముఖుల్ బలే
పట్టటంచు గొలువం బొనర్చితివి హాహొ హాహో కరుణానిధీ. ఉ౯ ౭

# ౭౦. సుదర్శన శాపమోక్షము, శంఖచూడాసురనాశనము, వృషభాసుర సంహారము

రాసక్రీడను నీవు గోపికలతో రంజించుచో, గోపు లు
ల్లాసమ్మందుచు నంబికావనమునన్ లక్షించి యా శంకరా
వాస మ్మచ్చటి యుత్సవమ్ముల నిశల్ వర్తించి నీతోడ ని
ద్రాసక్తింగొన, నుగ్రనాగ మొకఁడంతన్ మ్రింగె గోపాగ్రణిన్. ౭౫౮

కొఱవులఁ జూఁడి రయ్యహిని గోపకు; లంతకు వీడకున్న, వా
రఱచిరి "పాహి పాహి" యని, యంతట నీ వరుదెంచి దాని న
త్తఱి స్పృశియించినాఁడ, వదియున్ దొలిమేను ద్యజించి నీదుముం
దఱనటియించె నద్భుతము! దాను నొకానొక దేవయోనియై. ౭౫౯

ప్రోచితహో! సుదర్శనధరుండవు నేను సుదర్శనుండ; ము
న్నేచి హసించి సన్మునుల నిట్టిదశం బడినాఁడ; నీపద
శ్రీ చిగిరించె నింత మును జేసిన పుణ్యమటంచుఁ బల్కి యా
త్మోచిత ధామ మొందె, మఱి యొందిరి గోపకు లాత్మధామమున్. ౭౬౦

హలియును నీవు గోపికలు నవ్వనిలో విహరించుచుండఁగాఁ
జెలుల హరించె నా ధనదుసేవకుఁ డొక్కఁడు శంఖచూడుఁ, డా
ఖలు వడి నాపి వెంటబడి కాంతల ముక్తలఁజేసి తచ్ఛిరః
కలితమణిం గ్రహించి మఱి కంజదళాక్ష! యొసంగి తన్నకున్. ౭౬౧

హరి ! చెలికాండ్రతోడ పవలంత వనాంతములన్ విహారసుం
దరుఁడగు ని న్నిలింపలలనా నయనామృత పారణాకృతి
స్ఫురణు మనోజ మోహనుని పూరితవేణురవామృతున్ రసా
భరణుఁ దలంచి గోపికలు పల్కని దేమి వియోగ తప్తలై ? ౨౦౨

భోజవల్లభు భృతకాధముం డొకండు
దుష్టమార్గైకదృష్టి యరిష్టమగుచు
నిలిచె ఱంకెలువేయుచు నీకునై భ
యంకరాకృతి మున్ వృషభాకృతియయి. ౨౦౩

[1]శాక్వరము జగతి ధృతిని సడలఁజేసి
బృహతి యగు మూర్తి ధరియించి యెల్ల పసుల
పఙ్క్తిఁ గలగుండు వఱచి యాపైన నిన్ను
జేరె ఛందోనిధిన్ వృత్త చిత్ర మగుచు. ౨౦౪

[2]పొడవడరు మేటి శృంగాగ్రములను బొడువఁ
బైఁబడుచు భద్రరూపుఁడై వఱలియును న
భద్రుఁడై యున్న రక్కసుం బట్టి కిట్టి
యపుడ మర్దించి సురలోక మంపినావు. ౨౦౫

1 ఇందులో శాక్వరము, జగతి, బృహతి, పఙ్క్తి యనునవి ఛందస్సుల పేర్లు. శాక్వరము = ఎద్దు.

2 భద్రరూపుఁడు = వృషభస్వరూపుఁడు, మంగళరూపుఁడనియు.

[3]చిత్ర మీనేటి వృషవినిష్పేషణమున
సుస్థిరమ్మయ్యె వృష సమావస్థితి ధర
వృషమనోహర్ష పరమ సమృద్ధి యయ్యె
ననెడి గీర్వాణ వినుతి గమ్యార్థ మైతి. ౨౦౬

పశువిభేది యిడుగొ ప్రత్యక్షమైనాఁడు
పాఱిపొండు పశువులార! యనుచు
మేలమాడు గోప బాలురతోఁ గూడి
యింటి కేగినాఁడ, వేలుకొనర! ౨౦౭

## ౨౧. కేశిమథనము

హరిని నిన్ సింధుజాప్తుగా నరసి యేమొ
తాను నొక సింధుజాశ్వమై దరిసె నిన్ను
కంసునికి నిష్ట బంధుండు క్రౌర్యరాశి
కేశి విశ్వోద్యమానవకేశి యగుచు. ౨౦౮

వాఁడు గంధర్వమూర్తియై కూడ క్రూర
హేషియై సర్వజన భయోన్మేషి యగుచు
బెరసి వ్రేపల్లెఁ గలఁచె నీ దరిసెనమ్మ
దెంతదాక లభించునో యంతదాక. ౨౦౯

---

3 వృషవినిష్పేషణము=వృషభమర్దనము.
వృషసమావస్థితి=వృషము-ధర్మము, దానియొక్క సమావస్థితి=నిలుకడ.
వృషమనోహర్ష పరమసమృద్ధి=వృష-ఇంద్రునియొక్క, మనోహర్షసమృద్ధి,
లేదా ధర్మదేవతయొక్క మానసికానందసమృద్ధి.
వృషసంహారముచే వృషముయొక్క సుస్థితి, వృషమనోహర్షము కలిగినవి కాన
యిదే చిత్రము.

తార్క్ష్యుపై పాద మూను త్వద్వక్షమందుఁ
దన్నెఁ దార్క్ష్యుండు తనదు పాదమ్ము నెత్తి
మును భృగుమహర్షి నిన్ను దన్నిన చరిత్ర
వినెనొ, యటుసేయ శక్యమౌ ననెనొ తనకు ! ౨౧౦

కదము త్రొక్కించి కికురించి కడకు విసరి ;
తదియు మూర్ఛిలి మూర్ఛిలనట్టి పగను
సగము సచ్చియుఁ జావని పొగరుతోడ
మ్రింగవలెనంచు నీ మీఁది కంగవించె. ౨౧౧

వాహము దండము కోరియు
వాహో దండమ్ము గొలుప వదనమునన్ వా
య్వాహతి సప్తి భావ
మ్మైత్రి హర్వొందియును జిత్ర మైక్యమ్మందెన్. ౨౧౨

పశువు నాలంభముననె సుపర్వ సుప్ర
సాదమౌ నశ్వమేధ మాశ్చర్య మీవు
సేయ హర్షాన గీర్వాణ నాయకులు ని
న్నుగ్గణించిరి కేశవాఖ్య న్గణించి. ౨౧౩

కంసునికి నిన్ను వసుదేవు కన్నబిడ్డ
యని యెఱింగించి యతని జంపను జనంగ
వాని వారించి మాటలో వచ్చి కేశి
ముక్తి తర్వాత సుర్షమౌని పొగడె నిన్ను. ౨౧౪

మున్ను చెలు లీవు దాఁగుడుమూఁత లాడు
సరణి నుండంగ వని వియచ్చర విరోధి
వచ్చె మయు నాత్మజుండు దుర్వార మాయుఁ
డెగసి వ్యోమాభిధుండు దుండగుఁడు వాడు. ౭౧౫

ఆట దొరలయి దొంగలై యాడు నీదు
వారిలో తోడుదొంగయై చేరి వారి
నాల దొంగిలి గుహ డాచి రాలు ద్రోచె
నెఱిఁగి యీవును వాని మర్దించినావు. ౭౧౬

ఈవిధములౌ విచిత్ర కేళీవిలాస
ముల నఖండ ప్రమోద సంమూర్ఛఁ బదప
ద క్షణక్షణ నవ్య నవ్య క్షణమ్మొ
నర్చితివి గోకులమ్మ, నన్ గావగదర! ౭౧౭

## ౭౨. అక్రూర భాగ్యము

అంతన్ గంసుఁడు నారదోక్తి విని నీ వామందలో నున్న వృ
త్తాంతమ్మున్, జలియించి స్వాంతము, ధనుర్యాగమ్మ పేర్వెట్టి ని
న్నంతన్ వెంటనె వెంటఁబెట్టుకొని రా నంపించె నక్రూరునిన్
శాంతున్ దాంతు ననంతభోగిశయనా! సద్భక్తి చిత్తాయనా! ౭౧౮

నీ దివ్యాంఘ్రిసరోజచింతనసుధా నిష్యంద సందోహ సు
స్వాదు స్వాంతుఁడె కాని తేనిభయమై త్వద్దర్శనప్రాప్తి లే
కీదాకన్, నృపు నాజ్ఞనే యిపుడు నిన్నీక్షింపగాఁగల్గి యా
హ్లాద బ్రహ్మరసప్రపూర్ణ హృదయుం డక్రూరుఁ డయ్యెన్ హరీ! ౨౧౯

అరదమ్మెక్కి యతండు నేగుచు ద్వదీయావాసమున్ బుణ్యవి
స్తరుఁడై, నీయెడ బల్ మనోరథము లాస్వాదించుచున్ ద్రోవ నీ
శ్వరుఁ బల్రీతుల మ్రొక్కుచున్ బ్రతిపదాపాయాగమాశంక, నా
సరణిన్ విశ్వము విస్మరించెను భవత్సందర్శ నోత్కంఠితుఁడై. ౨౨౦

కనుగొందున్ శ్రుతిగీతికాశతగతిన్ గైవల్యపున్మూర్తి న
ల్లన నాస్వామి స్పృశింతునో, కవుగిటన్ లాలింతునో, కన్గొనన్
గనునో యేమని పల్కరించునొ యెటన్ గన్పించునో నేను జే
సిన పుణ్యమ్మెటు లున్నదోయనుచుఁ జూచెన్ సర్వమున్ నీవుగా. ౨౨౧

చని యల్లల్లనఁ జొచ్చి నీ చరణ సంస్పర్శమ్మునన్ బుణ్యమై
వినత బ్రహ్మ శివాది వంద్యమగు నా బృందావన మ్మేగి యొ
య్యన నానందనిమగ్నుఁడై నటుల మూర్ఛామగ్నుఁడై నట్టులున్
మనమం దిట్లనరాని చిత్రపరిణామ మ్మందె నబ్జేక్షణా! ౨౨౨

కని యల్లంతన సాగిలంబడి నమస్కారమ్ము గావించె న
వ్వనిలో నీ విహరించు తావులకు, నీ పాదాబ్జ చిహ్నమ్ము లం
టిన దూళిన్ బొరలాడె; నెంతొ ప్రజ పుట్టెన్ నాడు నీనాడునున్
గన నక్రూరుని బోలు భక్తి వివశుల్ గన్పింతురే యింకొరుల్? ౨౨౩

చని సాయంతనవేళ గోపవనితా సంగీత దివ్యామృత
స్వనముల్ కర్ణరసాయనమ్ములు భవ చ్చారిత్రసాహిత్య మో
హనముల్ గోపక మందిరమ్ములకు బ్రహ్మానందపూర్ణాపగా
స్వను నీతుండయినట్టు లేగి దరిసెన్ ద్వన్మందిరావాటమున్. ౭౨౪

దరిసించెన్ బలుతోడఁ బాల్పిదుకు నంద మ్మొప్పె కన్గొంచునన్
వర భక్తోత్తము స్వాగతమ్మొసఁగి సంభావింప నున్నట్టులన్
బరమ బ్రహ్మ రసార్ణవమ్ము హృదయాంతఃస్థాయి యుప్పొంగి ని
స్సరణమ్మై యెదురయ్యె నన్నటులు సాక్షాత్పూర్ణరూపున్ నినున్. ౭౨౫

సాయంస్నాన విశేష నిర్మలతనుల్ సత్పీత నీలాభ కౌ
శేయశ్రీ పరిధాన సుందరులు కించిన్మాత్ర భూషోత్కరా
ధేయుల్ చారు దరస్మితార్ద్రవదనుల్ దివ్యాంగ రాగోజ్జ్వలుల్
మీయాయిద్దఱఁ జూచె భక్తుఁడు సమున్మీలద్దృశోద్రిక్తుఁడై. ౭౨౬

కని దూరాన రథమ్ము డిగ్గి యవనిన్ గైవ్రాలు నా భక్త మౌ
ళిని బాహుద్వయి గ్రుచ్చి యెత్తికొని యాశ్లేషించి యానంద ధో
రణి నల్పాక్షర సుందరమ్ము కుశలప్రశ్నమ్ము గావించి కే
ల్గొని కేలన్ బలరాముఁగూడి యతనిన్ గొంపోయి నా వింటికిన్. ౭౨౭

నందునితోడ నాదరమునన్ మఱి నీవును పూజసేసి, యా
నందుసి వానివార్తలు వినన్ దగురీతి ఘటించి, గోపుల
య్యందఱ రాజు నానతియు నానతియిచ్చియు నేకశయ్య నా
నంద కథారతిన్ మురిసినావటె రాతిరియెల్ల వానితో. ౭౨౮

"హరి! యా చంద్రికయింటనే మసలెనో యా చంద్రభాగాగృహాం
తరమం దాగెనొ మిత్రవిందభవనానఁ డాగెనో రాధికా
వర పర్యంక వినోది య్యెనొ నిశా పర్యాప్తి ధూర్తుం" డటం
చరవిందాస్యలు సంశయించిరఁట వాతాగార! నన్ బ్రోవరా! ౨౨౯

## ౭౭. మధురాయాత్ర - అక్రూరునికి భగవద్రూప సాక్షాత్కారము

మధురా ప్రయాణముఁ విని
మధురాధర లెల్ల వనరి మఱిమఱి యొకటై
మథనపడి రెట్టు లెట్లీ
వ్యథయే మేమనియు నేడ్చి రందఱు నదటై. ౨౩౦

నందకుమారుఁడు కరుణా
నందనవన మిట్లు తనను నమ్మిన మనని
య్యందఱ విడిచెను మన విధి
యందమ్మిటు తేలెననుచు నడలిరి పడతుల్. ౨౩౧

నందునితో నాప్తసుహృద్
బృందముతోఁ జనుచు నీవు వేకువ గోపీ
సుందరుల తాప ముడుప న
మందకృపఁ బంపినావు మఱి స్నేహితునిన్. ౨౩౨

త్వరలో మీ సన్నిధికే
నరుదెంచెద నన్ను గలియనగు శోభనమౌఁ
జిర మమృత సింధువున నె
ల్లర ముంచెద ననుచు లలనలన్ దేర్చి తటన్. ౭౩౩

కన్నుల కబ్బిన దూరము
కన్నియలటు సూచి వేడగా నాదెస క్రేఁ
గన్నుల నల్లనఁ జూచుచు
నన్నా! యేగితివి రథమునం దటు బలుతో. ౭౩౪

మగువల మనసులు, లెక్కకు
మిగులగు గోపకుల బండ్లు మీ వెంటనెరాన్
మృగములు నెగులొందగ న
న్నగములు దిగులొంద దాటినాఁడవు యమునన్. ౭౩౫

స్నానాదుల మునిఁగి కనెన్
లోనన్, మఱి లేచి రథములోనన్, వివశుం
డై నిలిచెన్ చిత్రము విభుఁ
డా నీ సర్వత్రదర్శనావాప్తి హరీ! ౭౩౬

మునిగి మఱి పుణ్యపురుషుఁడు
గనె నిన్నున్ బరమపురుషుఁ గరకలితగదా
ఘన శంఖ చక్ర సరసిజు
మునిసిద్ధపరీతు భుజగభోగ వినీతున్. ౭౩౭

పరమ బ్రహ్మ సుఖాంబుధి
పరిమగ్నుం డతఁడు పొగడి బహువిధముల నిన్
దరిసెన్, నిను గనకయుఁ బ్రాక్
స్ఫురణన్ హర్షానువృత్తి పులకించె హరీ ! ౭౩౮

చలి నీళ్ళు కఱచెనో మెయి
పులకించె నటంచు నడుగ ముదముత్కటమై
పలుకని యక్రూరునితో
నెలమిన్ జనినావు మథుర, కేలర నన్నున్. ౭౩౯

## ౭౪. మథురాపురీ విహారము

హరి ! నీ వ మ్మథురాపురమ్ము బహిరుద్యానమ్ము మధ్యాహ్నమే
దరియం జొచ్చి కృతాశనుండవయి మిత్రశ్రేణితో నేగి త
త్పురముం జూడఁ జిర శ్రుతిప్రవిహితామోద త్వదాలోక స
త్వర పౌరోద్య దగణ్య పుణ్య నిగళ వ్యాకృష్టుఁడై నట్లుగన్. ౭౪౦

భవదంఘ్రిద్యుతిపోలె రాగ సుభగల్, త్వన్మూర్తిచందమ్మునన్
సువిలాసోరుపయోధరప్రభలు, నీ చూపట్లుగాఁ జంచలల్,
భవదీషత్స్మిత మట్లు నిర్మలలు, నీ వక్ష మ్మటుల్ హారిణుల్,
నవలల్ వచ్చిరి నీ కచద్యుతివలెన్ రాజత్కలాపల్ హరీ ! ౭౪౧

పౌరస్త్రీల నపాంగదృష్టి ముదమొప్పం దేర్చి, హర్షాద్భుత
స్ఫారమ్మై ప్రజ సూడ నొక్క రజకున్ వస్త్రమ్ములీఁగోరి, పో
పో రాజోచిత మెవ్వఁడిచ్చునను నమ్మూర్ఖాత్ము శీర్షమ్ము నీ
వౌరా! త్రుంచితి వాఁడునుం జనియె పుణ్యశ్లోకియై సద్గతిన్. ౨౪౨

నీ వేషమ్మున కర్హమౌ వలువ లెంతేభక్తి నర్పింప నీ
తావున్ జేర్చితి సాలె; నెవ్వఁడెఱుఁగున్ దత్తత్పురాపుణ్యముల్,
పూవుంగుత్తులు మాలలిచ్చి పొగడన్ బుణ్యాత్ము మాలాకరున్
దేవా! యేలితి లక్ష్మి కోరు పరభక్తిన్ గూర్చి లక్ష్మీపతీ! ౨౪౩

కమలాక్షిన్ గని కుబ్జ నద్ది యొసగంగా నంగరాగమ్ము భా
వమునన్ దాని కనంగరాగ ముదయింపంజేసి యయ్యింతి డెం
దములోనున్న ఋజుత్వమున్ దనువునన్ వ్యక్తీకరింపంగ హ
స్తమునన్ జేకొని యెత్తి చేసితిగదే సాక్షాజ్జగత్సుందరిన్. ౨౪౪

ప్రకటస్ఫూర్తి భవత్ప్రభావముల సంభావించి పుణ్యాత్ములిం
తకు నీ నేర్చిరి శక్తికిం దగినటుల్ తాంబూలమో మాలయో
అకటా! నీ వరుదెంచు మార్గమున నే నానాడు కైమోడ్చి నీ
కొక పువ్వైనియు నీయలేనయితి నట్లుద్వేగినై కుందెదన్. ౨౪౫

వనితా! వచ్చెదనన్న కుబ్జ తమి నోర్వన్‌లేక నీవంక నే
కనగాఁ దత్పుర గోపురాంతరమునన్ గాల్మెట్టినా వంతకున్
మును నీ కీరితి త్వత్సమాగమ మహా మోదోల్లస ద్దేవకీ
స్తనకుంభ ప్రగళత్పయోరసము చందమ్మొంది లోఁ జాల్కొనన్. ౨౪౬

పురముం జొచ్చి మహోత్సవస్ఫురణ, మామ్రోలన్ ధనుశ్శాలలోఁ
బురుషుల్ చక్కఁదనమ్ము తేజమునకున్ మూర్ఛిల్ల, ఖండించినా
వరరే వద్దను నంతమున్న సుమనో హారార్చిత మ్మవ్విలున్
గరమం దెత్తియు నెక్కుఁవెట్టియును నాకర్షించియున్ బెళ్లునన్. ౨౪౭

ఆ కంసక్షపణోత్సవమ్మునకు ము న్నారంభ తూర్యస్వన
మ్మై కోదండరవమ్ము వేల్పులకు రోమాంచమ్ము గల్పించి యా
రా కంసున్ వణకించె నిన్మడిగ కాండాకాండ ఖండద్విడ్యా
వ్యాకృత్త స్ఫుట చాప రక్షకభట వ్యాలోల హాహాధ్వనుల్. ౨౪౮

సదసద్వర్గము సూచి నీ మహిమమున్ సంతోష సంత్రాసముల్
మది నూనన్ మథురా విహారివయి యంతన్ వచ్చి శ్రీదాముతో
నదె రాధా విరహార్తి సెప్పికొని యుద్యానాన నిద్రించి త
య్యదనన్ నీ యవతార కార్యఘటనన్ హర్షించి; నన్నేలరా ! ౨౪౯

## ౭౫. కువలయాపీడ చాణూర ముష్టిక కంసవధ

ఖలునాజ్ఞన్ పణువాతఁ దూర్య నినదోత్కంపమ్ముగా నెల్ల రా
జులు మంచమ్ముల నిల్వ సౌధమునఁ గంసుండుండ నందుండునున్
విలసద్ద్వేషముతోడ నక్కువలయాపీడావలీఢమ్మునన్
బలుతో సానుగుఁడై చరించితివి రంగద్వార సీమన్ హరీ ! ౨౫౦

అరరే పాపి ! తొలంగి పొమ్మనఁగనీ వంబష్ఠుఁ డుద్యత్క్రుధో
ద్ధురతన్ మీఁదికిఁదోల నేనుఁగు నినున్ దొండమ్మునన్ బట్టి స
త్వరమే వెల్వడి గోపికా కుచయుగ స్పర్ధాలు తత్కుంభ మీ
వురలన్ మీటి తదంఘ్రులం దడఁగి యోహో వచ్చి తుద్యత్స్మితిన్.

హ స్తమ్మం దటు లంది యందనటులై యమ్మోనిలోకానక,
ట్ల స్తవ్య స్త మొనర్చి ప్రాణములతో నా దంతి దంతమ్ము వి
ధ్వ స్తమ్ముం బొనరించి యందొదవు ముత్యాలిచ్చి పంపించితీ
వస్తోకద్యుతి హారముం గొలిపి యిమ్మా రాధ కంచున్ జెలిన్. ౭౫.౨

కరిదంతమ్ము భుజాగ్రమం దునిచి రంగక్షోణి కీ వన్నతో
నరుదేలన్, భవదంగభంగిమకు లోనై పౌరు లానందుఁ డం
దర ధన్యుం, డది కాదు వ్రేతలు, యశోదాదేవియేఁ గాద, యి
ద్ధరలో ధన్యుల మేము నేడనిరి నిన్దర్శించి ధన్యేక్షణుల్. ౭౫౩

పరమానంద రసప్రపూర్ణ మధురబ్రహ్మమ్ముగా గొల్లలన్
నిరతిన్ వ ర్తిలు ని న్ననేకు లెఱుఁగన్లేరైరి, ప్రాక్పుణ్య వి
స్తర మీనాఁ డిటు పక్వమై కని నినున్ సంపూర్ణ హర్షోదయ
స్ఫురణన్ బాడిరి త్వత్పవిత్ర చరితమ్ముల్ రాగబంధమ్ములన్. ౭౫౪

అటఁ జాణూరుఁడు మల్లవీరుఁ డటుపై నమ్ముష్టికుండె త్తి ఛట్
ఛట శబ్దమ్ముగ ముష్టిపాతముల నుత్పాతావపాతమ్ములం
దటు నీతో బలరాముతో నెదిరి ప్రాణాపాయమౌ మున్న యు
త్కటతం గాంచిరి బంధమోక్షము లనేకమ్ముల్ విచిత్రమ్ముగన్. ౭౫౫

సుకుమారాకృతు లీకుమారు లతిభీష్మల్ క్రూరు లీమల్లు లె
ట్లోకొ యీ దారుణ మేము చూచుటని పో నుంకింపగా లోక, మూ
రక చాణూరుని ద్రిప్పికొట్టితి వటన్, రాముండు నమ్ముష్టికుఁ
వికలుంజేసెను, జావగా మిగిలి వేవే పాఱిరా కొందఱుఁ. ౭౫౬

ఖలుఁ డక్కంసుండు తూర్యము న్నిలిపి కింకర్తవ్యతామూఢుఁడై
బలు నిన్నుం దఱుమంగ నాజ్ఞయిడి చంపంజూచె నా వృద్ధులఁ
చలముం బూని దురుక్తులఁ; గరుడిపైఁ శైలమ్ముపై దూకిన
ట్లల మంచెఁ వడి దూకి పట్టితి వసివ్యావల్గ దుస్సంగ్రహున్. ౭౫౭

కీలుంగీ లెడలించి వ్రాలి ఖలుపై క్రీడింప నీ మీఁద నా
పూలుఁ వ్రాలెను వేలుపుల్గురియ, నేమో పల్కుటల్, భీతి ని
న్నోలిఁ ధ్యానమొనర్చి చేకొనియె సాయుజ్యమ్ము నీ చేతిలో
వ్రాలం గల్గుట కాలనేమి యయి ముఁ బ్రాపించు నవ్వాసనఁ. ౭౫౮

అలఘుల్ కంసుని తమ్ములం జదిపి మున్నర్చించి నిఁ గన్న వా
రల నర్పించియు నుగ్రసేనునకుఁ దద్రాజ్యమ్ము, నయ్యాదవా
వలి కిష్టార్థము లిచ్చి యుద్ధవు గురుప్రాప్తార్థనీతిజ్ఞు భ
క్తులలో నుత్తము మిత్రుగం బడసి, తెందున్ నన్ను బాలింపుమా! ౭౫౯

## ౭౬. ఉద్ధవదౌత్యము

బలుతో నర్వదినాల్గు రోజులనె సర్వజ్ఞుండ వీ వెల్ల వి
ద్యలు సాందీపుని సన్నిధిం జదివి యంతన్ మృత్యు లోకమ్మునన్
గల తత్పుత్రుని దక్షిణార్థముగఁ జక్కన్ దెచ్చి యర్పించి యి
మ్ముల నేతెంచితి పాంచ జన్యరవమున్ బూరించుచున్ బ్రోలికిన్. ౭౬౦

వలపుల్గుల్కెడు గోపికానివహమున్ భావించి భావించి య
గ్గలమౌ జాలి కరంగి యుద్ధవుని భక్తశ్రేష్ఠు మిత్రున్ దదు
జ్జ్వలభక్తిన్ భువనైక దుర్లభముఁ జూపంగోరి పంపించి త
ద్వ్వలనన్ ద్వద్విరహ వ్యథామతుల కాశ్వాసమ్ము గల్పింపగన్. ౭౬౧

చని గోధూళికమందు గోకులము సాక్షాత్త్వత్ప్రభావైక బో
ధన, మాలో నలరించె నీకథ యశోదానందులన్; వేకువన్
గని తద్రత్నరథమ్ము శంకగొని యా కంజాక్షు లాలించి యా
తనిచెంతన్ గుమిగూడిరెల్ల పను లంతన్ వీడి యా గోపికల్. ౭౬౨

వేష మ్మద్దియె భూషణమ్ము లవియే వీక్షింప లీలాసము
న్మేషమ్ముల్ మఱి యవ్వియే యనుచు నిన్ వేమాఱు భావించి సం
తోషోద్రిక్తత మాటరా కెటులొ యింతుల్ గద్గదోక్తిన్ నినున్
భాషింపం జని రంతటన్ స్వపరభావస్ఫూర్తి లేకుండఁగన్. ౭౬౩

హరి నిన్నంపెనె తల్లిదండ్రులకునై యన్నిర్దయుం డక్కటా
మరగెన్ శ్రీ మధురాపురీరమణులన్ మాస్వామి ! మమ్మేలు మ
చ్చెరుపౌ నీ యమృతస్వరూప పరమా శ్లేషమ్ములున్ ముద్దులున్
మురిపెమ్ముల్ కుహకోక్తులున్ మఱచునే పూఁబోణి యెందేనియున్.

లీలన్ గ్రొమ్ముడి వీడ ఘర్మజలముల్ జిందంగ రాసోత్సవ
శ్రీ లీలా లలితద్యుతిన్ లలితమౌ శ్రీ మూర్తి మాకౌగిటన్
లాలింపన్ దయఁజూపు మొక్కపరి హేలామన్మథా యంచు రా
గాలాపమ్ము లొనర్చి రంగనలు ప్రేమాక్రాంతి నున్మత్తలై. ౭౬౫

ఆలీలన్ వివశోక్తులన్ జకితలై యల్లాడు నా గోపక
న్యాళిన్ నీదగు జ్ఞాన గర్భిత వచో వ్యాసక్తి నూరార్చియా
మోలన్ హర్షితలున్ భవన్మయలునౌ పూఁబోణులం దాతఁడున్
హేలన్ గొన్ని దినమ్ములట్ల గడపెన్ నీ వార్తలే చెప్పుచున్. ౭౬౬

నీ సంగీతముతోడనే గృహవిధుల్, నీ వార్తతోనే మిథో
వ్యాసంగమ్ములు నిన్నుగూరిచియె స్వప్నాలాపముల్, చేష్టలున్
వేసమ్ముల్ భవదీయమౌ ననుకృతుల్, విశ్వమ్మహోత్వన్మయ
మ్మౌ గోపీజనభక్తి విస్మయ విమోహమ్మందె నీ భక్తుఁడున్. ౭౬౭

ఇది మారాధకుఁ జాలయిష్ట, మది యిట్లిట్లాడు, మాటాడవే
మిది మేలా చెలి ! మత్ప్రియాంగన విధ మ్మిట్లంచు నేకాంత మం
దెదియేనిన్ నినుగూర్చి చెప్ప విభుఁడం చీరీతి నారాధికన్
సదయుండై మురిపించె నుద్ధవుఁడు త్వత్సందేశ సూక్తిశ్రుతిన్. ౭౬౮

రానుంటిఁ ద్వరలోనఁ, గార్యభరమై రాకుంటి నిందాక, మ
ద్ధ్యానమ్మిఁ దృఢమయ్యె నన్నెడసి, యేలా ఖేద, మీలోన బ్ర
హ్మానంద మ్మదయించు, సంగమ వియోగాదుల్ సమమ్మందు మీ
కౌనంచుఁ భవదుక్తులఁ సలిపె దుఃఖాతీతలఁ వ్రేతలఁ. ౭౬౯

“ఏ లోకమ్మున నిట్టిభక్తి కనరా దెందుఁ వినఁరాదు శా
స్త్రాలేలా తపమేల గోపికలకుఁ సాక్షాన్నమస్కార” మం
చాలో గోకులమందునుండి పరమాహ్లాదాత్ముఁడై వచ్చుచో
నాలక్షించుచు నుద్ధవుఁ మురిసి తప్పా ! నఁ గటాక్షింపరా ! ౭౭౦

## ౭౭. కుబ్జానుగ్రహము, జరాసంధ యుద్ధము, ముచికుందానుగ్రహము

ఊరక నీదు రాకకొఱ కువ్విళులూరుచు నిన్నె యెంచి శృం
గారము సేసికొంచుఁ జిరకాలముగా మరుబారిఁ జిక్కి న
వ్వారిజనేత్ర కుబ్జ యటు వాసకసజ్జికయై ; తదాలయ
ద్వారము దట్టి తుద్ధవుఁడు దా జతగా జనుదేఱ నంతటఁ. ౭౭౧

మురియుచుఁ జూచి నిన్ను బరిపూర్ణ మనోరథయై కుచద్వయీ
భరము వడంక వచ్చి యటు స్వాగతమిచ్చి సపర్యలిచ్చి సుం
దరి జగదేకసుందరు నెదఁ గదియింప, రమింపఁజేసి త
త్తరి స్మరకేళులఁ పరమ హర్షమునన్ సురహస్య భంగిమన్. ౭౭౨

వరముం గోరె వరాకి కోరుమనగా బల్మారు నిన్ రాత్రులన్
సురత మ్మిమ్మని, పండితుండయిన నెచ్చో కోరు సాయుజ్య ; మ
ద్దిర సామీప్యము నేని నిన్ననిశ మర్థింపంగనేలేద యీ
శ్వరతంత్రమ్మఖిలమ్ము నెవ్వ డెఱుగున్ సర్వేశ ! చిత్రమ్మగున్. ౨౨౩

రేలన్ గుబ్జన్ సంగమ
హేలన్ మురిపించి కొమరు నిచ్చితివి యశ
శ్శాలి నుపశ్లోకు ; నతం
డాలించెన్ బాంచరాత్ర మన్నారదుచే. ౨౨౪

హలితో నుద్ధవుతోడ నీవు సని యయ్యక్రూరు గేహమ్ము, మి
క్కిలి హర్షించి భజించి మించి యతడున్ గీర్తించినన్ మెచ్చి య
వ్వల వానిన్ మఱలించి పాండవ వనావాసాంత వృత్తాంత మా
తల నా యా ధృతరాష్ట్రి చేష్టితము నంతం గాంచి తంతర్మతిన్. ౨౨౫

అల్లుం గంసు సుహృద్వరుం గెడపెనం చాలో జరాసంధుం డ
య్యెల్లల్ ముట్టడి సేయంగా మధుర, నీ వింద్రోపలబ్ధమ్ము తే
రుల్లాసమ్మున నెక్కి స్వల్పబల మోహో ! పూని తూలించి నా
వల్లల్లం బరసైన్య మిర్వదియుమూం డక్షౌహిణుల్ దక్షతన్. ౨౨౬

బలునకు బద్ధుండైన బలవద్బలు నా ప్రబలోద్యమమ్ము పై
వలపున వాని వీడితివి పాపి జరాసుతు ; విశ్వజైత్ర యా
త్రల సమవాప్త సత్వబలదర్పితుం డెవ్వడు సాటి వానికిం
బలమునం బౌరుషమ్మునను వానికి వాండె సముండు సెయ్యడం ౨౨౭

ఓడియు రాచవార లొకయూపొసగన్ హృదయమ్ము లగ్నమై
పోఁడిమి వాఁడు నిన్నెదిరిచేఁబో పదునాఱు పరాజయమ్ములై;
వాఁడిఁ దనర్చి తా శివశివా! యటు సంపితి వాని సైన్యముల్
వాడక మూఁడువందలకు పై నటు తొంబదియొక్క లెక్కకున్. ౭౭౮

అట నష్టాదశ సంఖ్య యుద్ధమిఁక నౌనన్నప్పుడే నీదు ముం
దటు ముక్కోటిగ నిల్చు నయ్యవన సైన్య మ్మెంచి, యా ద్వారకన్
బటు వేగమ్మున విశ్వకర్మవలనన్ బట్టించి యంబోధి, క
చ్చట కేగించితి వెల్ల బంధుల నుదంచ ద్యోగశక్తిన్ హరీ! ౭౭౯

వనమాలాధర! పాదచారివయి పైపై భీతి నర్తించి ప
త్తనముం దాటియు పాఱిపోవుచును ద్వద్ధస్తమ్మునం జావ నో
చని మ్లేచ్ఛుం డటు వెంబడించి తరుమన్ శైలమ్మునన్ లీనతన్
గనగా! నమ్ముచుకుంద వాఁడు నటదాకన్ నిద్రలో మెక్కువై. ౭౮౦

ముని వానిన్ మఱి భస్మముం జలుప నా మ్రోలన్ గుహావీథి, నీ
వును భక్తాగ్రణియైన యాతనికి సొంపుల్ నింపు నీ మూర్తి చూ
పిన, నైక్ష్వాకుఁడ నే విరక్తుఁడను ద్వత్ప్రేమార్థి నీ సర్వ రా
జనికాయమ్ము సుఖమ్ము కోరెదననన్ సంతోషివై నీవునున్. ౭౮౧

ముక్తికిం దుల్యమైన సద్భక్తి నిచ్చి
క్షపిత సకలమలమ్ము మోక్షమ్ము నిచ్చి
తపము హింసావిశుద్ధికిం దప్పదంటి
చేరి ముచుకుందునకు లోక శిక్షణకును. ౭౮౨

చని యటమీఁద నమ్మథుర చాయల నయ్యవనేశు సేనలఁ
దునిమి, నిరుద్ధుఁడై నడుమ దొట్టిన యమ్మగధేశు నేనచే
ననిఁ దుదిగెల్పు వాని మదమంతకు నంతకు నెక్కనిచ్చి, చ
య్యన పరువెత్తి తయ్యుదధి యందలి వీటికి; పాహి మాం ప్రభో! ౭౮౩

## ౭౯. రుక్మిణీకల్యాణ యాత్ర

నాకశిల్పి ప్రకల్పితానల్ప శిల్ప
కౌశలమ్ము,లాసలింప సంకలిత భాగ్య
పేశలము, జలధి మధ్య సంవేశ మీవ
లంకరించితి ద్వారకఁ లలితమూర్తి. ౭౯౪

బ్రహ్మపంపున రేవతపతి కుమారి
రేవతి నొసంగ హలికి, సంప్రీతులైన
యాదవులఁ గూడి పోషించి తట వివాహ
మహిత ముత్సవఘోష సమ్మర్ద మంత. ౭౯౫

ఆ విదర్భాధిపతి కూతు రంచితాను
రాగ నీయెడ, రుక్మిణీరమణి నన్న
చేదిపతి కీయనెంచి యున్మాదియగుచు
నధముఁ డధమాధముఁడు వానియందఁ జేరె. ౭౯౬

బాల నీయెడ ననురాగలోల చాల
కాలముగ, కోర్కె సఫలమ్ముకాదో యనుచు
కలఁగి ద్విజు నంపె నీతోడ దెలుపఁ దనదు
క్రమము పుష్పాస్త్ర కల్పిత శ్రమ మసమము. ౭౮౭

విప్రబాలుఁడు వచ్చె వేవేగ నీ పు
రమ్మునకు దుష్టజన దుర్గమమ్మునకు న
పార ముదమందె ప్రేమ సత్కారమంది
పరునిచేతను భవతాపహరునిచేత. ౭౮౮

అనియె నీతో నతండు కుండిన పురాన
రాజిలుఁ రుక్మిణి యనంగ రాచకన్నె ;
కలికి నీమీఁద నెంతేని వలపు కులికి
బాల యిటు పంపినది నన్ను బేలయగుచు. ౭౮౯

ఎపుడొ నీ గుణములు హరియించె నన్ను
నిపుడు హరియింపనుండెఁ జేదీశుఁ డకట !
పరమ కృప కాటపట్టు చేపట్టవోయి
యనియె రుక్మిణి విశ్వవిశ్వాధినాథ ! ౭౯౦

ఈవ నా దిక్కు నన్ను పేక్షింతువేని
యిపుడ జీవితముం దృజియింతుననెడి
చెలువ పలుకులు వినిచి నెచ్చెలి త్వదీయ
సదయ హృదయమ్ము భయసమాస్పదమొనర్చె. ౭౯౧

పలికి తీవంత నతనితోఁ బరమమిత్ర !
తరుణి మించెను మన్మథ భరము నాకు
వచ్చి రాజులు సూడ నిన్ దెచ్చికొందు
కమలలోచన మన్మనఃకమలనిలయ. ౭౯-౭

అనిన నానందభరితుఁడౌ నతనితోడ
నపుడె రథయాత్ర సేసితి వప్పురాన
కనిలపురనాథ సకల కల్యాణనిలయ !
పెండ్లికొడుకౌదు వింక మా వినతి గొనర ! ౭౯-౮

## ౭౯. రుక్మిణీకల్యాణము

బలముతో వచ్చు బలునితోఁ బట్టణమున
విడిసితివి భీష్మ నాతిథ్య విధులు వడసి
వచ్చె హరి యన్న యా విప్ర బాలు మ్రొక్కి-
లలన సత్వర మానంద కలన నగుచు. ౭౯-౧

భువన మోహనమైన నీ మూర్తి గాంచి
రాకుమారుని దుష్టవర్తనము లెంచి
చాల పరితాపపడు పురజనులఁ బహువి-
లాపములు రేయి నడచె నాలాపములను. ౭౯-౨

లలిత కల్యాణ భూషణా కలిత యగుచు
నిందుధరదేవి మ్రొక్కి రాకేందువదన
త్వత్సమర్పిత జీవిత తనదు నంతి
పురము వెల్వడె భట సముత్కరము గొలువ. ౭౯౬

ఎనసి కులవృద్ధ లంబ మ్రొక్కింప నృప కు
మారి పూజించి శంభు దేవేరి పద స
రోరుహమ్ముల వ్రాలి లోఁ గోరికానియె
నిన్నె పతిసేయుమనుచు నెన్నెన్నొ గతుల. ౭౯౭

అరసి నృపకులమతి కుతూహలసమాకు
లముగ నీవును డాసి గోప్యముగ నిలువ
లలన గిరిజాలయమ్ము వెల్వడె దిగంత
రమ్ము రుచిర ప్రభాపుంజ రంజితముగ. ౭౯౮

భువనమోహన రూప వైభవముచేత
నఖిల రాజ కదంబమ్ము నవశ మొనరఁ
జేసి రాగ కటాక్ష విక్షేపములను
ముగ్ధ నిన్నంత ప్రమద సమ్ముగ్ధుఁజేసె. ౭౯౯

ఎందు జనె దిందుముఖి యంచు నంద మొలుక
కరము కరమునబట్టి సత్వరమ పూని
యరద మెక్కించి హరియించి తలముకొన ని
జాతలమ్మున రిపుల కోలాహలములు. ౮౦౦

అలకాపరి యెటుపోయె నను చుఁ గినిసి
పోరి దొర లోడి రయ్యదువీరులకును
నీవు కదలవు నీచాతి నీచులకును
గ్రామ సింహమ్ములకు సింహ మేమి బెదరు? ౨౦౧

అవల యుద్ధాన కరుదెంచినట్టి రుక్మిఁ
బట్టి చంపక వికృత రూపకు నొనర్చి
మదము మఱి దింపి బలుమాట వదలిపెట్టి
కాంత! పురమేగితివి రమాకాంతతోడ. ౨౦౨

లలన నూత్న సమాగమ లజ్జితాత్మ
ప్రణయ కౌతుక జృంభిత ప్రసవచాప
నలరఁజేసితి సుఖసమాకలనమునను
నధిప! హసితాంశుముఖి రహస్యమ్ములందు. ౨౦౩

వివిధ పరిహాసముల రస వివశఁజేసి
యువిద ఋజుమతిఁగూడి వక్రోక్తులాడి
యనుపమానంద లీల నుయ్యాల లూచి
తంతట ననంత భోగ శయ్యాగ్ర శయన! ౨౦౪

లలన నంతకుమించు లాలన కలావి
లాస కౌశలముల సముల్లాస పఱచి
తదె నుతింతుము నీదు కల్యాణ చరిత
తార మమ్మేల రుక్మిణీ రమణ కృష్ణ! ౨౦౫

## ౭౦. స్యమంతకోపాఖ్యానము

రవి మున్నిచ్చిన యా స్యమంతక మహారత్నమ్ము నర్థించినాఁ
డవు సత్రాజితు నొక్కలుబ్ధుఁ డటు; గాఢప్రేమయౌ తత్తనూ
భవుఁ జేపట్టఁ దలంచి యీ నెపమునన్; ద్వద్దివ్య లీలానుభా
వ విశేషమ్ము లుదారహేతుకములై భాసించు నాబుద్ధికిన్. ౭౦౬

ఈ ననె వాఁడు రత్న మతిహీనమతిన్, మఱి వాని తమ్ముఁడున్
దానిని దాల్చి వేటకుఁ జనన్ మృగరా జది మాంసమంచు న
వ్వానిని జంపె, దాని నటుపై కపిరాజు వధించి యమ్మణిన్
మానితకేళి కందుక మొనర్చె వడిన్ శిశురత్నడోలికన్. ౭౦౭

జను లాడంజని రీవ దొంగవని యాసత్రాజిదుక్తిన్; గుణా
గ్రణులం దప్పిద మింతయేని యమృతప్రాయమ్ము లోకాన, కీ
పును సర్వజ్ఞుఁడ వయ్యునున్ వెదుక నాప్తుల్ దోడుగానేగి కా
నను గన్గొంటి ప్రసేను సింహ మటుపైనన్ జాంబవంతున్ గుహన్. ౭౦౮

ముదుసలి కోతి నీనిజము పోల్పక నన్ను ముకుందభక్తు నె
య్యదసున నోర్చువాఁ డెవఁడటంచుఁ బ్రభూ! రఘునాథ! శ్రీహరీ!
యిదె జయ మిమ్ము నాదుగతి యీవని గుప్పిటి పోటులన్ భవ
త్పదయుగ భక్తమౌళి సలుపన్ దొడఁగెన్ భవదర్చన మ్మనిన్. ౭౦౯

గణియించి తుదకు రమణీ
మణితో మణినీయ, భక్తమణి నేలి నృపా
గ్రణి సత్రాజిత్తునకున్
మణినిచ్చితి వఖిలదేవమణి వీవు హరీ ! ౮౧౦

ధీమహితుండు సిగ్గువడి తెచ్చి మణిన్, సువిశాలనేత్ర భా
మామణి నీకు సిచ్చె మును మాట మఱొక్కని కిచ్చికూడ, నీ
వీమణి యీనునట్టి ధన మీ లలనామణి చాలుమాకు నీ
దే మణియంచునున్ దిఱిగియిచ్చి తటన్ గహనాశయుండవై. ౮౧౧

ఆయెడ సిగ్గునన్ బెదరు నమ్ముదితన్ రసముగ్ధఁజేసి, కౌం
తేయులు లక్కయిల్ సొరుట యెంచి యటన్ మఱినీవు నేగినన్;
పాయక గాందినేయ కృతవర్మల మాట స్యమంతకమ్ము న
న్యాయము నాక మ్రుచ్చిలె నహో ! శతధన్వుఁడు కూర్చి తత్పతిన్. ౮౧౨

హరి! సత్రాజితుఁ జంపుమం చనుపునే యక్రూరునింబోలు స
చ్చరితుం, డంతయు నీ తలంపునఁగదా సాగున్; గృపామూర్తి వీ
వరరే! కైకొనవైతి వమ్మణియు మున్నక్రూరుచేఁ జిక్కుటీ
వరయన్ నేర్చియు నాప్తభక్తుని సమగ్రైశ్వర్యుఁ గావింపగన్. ౮౧౩

అయయో ! నీయెడ భక్తిసుస్థిరుఁ డయో ! యక్రూరుఁ డీలాటి దు
ర్ణయమేలా యొనరించె! శాంతుఁడనియున్ బ్రజ్ఞాని నే నంచుసు
స్మయమున్ విస్మయ మంకురించెనని తత్స్వాంతమ్ములో దోస మ
వ్యయ ! సంహారముసేయ నీవ యతనిన్ బట్టించినా వీగతిన్. ౮౧౪

వ్యాకులుఁడై భయానఁ గృతవర్మయుఁ దాను సెటేని పారినన్;
జేకొని పిల్చి వానికడ నిస్తులరత్నము వెల్వరించి యం
దేకడ కుండనిచ్చి యది, యీవును దృప్తుడవైతి, సత్యభా
మాకుచవేదికాశయన! మారుత మందిర! ప్రోవరా మమున్. ౮౧౫

## ౮౧. సుభద్రా వివాహము, కాళింద్యాది కల్యాణము, నరకాసుర వధ

వలపుల్ గుల్కెడు సత్యభామఁ బ్రణయవ్యాసక్తి లాలించుచున్
కలికిం గూడియ ద్రౌపదీపరిణయానందమ్మునం దేలి, నీ
చెలిసంప్రీతికి హస్తినాపుర మటన్ సేవించి యేతెంచి తా
తల కట్టించి మహాద్భుత మ్మయిన యింద్రప్రస్థ మల్లల్లనన్. ౮౧౬

తన కిమ్మంచును గౌరవుం డడిగినన్ ద్వత్ప్రేరణన్ శక్రనం
దనుఁ డేతెంచి హరించె మీచెలియలిన్ భద్రన్ సుభద్రన్ దనం
తన మాయాయతివేషియై; కుపితునిన్ లాలించి మీయన్నఁదో
నన భామాసహితుండవై యరిగి తింద్రప్రస్థ మీవాపయిన్. ౮౧౭

అందుఁ జరించుచుండి యమునాపగతీరమునందుఁ జూచి, కా
ళింది గ్రహించి, ఖాండవము లీలగ నగ్ని కొసంగి, మిత్రవిం
దం దగ మేనయత్తసుతఁ ద్వద్గతచిత్త హరించినాఁడ వా
సుందరి యన్నకుం బెదరి చూడగ రాజకులమ్ము సూడగన్. ౮౧౮

అనువుగ సప్తమూర్తివయి యక్కడి యావృషభమ్ము లేడిటిన్
గని యలయించి నాగ్నజితిఁ గైకొనినాఁడవు సత్య, నావ్రత
ర్దనముఖు లాత్మసోదరిని దారను నీకు నొసంగ నప్పుడా
య్యన నట మేనయత్త తనయన్ గయికొంటివి భద్రనామకన్. ౧౯

నరముఖ్యుల్ మునుపేయఁజాలని జలాంతర్బింబితమ్మౌచు గో
చరమై మింటనెసంగు మత్స్యమను లక్ష్యమ్మేసి యా లక్షణన్
వరియింపంగని యిట్లు లష్టమహిషీ వాల్లభ్యముంజెంది య
న్నరకుం గూర్చిన దుర్ణయంబు లటుపైనన్ వింటి వయ్యింద్రుచే. ౨౦

మది నూహించిన యంత వ్రాలిన గరుత్మ ద్వాహనాగ్రమ్మునన్
ముదితం దాల్చి నిజాంకమం దుపవనమ్ముంబోలె నవ్విద్విష
త్పదముం జేరి యగల్చి దుర్గముల నాప్రాగ్జ్యోతిషమ్మెల్ల న
య్యదనన్ శోణపురమ్ము సేసితివి త్రుట్యత్సైన్య రక్తోద్యతిన్. ౨౧

మురఁడన్ దైత్యుఁడు సింహమై కదిసి యంభోరాశిఁ బోరాడఁ ద
చ్ఛిరమున్ ద్రెంచితి చక్రధార, నటుపైఁ జెల్వొ చతుర్దంతసుం
దర దంతిప్రకరమ్ముతో నెదిరినన్ జక్రమ్ముచేఁ జెండి య
న్నరకుం జేసితి వీవ తీర్ణనరకున్ ధాత్రీనిజాపత్యమున్. ౨౨

భూసతి వేడ నన్నరకు పుత్రకునిన్ భగదత్తు నేలికన్
జేసి గజమ్మొకం దొసఁగి, నీవును జేర్చితి వెల్ల యేన్గులన్
రాసులు రాసులైన ధనరాజిని రక్కసు చేతఁ జిక్కి నీ
యాసను ప్రాణముల్ నిలుపు నంగనలన్ బదియాఱు వేవురన్. ౨౩

కొనె నరకాసురుం డదితి కుండలముల్ మును; వాని నామెకీ
యను జని, సత్యభామఁ గని యప్సరసల్ వెఱసిగ్గుఁ జెంద, నిం
ద్రుని వలనన్ సపర్యఁగొని, దొంగిలి యచ్చటి పారిజాత, మె
త్తిన హరినొంచి తాతని మదిం గల శ్రీమద మెల్ల డింపగన్. ౧౨౪

ఆవల సత్యభామ వనమందున నాటి సురద్రుమమ్ము నా
నావిధ మూర్తివై విలసనమ్ముల నాపదియాఱువేలతో
నావిధి నారదుండు గని యబ్బుర మందగ నందఱందుఁగ
న్నావు పదేసిమంది ప్రియనందనులన్, గనవే ననున్ గృపన్. ౧౨౫

౧౩. ఉషాపరిణయము, బాణాసుర యుద్ధము, నృగశాపమోక్షము

భవదంశమ్మగు రుక్మిణీసుతుఁ డహో! ప్రద్యుమ్నుఁ డా శంబరున్
భువిఁ గూలించి రతిన్ గ్రహించి యటుపైఁ బుణ్యాత్మ నారుక్మి క
న్య వెసన్ ముచ్చిలి తెచ్చె నాత్మపురికిన్; దత్పుత్రుఁ డుద్యద్గుణ
స్థవిరుం డయ్యనిరుద్ధుఁడున్ గొనిమె నంతన్ రోచనాకన్యకన్. ౧౨౬

రుక్మికిన్ బౌత్రిగాన యారోచనాకు
మారి పెండ్లికి నీవునున్ జేర హలియు
నచట జూదమ్ము వేడుక నలిగి రుక్మి
వ్రాల్చెఁ గాళింగు దంతముల్ రాల్చె నంత. ౧౨౭

వీరశైవుఁడు బలికుమారుఁడు వేయి బాహులవాఁడు, దు
ర్వార విక్రముఁడైన బాణుఁడు; వాని కూతు రుషాఖ్య ము
న్నార! చూచి యెఱుంగ దైన మృగాక్షి యయ్యనిరుద్ధుఁ గ
న్నారఁ దాఁ గలఁజూచి మున్విరహార్తిఁ జాల తపింపఁగన్. ౨౮

చిత్రయోగ విభూతి వైభవ చిత్రలేఖ తదీయ స
న్మిత్ర మెల్లర రాకుమారుల నేర్పునన్ లిఖియించి యా
చిత్రముల్ మఱిసూపి యయ్యుష చిత్తముంగని తెచ్చె నా
రాత్రి మీ యిలుసొచ్చి యోగభరాన నయ్యనిరుద్ధునిన్. ౨౯

అనిరుద్ధుం డటు సొచ్చి యంతిపురమం దా బాణకన్యాలలా
మ ననంగాగమలీలలన్ మనుపగా నాగాస్త్ర బంధాన నా
తని బంధించె ననంగవైరి పరమాప్తస్వామి, యన్నారదో
క్తిని నీవుం జని శోణితాఖ్యపురముం గీలించి తస్త్రాగ్నులన్. ౩౦

బంపై కావలికాయు శైలతనయా ప్రాణేశుఁ డవ్వేట, నా
వెంటన్ భూతగణమ్ముతో నెదిరిచెన్ వే బాణుఁడున్ రేగి, వె
న్నంటెన్ బో యుయుధానునిన్ గుహుఁడు మున్నాగించెఁ బ్రద్యుమ్ను, ము
క్కంటి న్నీ వెదిరించినాఁడ వచటన్ గంజాక్ష! యుద్యద్ద్యుతిన్. ౩౧

సకలాస్త్రమ్ములు వమ్మువోయె భవదస్త్రజ్యోతికిన్, రుద్రుఁడున్
వికలుండయ్యెను, భూతముల్ పరువిడెన్, భీతమ్ములై, కూలి బల్
వికృతిం బొందె గణమ్ము, లక్కుసుమధన్విం దాకి స్కందుండు డా
యక పారెన్, హరిచేతిలో విరిసెఁ గుంభాండుండు మృద్భాండమై. ౩౨

చాపము లైదువందలును జచ్చువడన్ జనె బాణుఁ; డంత సం
తాపితమై హరజ్వరము త్వజ్జ్వరమెత్త, నుతించి త్వత్కథా
వ్యాపృతులన్ వరమ్మిడి జ్వరాపగతిన్, మఱియేగె జ్ఞాన వి
ద్యాపతులయ్యుఁ దామసు లయారె! ప్రచండులు రుద్రపార్షదుల్. ౧౩౩

నానాసాధనుఁడైన బాణు మదమంతం బాపి, యద్వైత సం
ధానుండై వినుతించు శంకరులయానం బాహువుల్ రెండిటన్
గానన్ వచ్చియు నిర్వరందు భయశంకన్‌వీడు నాశైవు స
న్మాన మ్మంది యుషానిరుద్ధయుతుఁడై న ర్తించి తా ద్వారకన్. ౧౩౪

నందు హరింపగా వరుణు, నాకపతిన్ బలుమార్లు, విప్రు న
న్నందను దెచ్చియీయ యము దావశిఖిన్ మఱిద్రావి యగ్ని, గో
బృందము దొంగిలింప విధి, నీశ్వరు బాణుని పోరఁ గెల్చి తీ
యందరమించె విశ్వమహిమాతిశయ మ్మవతార మివ్విధిన్. ౧౩౫

భూసుర శాపముచే నృగుఁ
డూసరవెలియైనఁ ద్రిదివ మొందించితి నీ
దాసులకున్ ద్విజ భక్త్య
భ్యాసము గావించి; నన్ను బాలింపు హరీ! ౧౩౬

## ౮౩. పౌండ్రకవధ, కాశీపురీదహనము, వివిదవధ, లక్షణాస్వయంవరము

రాముఁడు గోకుల మ్మరిగి రక్తిమెయిన్ మధుపాన మత్తతన్
రామలఁ గూడి యయ్యమున రమ్మనరామిఁ బరాభవించి, స్వే
చ్ఛామతి నుండ సేవకు ప్రసక్తిని బౌండ్రక వాసుదేవుఁ డీ
ర్ష్యామలినాత్మ్ముఁడై పనిచె నయ్యెడ నీకడ కొక్క దూతునిన్. ౮౩౭

ఈయవతార మెత్తితి మహిన్ మఱి నావలె, నెవ్వఁడొక్కొ నా
రాయణుఁడై చరించెద వయారె మదీయములైన చిహ్నముల్
నీయెడఁ గానిపించెడి నవెల్ల త్యజించి ననున్ భజింపరా
రా యనెఁ బౌండ్రుడం చనిన నందరు నవ్విరి తత్సభాసదుల్. ౮౩౮

చనియెను దూత నీవు యదుసైన్యముతోఁ జని బౌండ్రకాఖ్యమే
న్గనుగొని తప్తలోహమునఁ గాల్చిన చిహ్నము, మూల్యమిచ్చి తా
కొనినవి కౌస్తుభమ్ము మణికుండలముల్ మఱి పీతచేలమున్
గనుగొనినాఁడ వయ్యసుర కైకొను నద్భుత వైష్ణవాకృతిన్. ౮౩౯

ఉక్కునఁజెక్కి చక్రమదియున్ విసరెన్ ; మఱి వాని మూర్ధమున్
గ్రక్కునఁ గాల వహ్ని వెలిగ్రక్కెడు నీదగు చక్రధార నీ
పక్కడ గత్తిరించి మఱి యాఖలు సేనల నుక్కడంచి య
ప్పుక్కడి మంత్రి కాశిపతి మూర్ధము రాల్చితి కాశికాపురిన్. ౮౪౦

జ్ఞాన మ్మించుక లేక మందుఁడయి సాక్షాద్వాసుదేవుండ నా
హా నేనంచును బౌండ్రకుండు భవదీయైక్యానుభావంబు మా
త్రానన్ జేకొనియెన్ సమంచిత భవత్సాయుజ్య సంసిద్ధి లో
కానన్ జీవు లెమేమి నోచిరో యెఱుంగన్ శక్యమే యేరికిన్ ? ౭౪౧

ఆవలఁ గాశిరాజు కొడుకైన సుదక్షిణుఁ డుగ్రుఁ గొల్చి నీ
పై విహితాభిచారుఁడయి పంపెను బాణరణావభీత భూ
తావళితోడఁ గూరిచి మహాభయదమ్మగు కృత్యవహ్ని తా
లావధికోన్నతిన్ జగములన్ని దహించెడిదాని నయ్యెడన్. ౭౪౨

కనుఁగొని పౌరులెల్ల భయకంపితులై యది వచ్చుటెల్లనున్
వినిచిన, జూదమాడుకొను వేడుకనుండి చలింప కీవునున్
వినివిననట్ల పార్శ్వమున వెల్గెడు నీదగు కాలచక్రమున్
బనిచితి హస్తసంజ్ఞ నది పైకొనియెన్ బరమోత్కటద్యుతిన్. ౭౪౩

వెనుకొను నీదు నాయుధము వేడిమి కోర్వక ఘోరకృత్య హా !
యని పరువెత్తె నల్దెసల; కంత సుదక్షిణు నయ్యదక్షిణున్
గినుకను గాల్చి కాశిపురి నీరొనరించె సుదర్శనంబు నీ
పనుపున సర్వశాత్రవ విభంజనమున్ బుధరంజనమ్మునై. ౭౪౪

వివిదుఁడు మున్ను వాఁడె కపివీరుఁడు రావణుతోడి పోర రా
ఘవులకు సాయమై, యిపుడు క్రౌర్యముపూనెను, నీదుపాల మృ
త్యువు బడయంగ నన్నరకుతోడయి ద్వారకప్రాంతమం దుప
ద్రవ మొనరించి కూలె బలరాముఁడనిన్ జెయిసాచి వ్రేయఁగన్. ౭౪౫

కురువిభుకూతు లక్షణను గూడి హరించిన సాంబుఁగట్టి నా
దొర ననునీతుఁ జేయఁజని ధూర్తులమాటల రోసమెక్కి యా
కరిపురి నొంచె రాముఁడు, స్వకమ్మగు సేన మరల్చితీవు న
క్కురువధ పాండవాత్మజులకుఁ మిగిలించి మరుత్పుర ప్రభూ ! ౮౪౬

## ౮౪. సూర్యగ్రహణ యాత్ర

అనిరుద్ధుని గృతవర్మను
నునిచి పురీరక్ష కినుని యుపరాగమునం
జనినాఁడ వీవు యదుకుల
వనితలతో నాస్యమంతపంచకమునకుఁ. ౮౪౭

పరమ పవిత్రుఁడయ్యు బహుభక్తజనమ్ము ననుగ్రహింపగఁ
దరిసి స్యమంతపంచకమునఁ దగు స్నానము లాచరించి భూ
సురుల కనేకదానములు సొంపుగఁజేసి నిజాప్త మిత్రులఁ
గురుకుల ముఖ్యులం గలిసికొంటివి పుణ్యుల పాండవేయులఁ. ౮౪౮

అనుపమభక్తి నిన్గొలుచు నా ద్రుపదాత్మజ నీ ప్రియాంగనా
జనములతోడఁ గూడికొని సమ్మదమందె వధూజనమ్ముతో
నెనసి యొకొక్కరే తము హరించి వరించిన నాటి నీదు శో
భన కథలెల్ల వారలకు వారుగ ముచ్చటగుల్కి పల్కఁగఁ. ౮౪౯

అంత నేతెంచి గోపుల నాదరించి
చిర వియోగార్తిఁ దనులతల్ చిక్కి స్రుక్కి
గోపకన్యా కదంబమ్ముఁ గూడినావు
పరమరస నిర్భరమ్మైన భావ మెనసి. ౪౨౦

హృదయము మానమీవ హరియించితి వద్భుత దర్శనోత్సవ
మ్మది ఘటియించి గోపికల కప్పుడు ప్రాగనుభూతి రమ్యతన్
గదిసి విలీనుఁడైతివి ప్రగాఢరస ప్రవిముక్త కంచుక
మ్మదిర వ్రజాంగనా ఘనకుచాగ్రములన్ దలమోపి యచ్యుతా! ౪౨౧

విరహార్తిం గికురించి గోపికలకున్ వేడ్కన్ రహస్యమ్ములన్
బరమానంద చిదాత్మకమ్మయిన యంతర్యామియౌ నాత్మ యం
దర కేనంచు స్ఫురించుగాత మనుచున్ దత్త్వావబోధమ్ము స
త్కరుణన్ గూర్చితి వోమరుత్పురగృహాంతర్జ్యోతి! పద్మాపతీ! ౪౨౨

ప్రమదలకున్ సుఖస్ఫురణ స్వల్పముగా మును పుద్ధవోపదే
శముల వియోగదుఃఖ మనుషక్తమ, యిప్పటి నీ మహోపదే
శమున నఖండ మద్వయరస స్ఫురణమ్ము త్వదేకభావనా
విమలసమాధిలాభ మది వ్రేఁతల కబ్బె స్వరూపమై హరీ! ౪౨౩

మునుగని నారదాది మునిముఖ్యులఁ బాపశమార్థ మేమి శో
భనములు సేయనౌననఁగ వా రెలనవ్వులఁ బుండరీకలో
చనుని గుమారుగాఁ గనఁగజాలిన పుణ్యముకంటెఁ బుణ్యమే
మనియు యజింపఁజేసి రొక యజ్ఞము నవ్వసుదేవుచే నటన్. ౪౨౪

సుమహితకల్ప మాక్రతువు సొంపుగ సాగుచునుండ నాప్తమి
త్రము లలరంగ గోపకులు త్వత్సహవాస రసానుభూతి పూ
ర్వమువలెఁ జూరలాడి రనురక్తిని యాదవు లర్హ గౌరవ
మ్మమరిచి నేడురేపనుచు నాపగ నాగుచు మూడుమాసముల్. ౮౫ ౫

అచ్చటినుండి యేగుసమయమ్మున రాధికఁజేర్చి కౌఁగిటన్
గ్రుచ్చి కవుంగలించి మదికుందు సమస్తము వాపి చారుహ
ర్షోచ్ఛ్రయుఁడౌచు ద్వారకకు నున్ముఖుఁడైతివి భక్తచిత్త పా
టచ్చర ! మద్రుజాభరమడంపర శ్రీగురువాయు మందిరా ! ౮౫ ౬

* * * *

## ౮౬. జరాసంధ వధ - రాజసూయము

అనుపమ బాధలంది చెఱలందు జరాసుతుచేత, రాజుల
య్యెనిమిదివందలన్ బెరసి యిర్వదివేలగు సంఖ్య వారు ము
న్ననఘ ననాథనాథుడయినట్టి నినున్ శరణొంద నొక్కనిన్
బనిచి రతండు నమ్మగధనాథు వధింపను గోరె నిన్నటన్. ౮౬ ౧

ఒక్కెడ నా జరాసుత వధోద్యమమున్ సురమౌని మాట నిం
కొక్కెడ నయ్యుధిష్ఠిరు క్రతూద్యమమున్ గదలింప నుద్ధవుం
డక్కడ రాజసూయ ముభయార్థ సమర్థక మంచుఁదెల్పగా
గ్రక్కునఁ బాండవేయుల పురమ్మున కేగితి వాప్తకోటితోన్. ౮౬ ౨

దేవులతోడ నీవు నరుదేర భవత్కరుణాకటాక్ష సం
భావితులైన తమ్ముల ప్రభావమునన్ మహిఁ గెల్చి రాజ్య ల
క్ష్మీ విభవమ్ము ధర్మజుఁడు చేకొన నిన్ నిజభక్తికింకరున్
బావని నర్జునుం గొలిపి పంపెను మాగధు నుక్కడంపఁగాన్. ౨౫౯

ఏగి గిరివ్రజమ్ము పుర మీరలు ముగ్గురు బ్రాహ్మణాకృతిన్
మాగధు యుద్ధ భిక్షమును మంచిగ వేడితి: రీ వపూర్ణ పు
ణ్యాగతిగాన వానిపయిఁ గంపి సమీరకుమారుఁ బార్థుతో
మూగిన రాజలోకములు పోరుకొనన్ గనుచుంటి లీలగన్. ౨౬౦

అని కిసుమంత తగ్గని జరాత్మజు వృక్షము పెల్లగించు గు
ర్తున నని భీముచేతఁ బడఁద్రోచియు వాని చెఱన్ గృశించునా
జనపతులన్ విముక్తులుగ సల్పి పరాఖ్య మఖండ భక్తియున్
నినిచియు నిస్పృహాత్ములను నిల్పితివేల్పడి ధర్మరక్షకున్. ౨౬౧

ఆవల రాజసూయ సుమహాధ్వరదీక్షితుఁ డయ్యె ధర్మరా
జావసుధేశ మిత్రులు తదానతులే దొరలెల్ల, సర్వలో
కావనదక్షుఁ డీవును ద్విజాంఘ్రుల క్షాళన మాచరించి త
త్పావనవారి మూర్ధమునఁ దాల్చితి వా నృపుభాగ్య మేమనన్. ౨౬౨

ఆ యజనమ్మునం గలుగు సందఱిలోఁ దొలిపూజ కర్హుఁడీ
వేయని ధర్మరాజు గణియించివడిన్ వసుదేవుమాట హ
ర్షాయతిఁ బూజసేసె సకలాత్మకు నిన్ను సభాముఖాన నా
ప్యాయన మొందె దాన సకలామరమానుష మైన లోకముల్. ౨౬౩

ఎందఱొ రాజు లుండ మునులెందఱొ యుండగ నాలకాపరిన్
మందుని వట్టి నీచు వటు మందుఁడు తానిదె పెద్దనేసె నం
చందర రజ్జులాడుచు నుదాయుధుఁడై వడి లేచెఁ జేదిరా
జం దధమాధముండయిన యాఖలుపై జనిరంత పాండవుల్. ౮౬-౪

వారల నాపి నీవు శిశుపాలు నెదిర్చి యశేష విద్విష
ద్దారణమైన చక్రమునఁ దచ్ఛిరమున్ దెగనేసి తంత నా
క్రూరుఁడు మూఁడు జన్మములఁ గూడిన వైరసమాధి శుద్ధధీ
సారత యోగులున్ బడయఁ జాలని నీదగు నైక్యముం గనెన్. ౮౬-౫

అనుపమ రాజసూయసుమహాధ్వర మట్లు భవన్నిరూఢమై
చన, జనముల్ జయించుత నజాతరిపుండు జయించుఁ గృష్ణుఁడం
చని చని, రాసుయోధనుఁడు నాత్మఁ బరాభ్యుదయాభ్యసూయచేఁ
గనియెఁ బరాభవమ్ము మయకల్పిత వేశ్మ జలస్థల భ్రమన్. ౮౬-౬

నవ్విరి భీముఁడున్ ద్రుపదనందనయుఁ దద్వదపాంగదీప్తి నా
నవ్వున నంకురార్పణ మొనర్చితి వద్భుత జృంభణమ్ముగా
నివ్వసుధాభర మ్మడుపు టింతకు; మా రుజలెల్లఁ ద్రోచి మ
మ్మెవ్వలనన్ గటాక్షరుచి నేలు సమీరపురాధిపా ! హరీ ! ౮౬-౭

## ౧౬. సాల్వాదివధ, మహాభారత యుద్ధము

మును శ్రీరుక్మిణి పెండ్లి యాదవ బలమ్ముల్ వంపగా, శంభుఁచే
గొని సాల్వుం డురు సౌభగమ్మును గురుక్షోణిన్ భవత్ సుస్థితిన్
గని మీద్వారక ముట్టడించె; యదుసైన్యమ్మును ప్రద్యుమ్నుఁ డా
తని తన్మంత్రి ద్యుమంతుఁ గట్టె; చనె యుద్ధ మ్మిర్వదేణ్ణాళ్ళటన్. ౧౬౮

హలితో సత్వర మీవు వచ్చి హత సేనానీకు నా సాల్వు వి
హ్వలుఁజేయన్, గదవైచి శార్ఙ్గమును విభ్రంశమ్ముఁ గావించె; ని
మ్ముల మాయావసుదేవుఁ జంపె నట నీముం దద్ది నీ కింతయున్
దెలియంబోదని యందు; రయ్యవమతిన్ జెండాడె నావ్యాసుఁడున్. ౧౬౯

గదచేతఁ జూర్ణంబు గావించి సౌభగ
మ్మును విమానమ్మబ్ధి మునిచి నీవు
చక్రాయుధమ్ముచే సాల్వుఁగూల్చితి; వంత
దంతవక్త్రుిందు విక్రాంతి నెగసి
గద వైచె, దానిని గౌమోదకిం ద్రుంచి
తంత ప్రాక్పుణ్య సమాప్తి నెనసి
వాఁడు చైద్యుఁడువోలెఁ బడనె నీతో నైక్య
పరమలాభమ్ము సుభక్తునట్లు,
కామమున్ క్రోధమాదిగా గలుగు ఘన వి
కారములఁగూడ నీయందుఁ గట్టి నెమ్మ
నంబుగట్టిన ముక్తి పట్టంబుగట్టు
దానికేకద యీ యవతార మభవ! ౧౭౦

నీవల్లేగినమీఁద నక్రూరుసభ న్ గ్రీడించు దుర్యాతాంతమం
దీవే దిక్కను ద్రౌపది న్ వలువ లెన్నేనిచ్చి రక్షించి, ము న్
శైవాంశమ్మగు మౌనికి న్ జడిసి ని న్ ధ్యానింప నాసాధ్వి వేఁ
బ్రోవ న్ శాకములారగించి ఋషుల న్ ము న్ దృప్తుల న్ జేయవే. ౮౭౧

అనికి న్ నిశ్చయమై నిను న్ నరుఁడు, సైన్యమ్మెల్ల రారాజు ని
మ్మన, నట్లేయని పాండవార్థముగ దౌత్యమ్మూని భీష్ముఁడు లో
నన నీమాటను, గాదన న్ నృపుఁడు. విశ్వాకారము న్ జూపియు న్
మునిగోష్ఠి న్ గలగించి యక్రూరిపురి న్, దోతెంచితీ వంతట న్. ౮౭౨

అని నప్పార్థునితేరి సారథివియై యాత్మీయుల న్ జంపలే
నని ఖిన్నుండగు నర్జును న్ దెలచి తప్పా! యాత్మ మేకంబ, చం
పను జంపంబడ నేఁడు లేఁడు, మది నాపైఁ బెట్టి నిర్భీకుఁడై
యని ధర్మ్యమ్మొనరింపుమా యని విరాడాకారము న్ జూపుచు న్. ౮౭౩

ధరణీభార మడంప దీక్షగొను నిన్ దర్శించి భీష్ముండు నా
దొరలం జంపగఁ బార్థు నొంప నిజభక్తుం బ్రోవఁ జక్రమ్ముతో
హరి! నీ వస్త్రము పట్టన న్ బ్రతిన వమ్మైపోవ పైవచ్చునిన్
సొరిదిం జూచుచు భీష్ము డానతశిరస్కుండౌచు కేల్మోడ్చినన్
బరమానందము నెంది వెన్దిరిగి తా భక్తాగ్రణిన్ మీదికిం
బరవన్ బ్రాంజలియైనవానినుతి కానందించితీ వయ్యెడన్. ౮౭౪

కరిసేనన్ భగదత్తుఁ డెత్తివిసరంగా వైష్ణవాస్త్రమ్ము, నీ
యురమం దాగి, సుదర్శనమ్మునను జాటొందించి మార్తాండు, స
త్వర మా సైంధవుఁ గూల్చి, కర్ణుఁ డురగాస్త్ర మ్మేసినంతన్ వసుం
ధరకుం దించి, నికృత్త మౌళిగ నరున్ రక్షించి; తీవెన్ని దు
ర్భర కష్టంబుల నిట్లు పాండవుల సంరక్షింపలే దీశ్వరా! ౮౨౫

అనికిన్ మున్ హలి తీర్థసేవఁ జని తానా నైమిశమ్మందు సూ
తుని బ్రత్యుద్గతి సేయమిన్ దునిమి, పుత్రున్ నిల్పి బ్రహ్మాసన
మ్మున, యజ్ఞఘ్నుని పల్వలున్ దునుముచున్ మున్ బర్వపర్వమ్ములన్
ఘన తీర్థమ్ములఁ దోగి పోరు ముగియంగన్ భీమదుర్యోధనుల్
పెనగం జూచి గదారణ మ్మరిగె నవ్వీరుండు మీవీఁటికిన్. ౮౨౬

నిదురం జెందిన ద్రౌపదీ శిశువులన్ జెండాడఁగా ద్రౌణి ను
న్మదునిన్ డాసి నరుండు నీ పనుపునన్ బ్రహ్మాస్త్రమున్ నిల్పి, య
య్యదనన్ వాని శిరోమణిం గొనగ వాఁ డామీఁద నిష్పాండవ
మ్మది చేయంజన నుత్తరాజఠరమం దంగుష్ఠ మాత్రుండవై
సదయుండై శిశురక్ష సేసితివి నీచక్రాయుధమ్మొడ్డియున్. ౮౨౭

అనుశాసించి సుసూక్ష్మధర్మముల భీష్మాచార్యుఁ డయ్యన్గ మ
న్మని నాధర్మజు, భక్తి పెంపున నినున్ గన్గొంచు స్వేచ్ఛాగతిన్
గనియెన్ నిష్కల మాత్మభావము, కనంగా నశ్వమేధత్రయ
మ్మును గావింపగఁ జేసి ధర్మజునిచేఁ బూర్ణార్థు గావించి మేల్
పొనరన్ ద్వారక కేగుదెంచి తటు నన్ బూర్ణార్థుఁ గావింపుమా! ౮౨౮

## ౮౭. కుచేలోపాఖ్యానము

సరవిఁ నీకు సతీర్థ్యుఁడై కొలిచె నా సాందీపనిఁ విప్రుఁడ
బ్బురపుఁభక్తి వహించి నీయెడ, ధనమ్ముల్ భోగముల్ కోరఁ డీ
శ్వరతంత్ర మ్మఖిలమ్ముగా నరయుచుఁ శాంతాత్ముఁడై యుండెఁ దా
నరయఁ భక్తిఁ గుచేలుఁ డుత్తమము గార్హస్థ్యమ్ము చెల్లించుచుఁ. ౮౭౧

ఇంతయుఁ దీసిపో దతని యింతి ప్రవర్తన వాని; కైన తత్
స్వాంతము వానియంతగ వశమ్మొనరించుకొనంగలేమి నా
చెంతకు నేగి "వృత్తికయి శ్రీపతి నేల భజింపరాదు మీ
కెంతయుఁ గూర్చు నెచ్చెలిగదే హరి" యంచు వచించె జాలిగఁ. ౮౭౨

ప్రియసతి యాకటఁ నుడిసి బిడ్డలతల్లి యిటాడ దుర్మద
స్మయదము విత్తమంచు మది మాటి కసహ్యము నాటియైన న
వ్యయు నిను జూచు వేడ్క మది నగ్గలమై యొక చిన్నపాత నీ
కయి పృథుకమ్ములఁ ముడిచి యల్లనఁ దెచ్చె నుపాయనమ్ముగఁ. ౮౭౩

సరసనుజేరి నీవు విరిచామరముల్ గొని లచ్చి వీవ త
త్కరము కరమ్మునఁ మెలచి తారు చరించిన చిన్ననాటిబల్
చరితము లెన్ని ముఁ సమిథలఁ గొనితే గురుపత్ని పంచినఁ
బెరయు నకాలవర్షము వనిఁ సయిరించుట యెల్లఁ జెప్పినఁ. ౮౭౪

సిగ్గిలు నక్కుచేలు దరి చిక్కిన యయ్యుడుకుల్ బలాత్కృతిన్
మ్రొగ్గి గొనంగ వెండియును బూనగఁ జాలిఁకఁ జాలునంచుఁ దా
నగ్గలికన్ జలించి జలజాలయ చయ్యనఁ జేరవచ్చి తా
దిగ్గన బట్టి నీకరము దీటుకొనన్ మణికంకణధ్వనుల్. ౮౭౩

అరిగి కుచేలుఁ డందముల కందము వింతలకెల్ల వింత నీ
పురమటు సూచి శైబ్య గృహమున్ మఱినొచ్చి వికుంఠసీమన
ట్లరసి వచింపరాని పరమాద్భుత నిర్వృతిఁ జొక్కి నంత మున్
హరువుగ నీవు సూపు పరమాదృతికిన్ మఱి యేమనన్వలెన్ ? ౮౭౪

ఆతఁడు భక్తులందుఁ బరమాద్భుత భక్తుఁడవైన నీదు సం
ప్రీతికిఁ బాత్రమౌచు నొకరే యచటన్ సుఖముండి యేగె తా
నాతలిరోజునన్ నిజగృహోనకు విత్తము మాటలేక, నీ
చేతి యనుగ్రహ స్ఫురణ చిత్రవిచిత్రముగాదె మాధవా! ౮౭౫

"అడిగితినేని వాఁడెఱచి యప్పుడ యచ్యుతుఁ డిచ్చువాఁడ; నా
పడతి కిఁకేగి యేమనెద భాగ్య" మటం చటులేగుచుండి నీ
నొడివిన మాటలున్ పనులునున్ జిఱునవ్వులు నెంచి లీనతన్
గడచి కనెన్ స్వకీయభవనమ్ము కనన్మణిదీపిత మ్మటన్. ౮౭౬

ఏనిటు దారి తప్పితినొ యీ తెఱ వేమని యట్టులిట్టులై
పూని గృహమ్ముఁ జొచ్చి మునుమున్న కనెన్ దనప్రాణవల్లభన్
మానిత హేమరత్నమయ మంజులభూషణ భూషితాంగిఁ బా
దానత నద్భుతాద్భుత మయారె! యెఱింగె భవత్కృపారుచిన్. ౮౭౭

ఆవిధి నూత్న రత్నభవనాళి వసించుచున్ సమున్నమ
త్పావన భక్తియోగమున భవ్యుఁ డతం డమృతత్వ మందె నీ
వీవిధి భక్తవాంఛితము లెల్లను నింతు వనుగ్రహింపు నన్
శ్రీవర! శ్రీకుచేల సఖ! శ్రీ గురువాయుపురాధినాయకా! ౮౮౮

## ౮౮. అర్జున గర్వభంజనము

మును పాచార్య కుమారుఁ దెచ్చుటది యేమో విన్న మీ యమ్మకో
రిన నీవున్ బలిపూజ లందికొని, యాక్రేవన్ సురజ్యేష్ఠు కో
పనియుక్తిన్ మునుపా హిరణ్యకశిపున్ భావించియున్ దండ్రిగా,
దనయుండ్రై పసుదేవుపాల హతులై తామంత కంసాఖ్యుచే,
జని రయ్యార్వర మున్ మరీచిసుతులన్ సాక్షాత్తుగాఁ జూపి నీ
వనుకంపన్ స్వపదంబుఁ జేర్చితివి నీవవ్వారి నీయన్నలన్. ౮౮౯

శ్రుతదేవుండని విశ్రుతుండయిన పారున్ భక్తిపూర్ణున్ ధరా
పతిమౌళిన్ బహుళాశ్వు నొక్కమొగి సంభావించి పాలింపగా
గుతుకంబుంగొని మౌనిలోకపరిషత్కోటీరులం గూడి యం
చిత మోదమ్మున నేగి తామిథిలకున్ శ్రీమానినీవల్లభా! ౮౯౦

ఇరుతెఱఁగైన మూర్తులు వహించి యటిద్దరియిండ్ల కేగి నే
దొరనని యందొకం డిడిన తోరపు రాజమహోపచారముల్
గురిఁగొని యన్యుఁ డాదినము కూరిచికొన్నఫలోదనమ్ములన్
సరిగ గ్రహించి మెచ్చి యిరుచాయల ముక్తులఁజేసి తిద్దఱన్. ౮౯౧

వెనుకన్ ద్వారవతిన్ ద్విజార్భకమృతిన్ విశ్వంభరుండయ్యు వా
రనుమాటల్ భరియించి తెవ్వనివశమ్మౌ దైవమున్ నిల్ప నం
చని, యప్పార్థుని గర్వమార్ప మనుజుం డౌదీవు నా మొక్కవో
యిన తద్బుద్ధికి తత్త్వ నిశ్చయము సూచింపంగ వైకుంఠ ద
ర్శన భాగ్యమ్మ ననుగ్రహించితని నా స్వాంతమ్మునం దోచెడిన్. ౮౮-౨

ఎనమం డ్రాద్విజు పాపలట్లు చనిపో నింతేనియున్ శ్రద్ధగై
కొనవంచున్ జనులాడఁ పార్థుఁడట నీకుంగూర్చు చుట్టంపుచూ
పునరాగా నవమంపుబాలునకు విప్రుం డేడ్వగాఁ జూచి నీ
తనయుం డెప్పెదఁ దేనిచో ననల మంతన్ జొత్తునం చాతఁడున్. ౮౮-౩

కని నీతోనన చెప్పకేగియు నహంకారాన దివ్యాస్త్రపం
క్తి నిరోధించి యరిష్ట, మాశిశు వసే కీడొంద నయ్యామ్య ప
త్తనమేకాక దిగీశపట్టణములంతం జూచి, వ్యర్థుండునై
యనలంబుం జొరఁబోవ నాపితివి నీవయ్యర్జునున్ నవ్వుచున్. ౮౮-౪

అటుపై పార్థునితో రథానఁజని లోకాలోకపర్యంతము
త్కటచక్రద్యుతిఁ జీఁకటుల్ చిదిమి తత్కాంతిన్ గనుల్‌గానరా
నటులై నర్జును జూడుచూడుమని పారావారతీరమ్మునం
దటు చూపించితి వెల్లచీకటుల మీఁదై వెల్గు నీధామమున్. ౮౮-౫

అలరి భుజంగభోగశయనాగ్రమునన్ మణిభూషణాయుధ
మ్ములఁ గయినేసి పీతపటముం గటిఁజుట్టి సకాలవారిదో
జ్జ్వలరుచి మూఁడుమూర్తులకు పైదొరయై శ్రుతిలక్షితార్థమై
నెలకొను క్షేమమూర్తి నిను నీవ నతించితి వాప్తమిత్రుతో. ౮౮-౬

ఏనొక్కండ వివర్తమై యిరువురై యీరీతి భిన్నస్వరూ
పానం గోచరమౌ మిముం గనుగొనన్ వాంఛించి యీబాలురన్
నేనేదొంగిలినాఁడ వీరె కొనిపొండీ యంచుఁ బార్థస్తుతుం
డై నీవందఱఁదెచ్చి బ్రాహ్మణున కాహా! యిచ్చి తుద్యత్ప్రిభన్. ౮౯

నానాలీలల నిట్లు లోకముల నానందాబ్ధి నోలార్చి, యెం
తేనిం బుష్టమొనర్చివృష్ణికుల, మెన్నేయజ్ఞముల్ సేసి, యే
ణీనేత్రల్ ప్రియమందగా మసలి, క్షోణీభారనిర్వాపణ
మ్మౌ నన్నట్టి పాన భక్తజనమోక్షార్థంబు పూర్ణమ్ము బ్ర
హ్మానందమ్మవు నీవ మానవునియట్లై వచ్చి, సాక్షాద్యదు
శ్రేణిన్ గ్రీడలొనర్చినాఁడవు గదే శ్రీమానినీమోహనా! ౮౮

ఎపు డాద్వారక వచ్చి పోవును సురర్షీంద్రుండు త్వద్భక్తిభా
వపరీతుం; డతనింభజించి వసుదేవస్వామి పుణ్యాత్ముఁడా
త్మపరిజ్ఞానముఁ బొందె; నుద్ధవుఁడు భక్తస్వామిధీశాలి నీ
కృపవిజ్ఞానమునేర్చి యాబదరిలో నీనాడునున్ వర్తిలున్. ౮౯

పగ యనురాగముం భయము బాంధవమున్ జెలికార మాదిగా
నగణితయోగభేదముల నశ్రమమే భవదుఃఖ మీగి నిం
డగు నమృతత్వసిద్ధిగని రందరు నిం; దవతారమిద్ది మే
లగు సకలావతారముల; నార్తినడంపగ భక్తిపూర్తిచే
యగ మటి మాకుదిక్కగుమయా! గురువాయుపురాధినాయకా! ౧౦౦

## ౮౯. వృకాసుర వధ - విష్ణు పారమ్యము

కమలాజాని! భవజ్జనమ్ములకు సాక్షాత్పుణ్య భోగమ్ము వే
గమ యందీయ వశాంతులందు మదముం గల్పించు నంచెంచి, మున్
శమముం గూరిచి యిత్తు, శాంతులకు నో సద్యః ఫలమ్మిత్తు వే
క్రమమందైనను నీదు భక్తులకు భంగం బుండఁబో దీశ్వరా! ౯౦౧

ఆ క్షణమే యనుగ్రహము నాగ్రహమున్ ఫలియించు బ్రహ్మ ఫా
లాక్షుని మున్నుగా నిజ గుణానుగుణమ్ముగఁ గొల్చుచుండి పు
ణ్య క్షయమౌ నెడన్ బతనమందుదు రెందఱొ దూరదృష్టి లే;
కీ క్షితి నా వృకాసురుఁడె యిందు నిదర్శన మెల్ల భంగులన్. ౯౦౨

త్వరిత ప్రసన్నుఁడగు నీ
శ్వరుఁ డెవఁడన వాఁడు, "హరుని భజియింపు మనెన్"
సురముని నిను బేర్కొనఁ డా
సురవృత్తుల పాలి కీవు చుట్టము గామిన్. ౯౦౩

చని ఘోరమ్ము తపమ్ము నేసి కినుకన్ సప్తాహ పర్యంత, మం
తన ఖండించి శిరమ్ము రుద్రు నెదుటన్ రావించి వాఁడేని నె
త్తిని చే వెట్టునొ వాఁడు సావ వరమున్ దీవ్రమ్ము నీచమ్ముఁ గో
రెను స్వామిన్, శుభబుద్ధు లెట్లొదవు తండ్రీ! త్వద్విరుద్ధాత్ములన్. ౯౦౪

బంధము విప్పినట్టి జనుపైఁ జను మేటి మృగమ్ము వోలె బా
లేందు కిరీటి వెన్దఱిమె ; నీ దెస కా దెస కాతఁడేగ నే
మందు జగమ్ము కిక్కురన ; దప్పుడు నీ దెస వచ్చు శూలి నం
దందన చూచి యొక్క వటువై వృకుముందట నిల్చి నీవునుఁ. ౯౦౫

భ్రమపడి తా పిశాచమను పల్కున, భద్రము శౌనకేయ ! హ
స్తము మఱి నీదినీవ తలఁ దాల్పుము చూచెదు నాదుమాట స
త్యమ యన వాఁడునున్, దెలివితప్పి యటుల్ వొనరించి కూలెఁ ద్వ
ద్వ్యముఖుల పాటు లిట్టి, విటు దిక్కగుచుందువు శూలి పాలికిఁ. ౯౦౬

భృగుని సరస్వతీ నది దరిఁ వసియించు మునుల్ త్రిమూర్తు లం
దగణిత సత్త్వుఁ డెవ్వఁ డని ; రాతఁడువోయి తృణీకరింపగా
నెగసియు శాంతి చెందె విధి ; యీశ్వరుఁ గౌగిటఁజేర్ప రోషియై
యగజ వచింప శాంతిగనె నాతఁడు ; నమ్మని వచ్చె ని న్గనన్. ౯౦౭

అంత రమాంకపాళి నయనాబ్జము లల్లన మోడ్చియున్న ని
న్నంతనఁ గాలఁ దన్నె ముని ; హర్షభరమ్మున నీవులేచి త
ప్పింతయు సైపుమో మునికులేశ భవత్పద చిహ్నమిద్ది నా
కెంతయు నింపుసొంపు నొనరించు నురమ్మున నంటి వుబ్బుచున్. ౯౦౮

ఈ విధి నిశ్చయించిరి మునీశులు నిన్ను నశేష దేవతో
జ్జీవన వర్ధమాన ఫలసేవధి ; నీపయి భావమూని సం
భావితులైరి మోక్షమున, భవ్య మనశ్చ్యుతి దోషహీనునిన్
గేవల సత్త్వమూర్తిని గణించి భజించి తరించెదన్ హరీ ! ౯౦౯

ముందట సృష్టికిన్ నిగమ పుంజము వందిజనమ్ము వోలె నీ
యందము సన్నుతించెనట, నద్వయునిన్ బరమాత్మ సచ్చిదా
నంద రసప్రపూర్ణు నిను నమ్మి భజించెద గోపభామినీ
బృందము భాగ్యపుంజ మగు విష్ణు సముత్కట తాపశాంతికై. ౯౧౦

## ౯౦ ఆగమాది పరమతాత్పర్య నిర్ణయము

భృగు వృక మోహినీ ప్రముఖ వృత్తము లందును, నంబరీషు నం
దగపడు నీ మహత్త్వము శివాదుల యందఱికంటె నున్నతిన్
నెగడుచు ; నెందునుం సకల నిష్కలరూప మఖండ మాత్మ స
ర్వగము సమగ్ర మౌచు నవభాతము నీదియ యా స్వరూపముం. ౯౧౧

ఎందును బ్రహ్మ విష్ణు గిరిశేశ సదాశివమూర్తి పంచకం
బందుఁ బరాత్మమూర్తి శివుఁ డందు, రతండె వికుంఠవాసి నీ
వందురు కొందఱ ; రీవ త్రివిధాకృతి నొంది త్రిధా విభాగమై
యందము గుల్క సత్యపద మందు వసింతువు మూడుమూర్తులై. ౯౧౨

అందును శుద్ధసత్త్వమయు డందురు విష్ణువు, సత్త్వలేశతం
బొంది రజః ప్రపూర్తి యగు మూర్తియె బ్రహ్మ, తమోవికారచే
ష్టం దగి సత్త్వవృద్ధిగను శంకరుఁ డందురు ; మూడుమూర్తులం
దందుఁ జరించుచుండి యొకఁ డౌదువు నీవ పరాత్మవై హరీ ! ౯౧౩

ఆవిధి మూఁడుమూర్తులకు నవ్వలనొౌచు, నజాండమందు లో
నై వెలియైన యప్పరముఁ డౌ నిను శంకరుఁడం ద్రుపాసకుల్
తావకమూర్తియే యదియుఁ దథ్యమటంటకునున్ దృఢమ్ముగ లె
న్నో విధముల్ ప్రమాణము లహో !. కనిపించును నాకు నీశ్వరా ! ౯౧౪

శ్రీమచ్ఛంకర దేశికేంద్ర భగవచ్ఛ్రీపాదులున్ సర్వదా
నీ మేలౌ మహిమమ్ము పేర్కొని రహో ! నిష్పక్షపాతమ్ముగాన్
దామున్ విష్ణు సహస్రనామములకున్ వ్యాఖ్యానముల్ సేసి యు
ద్దామ మ్మవ్వలనే గడించిరి భవద్భవ్య స్తుతిన్ మోక్షమున్. ౯౧౫

మృదుల కలాయ పేశల శరీరుని నిన్ సకలేశ్వరుండుగా
మొదలనె మంత్రశాస్త్రము త్రిమూర్తుల మీఁదటి మూర్తిగాఁ గడున్
విదితమొనర్చె, ధ్యానమున నిష్కలముౘ ప్రణవమ్ముఁజెప్పి, య
య్యదియును నిన్నె యెన్నె సకలాత్మునిగా, మఱి సెప్పదన్యులౘ. ౯౧౬

సందియమింత లే దఖిలసారమునందుఁ బురాణ సంగ్రహ
మ్మందునఁ బేర్కొనంబడియె నంతట నీదు ప్రభావ వైభవ ;
మ్మెందుఁ ద్రిమూర్తులుౘ మసల నింపగు సత్యపద త్రిలోకముల్
గ్రిందఁట నీ వికుంఠ, మది మీఁదఁట, శూలిదికా దనంబడుౘ. ౯౧౭

క్రమతౘ భాగవతమ్ము రెండవదియౌ స్కంధమ్మునౘ బ్రాహ్మక
ల్పమునౘ బ్రహ్మ యనావృత మ్మయిన రూపమ్మొండు గన్గొన్నచం
దము వర్ణించుఁ బురాణసారమనుదానౘ శంభు విష్ణ్వాది నా
మములౘ దానినెచెప్పె మాధవుఁడునౘ భక్తుం డుమాజానికిన్. ౯౧౮

ప్రాక్తనజన్మ వాసన స్వభావముగా శివుఁగొల్తు రెవ్వ, రా
భక్తి పటిష్ఠమౌ కొలది వారికిఁ దత్ఫల సిద్ధిగల్గుఁ ; బ్రా
గ్వ్యక్తినిగన్న తత్తదధికారులఁబట్టియ స్కాందముఖ్య సా
రోక్తుల నర్థవాదముల న్యూనత సెప్పిరి నీకు వ్యాసులున్. ౯౧౯

పొలుచుఁ బ్రరోచనార్థముగ మూఁడు తెఱంగుల నర్థవాదముల్
దలప యథాస్థితార్థ కథిత మ్మనువాద విరుద్ధవాదముల్ ;
గలవు విరుద్ధవాదములు స్కాందము మున్నగువానఁ దామసా
కలితభవద్వశీకరణ గర్హణముల్ మొదలైన వట్టివే. ౯౨౦

పండితుఁడేనుగా, నయినఁ బల్కితిఁ గొంచెము మంత్రశాస్త్ర మం
దుండిన మాట సూచినదియున్ వినినట్టిది ; వ్యాస వాక్సుధా
పిండిత సార భూత రస విస్తృత భాగవతోపగీత ! ది
ఙ్మండిత కీర్తి! క్లేశముల మానిచి భక్తిపరుం బొనర్పవే ! ౯౨౧

★

# నారాయణీయము

## ఏకాదశ స్కంధము

### ౯౧. భక్తి వైభవము

శ్రీకృష్ణా ! భవదంఘ్య్రుపాసన మహా సిద్ధౌషధ మ్మార్తి మి
థ్యాకారైకదృశన్ భయమ్మఖిలమున్ దాటించి రక్షించు, నీ
వాకొన్నట్టి యనేక భక్తి విధులన్ వర్తించువాఁ డంధతన్
వీకన్ సంసృతి నెన్ని పర్విలిడినన్ విభ్రంశ మందం డెటన్. ౯౨౨

శ్వపచుండైనను వాఙ్మనస్తనువులన్ ద్వత్ప్రీరితాత్ముండు నీ
కృప నే చేయు సమస్త మర్పితము తండ్రీ ! నీదె సర్వస్వ మం
చెపుడున్ బావనముం బొనర్చు జగ మీవే ప్రాణమైయుండి ; య
ట్లుపయోగింపఁడు త్వత్పరాఙ్ముఖుఁడు విప్రోత్తంసుఁడే యయ్యునన్.

భయమౌ రెండవదాన, రెండవదియున్ స్వాంతమ్మునం గల్పిత
మ్మ, యథాశక్తి సమైక్యభావ మది యభ్యాసమ్ము గావించి య
వ్యయబుద్ధిన్ హృదయమ్ము నిల్పవలె ; మాయావిద్ధమై యాత్మ ని
శ్చయముం బొందదు, మాయ కీవ దొర వీశా ! భక్తినిష్ఠా సమా
శ్రయుఁడై యట్టి నినున్ భజించి భయమున్ సర్వమ్ము నేఁ బాసెదన్.

హరి ! భవదీయ దివ్యపద మంటిన సాధుల సంగమమ్మునన్
సిరిగలవారి సంగతిని శ్రీ లటు, భక్తి జనించి పెంపగున్ ;
నిరతము నట్టి సాధువుల నెయ్యము నా కగుఁగాక తన్ముఖ
స్ఫురిత భవత్కథన్ దురితముల్ దొలఁగున్; దృఢమౌత భక్తియున్.

శ్రేయోమార్గములందు భక్తియ కదున్ శ్రేష్ఠమ్ము ; క్షేమమ్ములౌ
నా యా నీదగు జన్మ కర్మములు నా యా నామముల్ పాడుచున్
డాయున్ హోసమొనర్చు నేడ్చు నొకటన్ సర్తించు నున్మత్తుఁడ
ట్లై యాడున్ మనసున్ ద్రవించి, యటు నే నౌదున్ గృపన్ జూడుమీ !

భూతములెల్ల భూతమయముల్ మృగపక్షులు శత్రుమిత్రులున్
జేతము నిగ్రహించుకొని నీవనుకొందును ; నీదు సేవచే
నాతతభక్తి దార్ఢ్యము, త్వదంచిత తత్త్వ సుబోధమున్, జగ
త్త్రాతవు నీ కృపన్ బటువిరాగము గల్గుత మా కయత్నతన్. ౯ా౨౭

లీన మ్మౌట మనమ్ము నీయెడ భవక్లేశమ్ము క్షుత్తృష్ణ నెం
తైనన్ మూర్ఛిల, కేకధార యగు సద్ధ్యానాప్తిచే తెప్పపా
టైనన్ నీ చరణమ్ములం గదల, కిష్టానిష్ట సంప్రాప్తి యం
దానందింపక క్రుంగిపో కెదియు మాయాకల్పితమ్మన్న బో
ధానన్ నీ నఖచంద్ర చంద్రికల డెంద మ్మద్భుతానంద సం
ధాన శ్రీశిశిరమ్మునై తిరిగెదన్ సర్వత్ర స్వేచ్ఛాగతిన్. ౯ా౨౮

హరి ! యీ భూతవితాన మన్నిఁటఁ ద్వదీయాంతర్బహిర్భావమే
నరయంగా నధికారిగానొ యిపు ; డట్లైనన్ భవ ద్భక్తి, నీ
పరివారమ్మున మైత్రి, దీనులయెడన్ వాత్సల్యమున్, శత్రు లం
దరుదౌ నైరణ, నీ సమర్చనమునం దత్యంతమున్ శ్రద్ధ యా
దర భావమ్మును బెంపుసేయుము ప్రభూ ! త్వత్సేవకుండైనచోఁ
ద్వరగా నందు నశేష భక్తజనమూర్ధన్య స్థితిన్ మాధవా ! ౯ా౨౯

క్షితి ముఖ్యాఖిల భూతరూపమున విక్షేపించి నీ మాయ యా
వృతముం జేయు భవ త్స్వరూపమును, జీవిన్ కర్మమార్గాన బల్
వెతఁబెట్టుఁ ; నను గప్పకుండుతఁ దదావేశమ్ము, వారింపగా
గతి నీ భక్తియ యంచుఁ బల్కెఁ గవి సాక్షాత్సిద్ధ యోగీంద్రుఁడై. ౩౦

నానాజీవుల దుఃఖముల్ దెలిసి, జ్ఞాన మ్మంది యాచార్య లా
భానన్, నీ దయగాంచి, త్వద్గుణ కథా ప్రాదుర్భవ ద్భక్తి యో
గానఁ మాయఁదరించి, సర్వసుఖ సాకల్యమ్ము నీ పాదమం
దానందింతును ; పూర్వరంగముగ దేవా ! యార్తి వారింపుమా. ౩౧

## ౨ కర్మ మిశ్ర భక్తిస్వరూపము

శ్రుతులుఁ గర్మ ఫలాభిసంధి యెచటన్ రూపింపలేదన్న స
న్మతి నీ కర్పణ మంచు నా సకలమున్ నైష్కర్మ్యమున్గాంతు, నా
శ్రుతి కాదన్న పనిఁ బ్రవృత్తియె ప్రభూ శూన్యమ్మగుం గాక, యం
దతిచార మ్మనివార్యమే, నదియు నీ కర్పింతుఁ జిజ్జ్యోతికిఁ. ౩౨

అదియుం గొండొక కర్మయోగము త్వదీయారాధనారూప, మం
దెదుటఁ నచ్చిన సత్త్వమాత్ర మగు నీ యింపైన యాకార మె
య్యెదియే మృత్తున రాతిలో హృదయమం దెందేని భావించి యె
య్యదనఁ గంధము పూలు దీపము నివేద్యాదుల్ యథాశక్తి భ
క్త్యుదిత మ్మిచ్చి సపర్యఁ, జేకొనెద విష్ణూ ! త్వత్ప్రసాదమ్ములఁ. ౩౩

భవదీయాద్భుత సత్కథా శ్రవణ సంపద్దూరులై కూడ సా
ధువులై కొందఱు స్త్రీలు శూద్రులు దయార్ద్రుల్ త్వత్పదాసన్నులై
రవురా! శాంతులుకాని బ్రాహ్మణులకై యారాటముం జెందెదన్,
భువిలో జీవికకై యజించుచు భవత్పుణ్య ప్రబంధమ్ము లె
య్యవి యాలింపక యాభిజాత్యమున విద్యన్ మత్తులై యున్నవా
రెవికావింపరు? నన్ను జేయకుము తండ్రీ! యట్టి క్రూరాత్మగన్. ౯౩౪

ఔరా! స్వీయదురంత గోపనకు పెద్దన్నయ్య వాక్రుచ్చుఁ గృ
ష్ణా! రామా! యని సిగ్గులేక వృథగా; సర్వమ్ము భగ్నమ్ము మా
యారంభ మ్మిదె వీనిఘోషనని యాహా! నవ్వుచుఞ్ గ్రొవ్వి నీ
వారిం దిట్టెద; రట్టివానిగను దేవా! నన్ను గావింపకే. ౯౩౫

మునివరాకృతి శ్వేతమూర్తి నర్చింతురు
కృతయుగమ్మునఁ దపోరీతి నెనసి
స్రుక్స్రువాదులఁ గడుఞ్ శోభిల్లు యజ్ఞరూ
పునిగఁ త్రేతాయుగమ్మున యజింత్రు
శ్యామలాంగుని శంఖచక్రాదిధరు ద్వాప
రమ్మునఁ దంత్ర మార్గమునఁ గొల్త్రు
సంకీర్తనాదులఞ్ జలదవినీలునిఞ్
గలి నరుల్ గొల్తు; రెక్కడను గలియ
యన్నిఁటఞ్ మేలు; కలియుగ మ్మం దయత్న
భవ్య సంకీర్తనాదులఁ ద్వత్ప్రసాద
లబ్ధియగుచుండు నెం దనాలస్యముగ ము
కుంద! హరి! రామ! కృష్ణ! గోవింద యనిన. ౯౩౬

కృతయుగాదులఁ బుట్టి ముక్తికిని రాని
జనము గోరుదు రిక్కలిఁ జనన మంద ;
దైవిక మ్మిందు నాదు నుద్భవము ; నన్ను
విషయ విషమూర్ఛనఁ మోస పెట్టకయ్య ! ౯౩౭

కననౌ నీ ద్రవిడావనిఁ బరమభక్తశ్రేణి కావేరి ప్రో
లను నీనాడును దామ్రపర్ణి ఘృతమాలఁ బుణ్య మా పశ్చిమా
నను ; నేనిచ్చటఁబుట్టి నిఁ వలచితిఁ ; నన్నింక నాశాగుణ
మ్మున బంధించి భ్రమింపఁజేయకు ప్రభూ ! పూరింపు నీ సేవలఁ. ౯౩౮

అవనిఁ మున్ను పరీక్షితుండు కలిఁ గ్రూరాత్ముఁ నయద్రోహిఁ గూ
ల్పవెసఁబోయియు వానిలో గుణము నాలక్షించి తామానె, న
వ్యవధానమ్మ ఫలించు నీ చరణదాస్య ; మ్మట్లు పాపమ్ముగా ;
దవుటఁ ముంధునె వాఁడు నీ భయముచే నాధివ్యథల్ గూర్చి సా
ధువులఁ నిగ్గొలువంగనీడు హరి ! యా దుష్టాత్ము దండింపవే. ౯౩౯

"లలిగంగానది గీతయుం దులసి సాలగ్రామ ముఖ్యార్చన
మ్ములు నేకాదశి గోపిచందనము శంభో ! రామ ! కృష్ణా ! యనం
గల నామాక్షర పుణ్యకీర్తన మయత్న మ్మిచ్చు నమ్ముక్తి యి
"క్కలిలో నీదయ నించి" నా ఋషుల వాక్య మ్మందునఁ నిల్పవే. ౯౪౦

మును దేవర్షి పితౄణ మీగికొని సంపూర్ణాత్ముఁ బూర్ణాత్మ భా
వన నిన్నే శరణొంది కర్మమును సర్వమ్మీగి యున్నంత, త
న్మనమందుండి నిషిద్ధ కర్మము నడంపంజాలె దీవట్లు నా
యనుతాపమ్మడగించి పావన పురేశా ! భక్తిఁ బోషింపుమా ! ౯౪౧

## ౬౩. బహుగురు లాభము

బందుగులందు మోహ మెడఁబాసెద నీ కృప బుద్ధిచేర్చి నీ
యం; దఖిలమ్మునన్ విడిచి హాయిఁ జరింతు, జగమ్ము మాయ సొం
పెందును జూచి; భ్రాంతి నుదయించు ననేకత మంచి చెడ్డలున్
జెందుచునుండు నవ్విధి నిషేధము; లయ్యవి యెట్లు దోఁచు నీ
యందున చొచ్చి నిర్విషయమైన మనంబు గలట్టివానికిన్. ౬౪౨

ఆకలి దప్పి దీర్చుకొను నంత యెఱింగెడు జంతుకోటి యెం
తో కల దందులో బురుషుఁ డున్నతుఁ డయ్యెఱుకన్ సుదుర్లభ
మ్మై కనిపించు జన్మమది, యందునుదాఁ దనకాప్తుఁ దన్యుఁడౌ;
నీ కడఁ జిత్త ముంచిన మనీషి మనఃపరితాప మార్చు తీ
రాకలిత మ్మొనర్చు; నతఁ డాత్మసఖుం, డరి యన్యుఁ డాత్మకున్.

నీ కృప యున్న లోకమున నిక్కముగా గురువేదికాదు; ధా
రాకులయయ్యు భూమి కదలందదు దానన యోర్మి నేర్చెదన్;
జేకొనెదన్ సమీరమునఁ జిక్కియుఁ జిక్కమి లోకవాసనన్;
ఆకసమందు నెల్లెడల వ్యాప్తియు నంటమి నేర్తు నీశ్వరా! ౬౪౪

అమలుఁడ నయ్యెదన్ మధురుఁ డయ్యెద నీరటు; లగ్నివోలె భూ
తము లఖిలంబునందుఁ గనెదన్ నను, బుష్టియు నష్టి గల్గు దే
హమునకు నెందు నిందుకళకట్టుల; నాత్మకు లేద; సూర్యబిం
బము జలమందుఁబోలెఁ దనుపాళిని జిత్కళ యొక్కటైన చం
దము గనుగొందు నీదగు నుదార కృపారస లబ్ధి నచ్యుతా! ౬౪౫

బోయ వధింపఁ బిల్లలకుఁ బొక్కెడు పావుర మట్లు లేద్వ, మో
హాయతి నోర్తు నయ్యజగరాకృతి నాకలిఁ బ్రాప్త భుక్తిచేఁ,
దోయధియ ట్లగాధమతిఁ దోఁచెద, సారములాని తుమ్మెద
ట్లాయది రేయిఁ బద్మమున య ట్లతిసంచయినై నశింపనున్.     ౫౪౭

తరుణీ మోహమునన్ గజమ్మువలె బంధమ్మొంద, నార్జింప బల్
సిరిమాధ్వీహరుఁడట్టు, లన్యధనముల్ సేకో నహో! గ్రామ్య గీ
తరుచిన్ మోహముసెందు లేడివలె, భోజ్యమ్మంచు గాలమ్మునన్
సరవిన్ జిక్కను జేపవోలెను, నిరాశన్ బింగళంబోలి ధీ
విరతిన్ హాయిగ నిద్రవోయెదన, యుర్వీ రక్షణీయార్థ వి
స్తరతన్ సామిషమైన యక్కురరినై చావన్ బరుల్ సంపగన్.     ౫౪౭

మనెదన్ దొట్టియనున్న బిడ్డ పగిదిన్ మానావమానమ్ములం
చనకుండన్, సతిచేతి యొంటి కడియ మ్మట్లుంచు నన్యోన్య ఘ
ర్షణ శబ్దమ్ము తొలంగి, యొండెఱుఁగ నిచ్చల్ రాజు రా భేరి మ్రో
సిన నేనిన్ శరలక్ష్య వేధివలె ని జింతింతు ; నే కొంప నో
మునుము న్నెల్కలు త్రవ్వకన్నమునఁ బామున్ బోలి వర్తించెద.

నీలోనీవ సృజించి యీ జగముల లీనంబు గావించు పే
నాలోకించెదఁ నూర్ణనాభియెడ, నీ ధ్యానాన సారూప్యమా
టాలోకించెదఁ గీటమే భ్రమరమా టందున్, శరీరమ్ము నే
నాలోకింతు నశుద్ధ భస్మమయమై యాచార్యకమ్మౌచు, వి
ద్యా లాభమ్ము విరక్తి గూర్చుట, మదీయ మ్మందును రుగ్ణమై.     ౫౪౯

అరరే! వాయుపురీశ! దేహమున మోహ మ్మెల్ల ఖండింపుమా
తరుణీ బాంధవ పుత్రమిత్ర వశులై త్వత్పాదముఙ్ విస్మరిం
తురు దానఙ్ దుద కగ్గిపాలొ తనువెందుఙ్ గుక్కపాలో యగుఙ్
త్వరచే నట్టిటు లాగు నింద్రియము లందన్నివు నీ పాదముఙ్. ౯౩-౧౦

మేనఙ్ మోహ మవార్య మే నిపుడ సామీ! రోగముల్ వాపి యెం
తేనిఙ్ భక్తి భవత్పదాబ్జమున నా కీవయ్య! యెట్లెట్లొ యా
నానా యోనుల దాటి విప్రతనువొందం గంటి మోక్షార్హ, మిం
దైనం బ్రోవుము త్రోయకే విషయ తుచ్ఛానందమం దీశ్వరా! ౯౩-౧౧

౯౪. తత్త్వజ్ఞానోదయము

అమలుల్ గాంతు రకామకర్మముల దేహాదివ్యపేతమ్ము శు
ద్ధము నీ రూపము సద్గురూక్తుల, బహుత్వ స్థౌల్య కార్శ్యాది స
ర్వము నధ్యస్తమ నీయెడఙ్ సగుణ రూపమ్మందు; దీప్తత్వ సం
శమ ముఖ్యేంధన ధర్మ మగ్ని యెడలఙ్ సంభావిత మ్మైనటుల్. ౯౪-౧

ఆచార్యుం డను క్రింది యయ్యరణి శిష్యాఖ్యమ్ము న య్యుత్తరం
బై చర్చాత్మక మంథనమ్ము జరుగఙ్ వ్యక్తమ్ము బోధాగ్ని బి
ట్టేచన్ గర్మ వితానవాసనలతో నీలోక దేహాత్మ కో
త్కోచారణ్యము దగ్ధమౌ మిగుల; కందున్ దివ్యబోధాగ్ని తా
నై చల్లారగఁ ద్వన్మయస్థితి యొకం డావిష్కృతమ్మౌ నటన్. ౯౪-౩

భవదాప్తిన్ మఱిమించి క్లేశ హరణోపాయమ్ము లే దేదియున్ ;
వ్యవసాయ మ్మటు షడ్గుణమ్ము లవలన్ షట్కర్మ యోగమ్ము ల
య్యవి యేకాంతములేని కావు మఱి కావాత్యంతికోపాయముల్
భువి వైకల్యము లెక్కువై శ్రుతిపథమ్ముల్ ద్రొక్కరా వైన యా
చవులన్ మత్తిలి కర్మఠుల్ మఱచి నిన్ సాధింత్రు భ్రష్టస్థితిన్. ౫౪

నీలోకానకు మించి లోకమదియుం లేదెందునుం నిర్భయ
శ్రీలం ; రెండు పదార్థముల్ గడచి రాజీవోద్భవుండైనఁ దా
నాలక్షింపఁడు స్వస్థతం బెదరి కాలాత్ముండవౌ నీ, కథ
ర్మాళిం జీఁకటి క్రమ్ముడు నారకుల నేమందుం గృపాపూరసిం
ధూ ! లాలింపవె నన్నిఁకం గృపణబంధూ ! బంధముల్ ద్రెంపవే. ౫౫

ఈవేనౌటను బంధమోక్షములు లేనేలేవు నిక్కంబ ; మా
యావిద్యాతనుకల్పితమ్ములవి నా కా స్వప్న బోధాకృతిం ;
జీవన్ముక్తుఁడు బద్ధుఁడన్న యెడ నింతే భేదమౌ, బద్ధుఁడై
త్రావుం గర్మఫలమ్ము లం రసము వింతం దేవవృక్షమ్మునం
దావాసించి, విముక్తుఁ డవ్విధిని సేయం డైన స్వస్థుండగుం. ౫౬

జీవన్ముక్తత యిట్టిదంచు స్తుతులం జేయం ఫల మ్మే మహో !
భావ స్వచ్ఛత లేక యయ్యది యలభ్యం, మ్మాత్మ సంశోధనం
స్వావర్జ్యమ్మగు భక్తిచేఁ గలుగు, నీయందే సమస్తార్పణ
మ్మై వెల్గొందు నఖండ భక్తి నిడుమప్పా ! సద్గురూక్తి ప్రభా
వావిర్భూత భవత్ప్రబోధమతి నీపై నేన శేషించెదం. ౫౭

పరముం గొంద తెఱుంగలేర నిను శబ్దబ్రహ్మ పారీణులై ;
చిరకాల మ్మటు నిష్ఫ్రసూతియగు గో సేవన్ వృథా కష్టులౌ
దురు; సచ్చిన్మయమైన రూపమది యెందున్ జెప్ప వవ్వేదముల్ ;
పరమానంద రసావతార చరితల్ పాపాపహమ్ముల్ జగ
ద్వరణీయమ్ములఁ జెప్పవా శ్రుతులవాద మ్మొల్ల నేనంతగన్. ౯౫౮

నిను నే నెంతటివాఁడవో యెవఁడవో నీ తీరదేమో యెఱుం
గన, యట్లైన ననన్యభావమున నాకాంక్షింతు నీ సేవలన్
గన, నీ చిహ్నములూన, నీ చరణభక్తశ్రేణి సందర్శన
మ్మను సంస్పర్శన భాషణాదులు భవత్పూజాగతుల్ సన్నుతుల్
వినతుల్ ద్వద్గుణకర్మకీర్తనతతుల్ వేడ్కాతనా కెప్పుడున్. ౯౫౯

ఏమే మబ్బిన నీక యర్పితము తండ్రీ ! నీకె దాసుండ న
య్యా ! మీ యాలయ మార్జనాదుల మదీయాశ్రాంతకర్తవ్యముల్
సోమార్కాగ్ని ధరామరాదులను విష్ణున్ నిన్న దర్శింతు ; త్వ
త్ప్రేమార్ద్రిత్వము భక్తియోగ మది నా హృద్వీథి జాలెత్తుతన్. ౯౬౦

జప హోమ వ్రత దాన సాంఖ్య సుతపః స్వాధ్యాయ యోగమ్ములం
దపరిప్రాప్యము త్వత్సమైక్యము ; త్వదీయాసంగముం బొంది భ
క్తిపరీతల్ మును గోపికల్ వడసి రయ్యానందసాంద్రమ్ము బ్ర
హ్మపద, మ్మెందఱొ యుండ మెచ్చితివి నీ వా గోపికా భక్తినే ;
కృప నాభక్తి దృఢమ్ము సేసి సకలార్తిన్ బాపు కృష్ణప్రభూ ! ౯౬౧

## ౯౫. కైవల్య సిద్ధి

ఆదిన్ నీవు సమష్టి జీవమయమౌ హైరణ్యగర్భాత్మక
మ్మౌ దేహాన వసింతు జీవుఁడన మాయాకార్య సంఘాతివై;
మీఁదన్ సత్త్వ సమృద్ధి భక్తియనగం బెంపొందు నద్దాన; సం
ఛేదమ్ముం బొనరించి రెండు గుణముల్ ఛేదించి సత్త్వమ్ము, నా
పై దీపించెద వట్టి నీవ యయి నే వర్తింతు విశ్వోదయా! ౯౫-౨

అమరున్ సత్త్వము పొంగునన్ విషయసౌఖ్యమ్ముం దసద్దృష్టి, ల
భ్య మదెట్లో, విషయప్రవృత్తి యనివార్య మ్మప్పుడున్, దద్రజ
స్తమముల్ రేగినఁ జిత్తమున్ గుణములున్ సర్వమ్ము నన్యోన్య లి
ప్తము, లా కూటము నాప సాక్షివగు నీపై భక్తియే దిక్కు, ఈ
క్రమ మీ వుద్ధవు గూర్చి పల్కితివి మున్ కంజాక్ష! హంసాకృతిన్.

కానన్‌వచ్చును గర్మనిష్ఠుల కనేకశ్రేయముల్, దాన క్షు
ద్రానందమ్ము లనేకముల్ గతులయో! సాంతంబులౌ వారి, కి
ట్లే నీ మిత్రున కానతిచ్చితివి సామీ! భక్తి మేలంచు, భ
క్త్యానంద మ్మిది యెట్టులౌ విషయ భోగాసక్తులౌ వారికిన్? ౯౫-౪

నానాశాచ్యుతి భక్తిఁ దృప్తిఁ దిరుగన్ నానాశలున్ సౌఖ్య రూ
పానన్ దోపగ వాశ్చరంబులకు సర్వమ్మమ్మయమ్మట్టు, లా
హా! నాకమ్మును బ్రహ్మలోకమును హృద్యమ్మైన యోగైశ్వర
మ్మే నాసింపఁ డదుండనీ, వలచి రానీ ముక్తి యాశింపఁడున్. ౯౫-౫

నిను సేవించెడి భక్తుఁ డైంద్రియిక శాంతిన్ బాసి తా భోగ వా
సనలన్ బాధితుఁ డయ్యు లొంగఁ డచటన్ ; సద్భక్తి పైచేయిగాఁ
గననై యవ్విషయేచ్ఛ సన్నగిలు ; నిక్క మ్మగ్ని దారూత్కరం
బునటుల్ భక్తి దహించు పాపముల నిర్మూలమ్ముగా, నట్టి పా
వనభక్తిప్రభ ముం దిఁకెక్కడివియప్పా ! యింద్రియౌద్ధత్యముల్? ౯౬౬

ఆనందాశ్రువులన్ ద్రవద్ధృదయ రోమాంచాదులన్ లేక చి
త్తానన్ శుద్ధి యెటౌ ; దపస్సులును విద్యాబుద్ధులన్ భక్తి లే
దేనిన్ వ్యర్థమ ; త్వ త్కథాంజన మరీమృష్టంబయై యీ మనం
బానన్ గన్నటు తత్త్వసూక్ష్మమటు కాదభ్యస్త తర్కాదులన్. ౯౬౭

అనుసంధింతును నీదు ధ్యానము సమన్యస్తాంగ సిద్ధాసన
మ్మున, నాసాగ్ర నివిష్టదృష్టిఁ, బవనమ్మున్ బూరకాది క్రమ
మ్మున శోధించి, తలంచి చిత్త జలజమ్మున్ గ్రిందుగాఁ, గాడమీఁ
దనుగా నెంచి, రవీందు వహ్నులను సంధ్యానించి యా మీఁది చా
యను భావింతు సవారి వారిధర సుశ్యామాంగు నిన్ గోమలున్. ౯౬౮

అళినీలాలక కేశపాశుని లసద్వ్యాలోల నక్రాంక కుం
డలు నుద్యద్దరహాసశీతలు నఖండజ్యోతిమత్కౌస్తుభా
వలితోద్యద్వనమాలికాభరణు శ్రీవత్సాంకు నాజాను మం
జుల బాహుద్వయుఁ గోమలోదరుని విష్ణున్ స్వర్ణ పీతాంబరో
జ్జ్వలునిన్ స్నిగ్ధ మృదూరు నంబురుహ దీవ్యత్పాదు ని న్నెంచెదన్.

స్వాంత మ్ముప్విళులూర నిల్పుదు భవత్సర్వాంగసౌందర్య మం
దంతంతన్ మఱి మందహాస మధురమ్మౌ నీ ముఖాబ్జాన నే
కాంతారూఢ మొనర్చి చిత్తము విలీనావస్థమౌ దాని నే
నంతన్ గూరుతు సచ్చిదాత్మకమునం; దద్వైత భావమ్మునం
దంతంబై తలఁపుల్ గడింతు పలుమా రారూఢయోగ స్థితిన్. ౯౭౦

ఇటు నీ ధ్యాన సమాధిసిద్ధి యగునే నేమేమటంచున్ దమం
తట నయ్యోగ విభూతు లెల్ల వలచున్ ద్వత్ప్రాప్తి కభ్యంతర
మ్మటులౌ నా; కవి కోరఁ, గోరెదను బ్రహ్మానంద సంపూర్ణ నిన్
బటు తాప మ్మెడఁబాపి యేలర ననున్ వాతాలయాధీశ్వరా! ౯౭౧

## ౯౬. భగవద్విభూతి

పరమబ్రహ్మము నీవ దివ్యమహిమా! ప్రత్యక్ష మయ్యక్షరో
త్కరమం దీవ 'అ' కార; మీవ యవు దోంకారమ్ము మంత్రమ్ములన్,
దొరలందున్ మను వీవ; సన్మునులయందున్ నారదుండున్ భృగుం,
డరయన్ దానవులందు నీవగుదు ప్రహ్లాదుండ, వా పక్షులన్
గరుడుం, డా పశుకోటిలో సురభియున్, గన్గో ననంతుండ వ
య్యురగశ్రేణుల, గంగయున్ నదులలో నో విశ్వమూర్తీ! హరీ! ౯౭౨

బలి బ్రహ్మణ్యుల, యజ్ఞకోటి జపమున్, బార్థుండు వీరాగ్ర్యులన్,
బలమౌ దా బలవంతులందు, వెలుఁగై భాసింతు తేజస్వులం
దల భక్తావళి నుద్ధవుం డగుదు, లే దన్యమ్ము నీకంటె నె
వ్వలనన్, జీవుఁడును బ్రధానమును సర్వమ్మీవ విశ్వమ్మునన్. ౯౭౩

ధరవర్ణాశ్రమ ధర్మములా శ్రుతిపథోక్తమ్మెల్ల సద్భక్తిఁ ద్వ
త్పరులై చేయుచు లోవిరక్తి వికసింపన్ మెల్లనన్ త్యాగులై
హరి ! సత్తాస్ఫురణ ప్రియత్వములరూపై భిన్నదృశ్యమ్ములం
దరయన్ భిన్నముగాక మూలమయి విశ్వాశేషమూలమ్మనా
పరమమ్మౌ నిను గాంతు రచ్చము భవద్బ్రహ్మాత్మక జ్ఞానమున్. ౯౨౪

జ్ఞానమ్మున్ మఱి కర్మభక్తులు భవత్సంప్రాప్తికిన్ హేతువుల్ ;
జ్ఞానమ్మం దధికారు లెందు విషయేచ్ఛాశూన్యు ; లాసక్తులై
రో, నిన్గూర్చిన కర్మయోగమున కర్హుల్, నాతి సంసక్తు లా
హా ! నాత్యంత విరక్తు లర్హులు భవద్వ్యాసక్తు లాభక్తికిన్. ౯౨౫

జ్ఞానమ్మేనియు భక్తియే నవని లేశంబైన పుణ్యాననౌ,
నానాకష్టులు నారకుల్ జనన మిం దందంగఁ గాంక్షింతు ; రా
హా ! నాకబ్బె భవాబ్ధి పోతమగు దేహ మ్మిందు జన్మమ్ము న
న్నీ నావన్ గురునావికుం జలిపి నీవే వాటమౌ గాలివై,
పూనంగా నొక యొడ్డుఁజేర్పు పడవన్ బుణ్యానుకంపానిధీ ! ౯౨౬

అరయన్ గేవలబోధ లుబ్ధులు శ్రుతివ్యాసక్తి న్యాయోక్తులన్
బరమక్లేశత నెన్నొ జన్మములకున్ గాలించి గాలించి నిన్
బర మవ్యక్తము సిద్ధి నొందెదరు ; కర్మమ్మేని దూరమ్మ, య
ప్పరమ మ్మైనఫలాన ; భక్తియొకటే స్వాద్యంబ ఆమూల మో !
హరి ! త్వత్ప్రాపకమైన యోగమది నాకంతంతఁ బెంపొందుతన్. ౯౨౭

జ్ఞానార్థ మ్మతియత్నమున్ బలికె మున్ వ్యాసర్షి, యా బ్రహ్మ త
త్త్వానన్ బల్ శ్రవణమ్ము సేయుచు భవద్భక్తిన్ గతిన్ నమ్మినా౯
దేనిన్ దానన జీవముక్తియగు ; నింతే ధ్యానము౯ ; చంచలం
బౌ నీ చిత్తమునందు దుర్లభము, యభ్యాసాన శక్యమ్మ ; స్వా
ధీన మ్మౌనది నీకృపన్ మఱి భవద్దేదీప్యమానాకృతి౯. ౯౭౮

విషమ మ్మెంతయు౯ గర్మమార్గ, మట నిర్విణ్ణుండనై త్వత్కథా
సుషమ౯ శ్రద్ధవహించియున్, వలపు లెచ్చో వీడలేకుండి దు
ర్విష బుద్ధిన్ గనుచుండి వాని, మది ని౯ వేగట్టిగా౯గట్టి త్వ
ద్విషయమ్మౌ పటుభక్తి పెంతు, నెడలున్ వే సంగముల్ త్వత్స్మృతిన్.

మును విప్రుండు బహుశ్రమార్జితధనమ్ముల్ వాసి వైరాగ్యము౯
గనియున్ దుర్జన పీడ్యమాను౯డయి, యంతన్ గాలకర్మ గ్రహా
దినికాయమ్మును గాదు, గా దితర, మాధిన్‌గూర్చు నా చిత్తమే
యని యాలించి భవ ద్గుణమ్ములను దా, నన్నింటికిం గర్త వీ
వని శాంతింగని నిన్ను౯బొందె ; యిదు మప్పా! నాకు నా శాంతినే. ౯౮౦

ఐలుం డూర్వశి౯ జూచి మున్ వివశు౯డై యాసక్తి౯ బెక్కేడు లా
పై లక్షించి విరక్తి౯, దుచ్ఛసుఖమున్ వర్జించి, నీ భక్తి దా
నాలంబించి సుఖాన నుండెన౯ట, నాయం టెల్లనున్ ద్రోచి భ
క్త్యాళి౯ మౌళి నొనర్చు వాయుపుర దేవా! తీర్చు నా బాధలన్. ౯౮౧

## ౯౭. ఉత్తమభక్తి ప్రార్థన, మార్కండేయోపాఖ్యానము

జ్ఞాన శ్రద్ధలు కర్తయుఁ వసతియుఁ సౌఖ్యమ్ము నాహారక
ర్మానీక మ్మది భిన్నరూపమగుఁ, త్రైగుణ్యమ్మునఁ హీన మ
ధ్యానూనమ్ముగఁ; ద్వత్పదమ్ము భవదీయ క్షేత్రసేవాదిక
మ్మో నా నిర్గుణనిష్ఠ నట్టి పనిచే సిద్ధాత్ముఁ, డేనయ్యెదన్. ౯౭-౨

మనమున్ నిన్నునె చేర్చి, యెల్ల పనులన్ బాటించి నీకై, భవ
జ్జనముల్ వర్తిలు పుణ్యదేశముల హర్షస్ఫూర్తి వర్తించుచున్,
గని దొంగఁ దొర విప్రు జంతు వొక రేఖఁ, వీడి వైరమ్ముసూ
యను, మాన మ్మవమానముం దలఁగి, ని న్నర్చింతు భూతమ్ములఁ.

నీవై యీ సకలమ్ము దోఁచువరకున్ నిన్గొల్చి, యా యైక్యతా
భావోన్మేష మదైన వెంటనె భవద్భావుండనై యుండెదన్;
నీవెంటఁ మొదలైన ధర్మమున కెందే నాశమే లేదు, నీ
పై వాల్లభ్యము భక్తియోగమిది దేవా! యిమ్ము నా కెవ్విధిన్. ౯౭-౪

ఆరోగ్యమ్మును నాయువుఁ వలయునయ్యా! భక్తిదార్ఢ్యార్థ, మం
దారాధ్యమ్ము భవత్పదంబ యగు పా లట్లౌషధార్థంబ; దు
ర్వార మ్మల్పమటన్న యాయువున మార్కండేయుఁ డర్చించి ని
న్నారా! నీ భటకోటిచేఁ దరిమెఁగాదా! మృత్యు వద్దమ్మునన్. ౯౭-౫

★

# నారాయణీయము

## ద్వాదశ స్కంధము

ఆరంభించెఁ దపమ్ము త్వత్పరుఁ డతం డా పుష్పభద్రానదీ
తీరానన్, పరసౌఖ్యమొందె మనువుల్ దీరంగ నం దార్గురున్,
స్వారాజ్యేశుఁడు మోహపెట్ట నతనిన్, స్వర్వాసినీ ముఖ్య సం
భారమ్మున్ దహియించె యోగశిఖి, నెవ్వండోర్చు నీవారలన్ ! ౯౦౬

అట నారాయణుఁడీవు మున్నరసఖుండై వచ్చి తా చెంత; కు
త్కట తుష్టిన్ వినుతించి నీ వరములన్ గాంక్షింప కాతండు, నీ
పటుమాయన్ గనఁ గోరె భక్తి సుఖియై; భావింతు మాయావృతో
త్కట దుఃఖ మ్మెఱుఁగండు కావలయు నంతన్ గోరె నాశ్చర్యమై.

నీ వేగన్ జలిగాలి వీచి కురిసెన్ నీరంధ్ర గర్జా ఘన
ప్రావృణ్మేఘము లేడు వార్ధు లొకటై వర్తింప వర్షాయుతం;
బా వీథిన్ గనె దీనుఁడై వటదళవ్యాలోలు నాస్యాబ్జ హే
లా విన్యస్త పదాంగుళీకు నొక లీలాబాలు నిన్ శ్యాములన్. ౯౦౮

కని నిన్ మై పులకింప నేగి దరికిన్ గాంక్షించి మాటాడ బా
లుని శ్వాసానిలకోటిలో మునిఁగి, యా లోనన్ గనెన్ లోకముల్,
గనె నట్లే వెలిఁ ద్వత్కటాక్షములకున్ గమ్యుండునై పొంగుచున్
నిను దాఁ గౌగిటఁ జేర్పఁబోయి కనకేనిన్, నిల్చె మున్నట్లుగన్. ౯౦౯

గౌరిం గూడి తదగ్రమందు వెలసెన్ గౌరీశుఁడున్ ద్వత్కృపా
శ్రీరమ్యుం గని, యిచ్చె సిద్ధి యజరామృత్యుత్వ ముఖ్యస్థితిన్ ;
ఆ రీతిన్ స్మరవైరి ప్రీతుఁడగు నీదౌ సేవ, మూర్తిత్రయా
కారుం డీవ నియంత వెల్లరకు, వ్యక్తం బిద్ది యిప్పట్టునన్. ౯౯౦

త్ర్యవతారమ్మగు సత్యలోకమున నిట్లా బ్రహ్మ విష్ణ్వీశ లో
క విభాగ మ్మొకదానిపై నొకటిగాఁ గన్పట్టు ; నా మీఁద మా
య వికారమ్ముల కందనట్టి దయి యాహా ! వెల్గు వైకుంఠ, మం
దవభాసింతువు గోకులమ్మనను సత్త్వైకాకృతిన్ సచ్చిదే
క విశుద్ధంబగు బ్రహ్మభావమున నన్ గంజాక్ష ; పాలింపవే. ౯౯౧

## ౯౮. నిష్కల బ్రహ్మోపాసనము

ఎం దీ సర్వముదోఁచు, దేన నిది, తా నెందుండి, యెవ్వానిచే
నొందున్ బుట్టువు మున్నుగా, నది యెవండో యెవ్వఁ డుత్తీర్ణుఁడో,
యిం దెవ్వాని వెలుంగునన్ వెలుఁగునో యీ సర్వమున్ ధీవచ
స్పందోహానకు దూరదూరమగు నే సత్త్వస్వరూపమ్మ మౌ
నీందుల్ దేవత లెన్న లే రొరులమా చేలా ప్రభూ ! కృష్ణ ! యా
చందమ్మైన త్వదీయమూర్తి కిదె నా సాష్టాంగ భక్త్యానతుల్. ౯౯౨

లే వెవ్వానికి జన్మ కర్మ గుణముల్ నిక్కమ్ముగా, లోక ర
క్షావృత్తిన్ గొని మాయ నెవ్వఁడు స్వయ మ్మవ్వాని సేవించునో
యే వేసమ్ములు లేక వేసములు దా నెన్నేనియున్ వేయునో
యావేశించి యనేకశక్తుల స్వయ మ్మత్యద్భుతాత్ముండనన్
గైవల్యావసథం బఖండ పరమానంద ప్రపూర్ణమ్మ నా
శ్రీవిష్ణ్వాత్మక దివ్యమూర్తి కివె తండ్రీ ! నా నమోవాకముల్. ౯౯౩

కాదప్పా ! యిది పక్షియుఁ బశువునుఁ గా దౌర ! మర్త్యమ్మునుఁ
గాదే తాను సురాసుర మ్మబలయుఁ గా దన్న ! పుం రూపముఁ
కాదే ద్రవ్యము జాతియుఁ గుణములుఁ గారాదు దా సత్తస
త్తేదే శిష్టమగుఁ నిషేధమున నెంతే లక్షణావృత్తి ని
ర్భేదమ్మై వినివేద్య మ ప్పరసుఖావీతాత్మనిఁ ద్రొక్కెదఁ. ౯౯౪

కన బింబించియు మాయ, నమ్మహ దహంకారమ్ము తన్మాత్రలుఁ
గొని భూతమ్ముల నింద్రియమ్ముల జగత్కూటంబు సృష్టింతు వె
ల్లను స్వప్నాత్మక కల్పనమ్ము నవలీలఁ ద్రుంతు వా కాలశ
క్తిని దాబేలు పదమ్ములఁ ముడుచుస్ఫూర్తిఁ నిండ గాఢాంధకా
ర నికాయ ; మ్మీ వతమస్కుఁడై వెలిఁగెదౌరా నీకు నా యానతుల్.

ఒకనిఁ నిఁ సకలాత్మ సర్వగతులం దూహింపనౌ వాని స
ర్వకృతిఁ గాలము కర్మ మయ్యణువు శబ్ద బ్రహ్మమం చందు ; రూ
రక మూల ప్రకృతిఁ వికారముల నారంభింతు నీ చూపులో
నకలంక మ్మగు తత్త్వమీ వదియ కృష్ణా! నీకు నాయానతుల్. ౯౯౫

అనరా దున్నదటంచు ; లేదు ననరా ; దట్లేని లే దున్నదం
చనరా ; దెక్కడిదో యవిద్యయది నానానేకదృశ్యావభా
సనమౌ వేదలవాన నెవ్వనికృపాస్యందాన, దా విద్యయై
ఘన సంసార మహాటవీత్రుటన ఖడ్గమ్మౌనొ యా సర్వపూ
జ్యునికిన్ నీ కఖిలాత్మ కానతి కృపాశుంభత్కటాక్షోదయా ! ౯౯౬

నగలన్ స్వర్ణమటుల్, ఘటాదులయెడన్ మన్నట్లు, బ్రహ్మాత్మక
మ్మగు నీ రూపము గోచరించు జగమందన్నింటఁ దత్త్వమ్మన
చ్చుగఁ జూడంగల విగ్గు మెక్కువను, రజ్జు స్ఫూర్తి చీఁకట్లు పో
వగ నైనట్టులు జ్ఞానలాభమున సుస్పష్టమ్ముగాఁ దోఁచు నే
సొగ సా నీకిదె కృష్ణ! మత్కృతనమస్సుల్ ముక్తికాంతాప్రియా! ౯౯౮

అనయమ్మెవ్వనిభీతి సూర్యుఁడుదయమ్మౌ, వహ్నియున్ గాల్చు, న
య్యనిలుం డెప్పుడువీచు, బ్రహ్మముఖు లర్హమ్మైన పూజావిధం
బనుకాలమ్ము ఘటింతు, రెవ్వనిభయమ్మై స్వస్థతం గాంతు, రె
వ్వనిచేతన్ బదభంగముం గనెద రాపై; కృష్ణ! నిన్నట్టి వి
శ్వనియంతన్ వినుతించిమ్రొక్కెదఁ గృపాపారమ్ము శ్రీరమ్యునిన్. ౯౯౯

త్రైగుణ్యమ్మగు నాత్రిలోకమునకుం దా గర్తయై, త్ర్యక్షర
శ్రీగమ్యమ్మగు నొక్కయర్థమయి, యా త్రిశైక్య రూపమ్మునై,
వేగన్ త్రిక్రమణాక్రమత్త్రిజగమై, వేదత్రయోద్గీయమా
నాగణ్యాకృతియై, యుగత్రయజనివ్యాసక్తిఁ ద్రైకాలికా
యోగాభిన్నమునై త్ర్యవస్థమగు ని న్నూహింతు యోగత్రయిన్. ౧౦౦౦

అమరున్ సత్యము శుద్ధబుద్ధము నిరీహమ్మెందునున్ నిత్యము
క్తము నిర్ద్వంద్వము నిర్వికారము గుణోదారమ్ము నిర్మూలమున్
విమలం బున్నత సుప్రతిష్ఠ మగుచున్ నిస్సంగులౌవారి చి
త్తములం దెందు నపారదివ్య మహిమోదాత్తమ్మునౌ నీదునం
దము సర్వోన్నతమై వెలుంగు పరమానంద ప్రభాసాంద్రమై. ౧౦౦౧

వరషష్ట్యుత్తర తచ్ఛతత్రయ సుపర్వమ్మొచుఁ గ్రూరమ్ము దు
ర్భరవేగ మ్మది ద్వాదశారమగుచుఁ బర్వెత్తి లోకమ్ము లు
ద్ధురతన్ మ్రింగును గాలరూపమగుచున్ దోతెంచి నీ చక్ర మీ
శ్వర ! త్వద్దివ్యపదావలంబుఁడగు నన్ బాధింపదోఁగాత స
త్కరుణావారిధి ! యేలరా ! గురుపురోత్సంగాగ్రకేళీరతీ ! ౧౦౦౨

## ౯౯. భగవన్మహిమ

ఎవఁ డెన్నంగలఁడయ్య విష్ణుమహిమల్ ; ఎవ్వండు లెక్కించు ని
య్యవనీరేణువు లేత్రిపాదమితిచే నాపూర్ణ సంపత్సము
త్సవముల్ ముజ్జగముల్ ధరించు నెవఁ డీ సర్వమ్ము, న ద్దేవు ది
వ్య విలాసమ్మగు ధామ మేగెద, నెటన్ భక్తాళి యానంద సం
వివశమ్మై నెచటన్ బరామృతరసోద్వేల్లద్ఝురుల్ జాల్కొనున్.

ఆద్యున్ విష్ణు నశేషకర్తను సమగ్రైశ్వర్య సమ్రాట్టు ధీ
వేద్యున్ నిత్య వినూతనున్ దలఁచి తా వేల్చున్ మఖమ్మందు, నై
వేద్యాదుల్ మఱి భక్తుఁ డెవ్వఁ డొసఁగున్ వేడ్కన్, నుతుల్ సేయుఁ గృ
ష్ణాద్యమ్మౌ నవతార దివ్యచరిత మ్మానంద సంపూర్ణుఁడై
హృద్యశ్రీ పరిపూర్ణుఁడై తుద కతం డేగున్ భవత్ స్థానమున్. ౧౦౦౪

కవిరాజుల్ ! స్తుతిపాఠకుల్ ! తెలియుఁడీ గంభీర వేదార్థ సా
ర విశేషమ్ములు పాడుఁ డీశు నవతారవ్యక్త లీలా కథా
స్తవముల్, విష్ణు ననంత నామము లనంత శ్రీ నిధానమ్ము ; లే
నవి విష్ణూ ! వినుతించి పొందెదఁ ద్వదీయాఖండ విజ్ఞానమున్. ౧౦౦౫

మనమం దెప్పుడు విష్ణు దివ్య చరితం భావింపుఁ డే లీలలన్
మును ధర్మమ్ముఁ బ్రతిష్ఠసేసె హరి యింద్రున్ క్షేమసంపన్ను జే
సెను భృత్యుండయి యాప్త మిత్రుఁడయి, మున్ సిద్ధుల్ మహాయోగు లే
యనఘ స్థానము జాగరూకులయి బ్రహ్మణ్యు ల్నిరూపించిరో. ౧౦౦౬

ఎవఁడేఁ బుట్టినవాఁడు పుట్టఁగలవా డిందాక నీదౌ ప్రభా
వ విశేషమ్ము నెఱుంగఁ డింతయని ; యప్పా ! నాకు శ్రేయస్కర
మ్మవునంచున్ భవదీయ నామముల నే యశ్రాంతమున్ బాడెదన్,
భువనాతీతమునౌ వికుంఠ పదవిన్ బొల్పొందు ని న్నెన్నెదన్. ౧౦౦౭

ఆపమ్ముల్ దొలిసృష్టి మోచినవి ని న్నాత్మీయ గర్భమ్మునం,
దాపై నన్ జలశాయి ! నీయెడన యైక్య మ్మొందె జీవాళి, దే
వా ! పద్మ మ్మజ ! నీదు బొడ్డున నభివ్యక్తమ్ము నయ్యెన్ జగ
ద్రూపమ్మై కనకాద్రి కర్ణికమునై రూపింప దిక్పత్రమై. ౧౦౦౮

శ్రీ విష్ణుండ సృజించె నీ భువనముల్ ; చింతింప రీమాట, మీ
లో వర్తించుచు లోపలన్ వెలిని వెల్గున్ విష్ణురూప మ్మదే ;
జీవున్ మంచటు మాయగ్రమ్మ మది నిస్సీ ! నామరూమ్ములన్
వే వెట్టింబడి ప్రాణమందుగల తీపిన్ మందులై పొందు య
జ్ఞావేశాన, ముకుందు పైఁగలుగ దాహా ! యిచ్ఛ యెన్నాళ్ళకున్. ౧౦౦౯

వేవేల్ శీర్షము లక్షులున్ జరణముల్ వెల్గొందగా నిండితీ
వీ విశ్వమ్ము, నతిక్రమించియును స్వామీ ! హృద్గుహన్ సూక్ష్మమౌ
తావందుందువు భూతభవ్యములనంతా ! నీవ దేహేంద్రి యా
ద్యావిష్టుండయి నీవ క్రోలెదవు బ్రహ్మానంద ముప్పొంగఁగన్. ౧౦౧౦

అదియున్ నీ మహిమమ్మకాక మఱియేమౌ నా త్రిలోకాత్మకం
బడె రూపుంగొని దానినిన్ గడచి దివ్యజ్ఞాన రూపైక సం
పద నీ పాద మొకండ యీ జగము లప్పా! మూడు పాదమ్ము లా
ప్పిదమౌ నయ్యమృతాత్మక మ్మవల ; నా వెల్గున్ నినున్ మ్రొక్కెదన్.

అది యవ్యక్తము నీదురూప మధిగమ్య మ్మంతలోఁ గాదు ; ఇ
య్యదియే వ్యక్తము శుద్ధసత్త్వ మమృతోద్యద్వార్ధి కల్లోల సం
పద ముత్కృష్ట మభీష్ట మంచితగుణ స్వాదుత్వ ధీ మోహన
మ్మది నీ మూర్తిని గొల్తుఁ బావనపురాధీశా ! ననున్ బ్రోవుమా !

## ౧౦౦. సాక్షాత్కారము, కేశాదిపాదవర్ణనము

కనుచున్నా నదిగో కలాయ సుమరేఖా కోమలమ్మైన వె
ల్గును బీయూషరసాప్లుతుండనయి యాలో దివ్య కైశోరమూ
ర్తిని శ్రీనారదముఖ్యు లయ్యుపనిష చ్ఛ్రీ సుందరీబృందముల్
వినుత బ్రహ్మసుఖానుభూతిఁ బులకల్నిండారు నెమ్మేనులన్
దనచుట్టున్ గొలువన్ జెలంగు నుదయత్తారుణ్యలావణ్యునిన్. ౧౦౧౩

ఘననీలప్రభ నుంగరా ల్దిరిగి చక్కన్ జిక్కువో దువ్వి నిం
చిన యక్కొండెసిగన్ గనన్నవమణి శ్రీమత్కిరీటమ్ము సం
తనగాఁ జెర్విన నెమ్మిపించియము మందారస్రగాబద్ధమై
యనువౌ నీకబరీభరమ్ము మఱి నీదౌ ఫాల బాలేందుపీ
ఠిని దర్శించుచునుంటి శ్వేతతర తత్స్నిగ్ధోర్ధ్వపుండ్రద్యుతిన్. ౧౦౧౪

కరుణాపూర్ణ సుధార్ణవోచ్చలదభంగ భ్రూలతాభంగసుం
దర మానీలసుపక్ష్మచారువగు నేత్రద్వంద్వ మాముగ్ధతా
రరుచిస్మేర ముదారవారిజదళారమ్యమ్ము సారింపు ని
ర్భరకారుణ్యరసాతిశీతలితవిశ్వ మ్మీయనాథాత్మపై. ౧౦౧౫

ఉల్లాసోన్నతనాసమై హరిమణిప్రోల్లాస గండస్థలో
ద్యల్లాస్య శ్రుతిపాశసంగి మకరోద్యత్కుండలాదీప్రమై
వేల్ల ద్దంతరుచిన్ నవారుణవిభా స్ఫీతాధరాంతః కృపా
కల్లోలస్మిత శీతలాననము నా కన్దోయి రంజిల్లుతన్. ౧౦౧౬

వలితోద్యన్నవరత్న దివ్య వలయ వ్యాలోల బాహుద్వయిన్
గలితాతామ్ర కరప్రవాళముఖ రింఖ త్తన్నఖ జ్యోతులన్
విలసత్స్వాంగుళిసంగశారమగు క్రోవిన్ మోవి నానించి, శీ
తలితాశేష జగత్కదంబమగు శబ్దబ్రహ్మపీయూష ధా
రల నస్మచ్ఛ్రుతి వీథులం దడుపరా రామామనోమోహనా! ౧౦౧౭

చెలువౌ కౌస్తుభరత్నరాగ ముబుకన్ శ్రీనించు కంఠమ్ము, రం
జిలు శ్రీవత్స మురమ్మునన్ దరళిత శ్రీహారముల్ వానిచా
యల నానారుచి పుష్పపల్లవ కదంబాలంబ రోలంబ స
ల్లలిత మ్మవ్వనమాల నీదు మణిమాలన్ గృష్ణ! భావించెదన్. ౧౦౧౮

నానాలోకము లంగరాగ విసర న్నవ్యప్రభా సౌరభ
శ్రీ నాకర్షణ సేయుచున్ జగము కుక్షిందాల్చియుంగూడ యెం
తేనిన్ జిక్కిన మధ్యవల్లియునునై యింద్రాశ్మ జాంబూనదం
బో నావర్తిలు పీతచేల మొరపౌ నొయ్యారి ధ్యానింతు నా
లీనశ్రీరశనా లలన్మణిగణ క్లింకింకిణీ నిక్వణున్. ౧౦౧౯

పరశోభాయుతిఁ జారు లూరువు లహో పద్మామనః పశ్యతో
హరముల్ లోకము క్షోభపెట్టునని కాదా పీత చేలావృతిన్
బొరసెన్ ; నఖములకున్ బరార్థముల మున్నుంచు మేల్రత్నపుం
బరణుల్ జానువు లెంచెదన్, గ్రమపృథుత్వ శ్రీకముల్ జంఘలున్.

గురుమంజు శ్రుతులన్, బదాగ్రభజనన్ గొండాడు మంజీరమున్
బరమభ్రాంతి నిమజ్జ దానత జన ప్రవ్యక్తధీమంద రో
ద్ధరణ ప్రౌఢము కూర్మమూర్తి ప్రపద, మ్మాతామ్రరోచిర్నఖ
స్ఫురితేందుప్రభ నాశ్రితార్తితమమున్ బోకార్చు కల్యాణ సం
భరిత మ్మాకలిత మ్మొనర్తును భవత్పాదాంగుళీ సంతతిన్. ౧౦౨౧

నిరతిన్ యోగులకుం ద్వదంగతతి నెంతేఁ దియ్యనై ముక్తిమం
దిరమై భక్తుల కోర్కులన్ గురియుచో నీ పాదమూలమ్ము స్వ
స్తరుపాళిన్ జిగురౌచుఁ గృష్ణ! వెతయంతన్ బాపి నాభావ మం
దరుణజ్యోతి స్ఫురించి కూరుచుత బ్రహ్మానంద రాజ్యేందిరన్. ౧౦౨౨

అరయ న్నేరక నీ మహత్త్వ మెదియే నన్నానొ విశ్వేశ! య
ప్పురుషమ్ముల్ క్షమియింపు నీ కరుణకుం బాత్ర మ్మగుంగాత! త్వ
త్పర మీ వాక్కు పరస్సహస్ర కృతి శ్రౌతస్ఫూర్తి స్తుత్యస్తుతిన్
బరమమ్మై యవతార దివ్యచరితన్ నారాయణీయ మ్మనన్
కురుతా మాయురనామయం కృతిరియంవో బ్రహ్మవిద్యాం శ్రియమ్.

శ్రీ శ్రీ శ్రీ

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ! నమోఽస్తు తే.

# మంగళాష్టకము

అమరగ హేమలంబి శరదాశ్వయుజోదిత కృష్ణపక్ష పం
చమి రవివాసరమ్మునను శౌరి! భవజ్జననర్క్ష పుణ్య ల
గ్నమున గ్రహించి మా సుకృతి కన్యను గౌఁగిటఁ జేర్చికొన్న యం
దము మురిపించినావు, కని ధన్యుల మైతిమి రుక్మిణీప్రియా!

ఒకవంక శ్రుతిఘోష మొకట మంగళదివ్య వాద్య ఘోషమ్ములు పరిఢవిల్ల
నొకవంక మళయాళ సుకవి విద్వద్భక్త తతులెల్ల వంది బృందమ్ముగాగ
నొకవంక రాష్ట్రపాలకులు, రక్షకభట ద్విరదకోటులు బరాబరులుసేయ
నొకవంక పుణ్యాంగ నోదారబాలకోకిల గాన కలకలమ్ములు నెలంగ

రమణ స్నాతానులిప్తులై రామకృష్ణ
పుణ్యదంపతులున్ బాబు ముద్దులాడి
యెత్తికొనిరాఁగఁ, గృతికన్య నేనుబూని
తమ్ముఁడున్ దోడరా నాలయమ్ముఁ జేర.

చెంగట మ్రోసె ఘంట లభిజిత్సమయమ్మున నంత నాలయ
ప్రాంగణమందు నిల్చి, యిభరాజముఖున్ భజియించి, నేనునున్
మంగళవాద్యఘోష ముఖమండపమందుఁ గృతిం బఠింప, ను
ప్పొంగుచు రామకృష్ణులు ప్రభున్ వినుతించిరి పద్యభంగిమన్.

లాలితరీతి మమ్ముల నలంకృతులన్ బొనరించి మెచ్చి తాం
బూలము నూత్నవస్త్రము లమూల్యములున్ మఱి సొమ్ము లిచ్చి సు
శ్రీ లలరించి బంగరు జరీ గల శాలువ, లిచ్చిరంత, దే
వాలయ ధర్మకర్తయును, నాత్మవిభుత్వము వేలొసంగగన్.

శ్రీయుత కామకోటిగురుశేఖర దత్త కటాక్ష వీక్షణ
శ్రీయుత సుప్రసాదమది కృష్ణకవీంద్రులు దెచ్చి యీయ, "కృ
ష్ణాయ నమః పరాయ" యని సారెకు భక్తులు గొల్వ మత్కృతి
శ్రీ యొసగంగఁ గంటి మటుసేరి భవచ్చరణాబ్జ సన్నిధిన్.

ఇచ్చిన యాక్షణమ్మ గ్రహియించి తటాలునఁ దల్పుమూసి నీ
వచ్చఁపుఁబ్రేమ మాకృతి రమాధిప! కౌగిటఁ జేర్చికొంటి, మా
ముచ్చటదీరె మాసుకృతముల్ ఫలియించె, నశేషవిశ్వమున్
నిచ్చలు నీ కటాక్షరుచి నించుత భక్తిరమానుభూతులన్.

భాగవత భవ్య సామ్రాజ్య పదవినిచ్చి
భక్తికవితావిపాక సంపదల నొసఁగి
కృతుల శ్రీరామకృష్ణ దంపతుల నత్త
వారి మా బాబు పుత్రుల బంధుమిత్ర
కోటిఁ గవికోటి కృష్ణ! యేల్కొనర నీవు.

మంగళం రుక్మిణీ మాధుర్య ధుర్యాయ మంగళం గోపాలమణివరాయ
మంగళం శ్రీ పద్మమాలికా కౌస్తుభాభరణాయ రాధికా వల్లభాయ
మంగళం మానినీ మదనాయ శార్ఙ్గిణే మంగళం గోపికా సంగతాయ
మంగళం గురువాయు మందిరావాసాయ మంగళం భక్త హృన్మందిరాయ

మంగళం కేరళాధీశ మహిత రామ
కృష్ణశుభదంపతీ శిశు శ్రీకరాయ
మంగళం దీక్షితస్తుతి మంగళాయ
మంగళం సర్వమంగళ మంగళాయ.

---

# నారాయణీయములో
# సవరణలు

## గ్రంథప్రారంభములో

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 9 | తగవసిష్ఠుండు | శ్రీవసిష్ఠుండు |
| 17 | 3 | యపలాపించితి... | యపలాపింపక యాలపించితిఁ దదీ యార్థమ్ము |
| 22 | 20 | దాటి తరించె | దాఁటె తలంచి |
| 23 | 3,4 | మా,నన | మొం, దను |

## గ్రంథములో

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 23 | 5 | అతఁడొకనూరుదివ్యసమ | అతఁడొక నూరువత్సరము |
| 38 | 13 | ఆచోటువాసి...వీథుల, | ఆచితపుణ్యమాబదరి కాశ్రమ వీథిని |
| 41 | 6 | నక్కుడు | కౌనను |
| 53 | 4 | యొండు నెడఁ | యొండొకచో |
| 53 | 12 | దోడుగాగఁ గొడుకందలి | దోడుగాఁ గొడుకునందలి |
| 56 | 9 | నంగిరస్సుతో | నంగిరుండునన్ |
| 61 | 14 | మారభింప | కంగవింప |
| 61 | 17 | మాంసవసావపా | మాంసవసాశిరా |
| 66 | 11 | మతి తాల్చినావు | దనుపూనినావు |
| 68 | 18 | వరమాలాకర | వరమాలాంతర |
| 70 | 16 | మన్నదా...నడఁ | మన్నయంతకు నొయ్యారముగన్ సుధ వోసినావటన్ |
| 84 | 12 | చల్వచే వారి! | గాలి చల్వకున్ |
| 85 | 6 | వే | లీ |

శ్రీయుత కామకోటిగురుశేఖర దత్త కటాక్ష వీక్షణ
శ్రీయుత సుప్రసాదమది కృష్ణకవీంద్రులు దెచ్చి యీయ, "కృ
ష్ణాయ నమః పరాయ" యని సారెకు భక్తులు గొల్వ మత్కృతి
శ్రీ యొసగంగఁ గంటి మటుసేరి భవచ్చరణాబ్జ సన్నిధిన్.

ఇచ్చిన యాక్షణమ్మ గ్రహియించి తటాలునఁ దల్పుమూసి నీ
వచ్చఁపుఁబ్రేమ మాకృతి రమాధిప! కౌగిటఁ జేర్చికొంటి, మా
ముచ్చటదీరె మాసుకృతముల్ ఫలియించె, నశేషవిశ్వమున్
నిచ్చలు నీ కటాక్షరుచి నించుత భక్తిరమానుభూతులన్.

భాగవత భవ్య సామ్రాజ్య పదవినిచ్చి
భక్తికవితావిపాక సంపదల నొసఁగి
కృతుల శ్రీరామకృష్ణ దంపతుల నత్త
వారి మా బాబు పుత్రుల బంధుమిత్ర
కోటిఁ గవికోటి కృష్ణ! యేల్కొనర నీవు.

మంగళం రుక్మిణీ మాధుర్య ధుర్యాయ మంగళం గోపాలమణివరాయ
మంగళం శ్రీ పద్మమాలికా కౌస్తుభాభరణాయ రాధికా వల్లభాయ
మంగళం మానినీ మదనాయ శార్ఙ్గిణే మంగళం గోపికా సంగతాయ
మంగళం గురువాయు మందిరావాసాయ మంగళం భక్త హృన్మందిరాయ
మంగళం కేరళాధీశ మహిత రామ
కృష్ణశుభదంపతీ శివ శ్రీకరాయ
మంగళం దీక్షితస్తుతి మంగళాయ
మంగళం సర్వమంగళ మంగళాయ.

---

# నారాయణీయములో సవరణలు

## గ్రంథ ప్రారంభములో

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 9 | తగవసిష్ఠుండు | శ్రీవసిష్ఠుండు |
| 17 | 3 | యపలాపించితి... | యపలాపింపక యాలపించితిఁ దదీ యార్థము |
| 22 | 20 | దాటి తరించే | దాటె తలంచి |
| 23 | 3,4 | మ్రా,నన | మొ౦, దను |

## గ్రంథములో

| | | | |
|---|---|---|---|
| 23 | 5 | అతఁడొకనూరుదివ్యసమ | అతఁడొక నూరువత్సరము |
| 38 | 13 | ఆచోటువాని...వీథుల, | ఆచితపుణ్యామాబదరి కాశ్రమ వీథిని |
| 41 | 6 | నక్కడు | కొనను |
| 53 | 4 | యొందునెడక | యొండొకచో |
| 53 | 12 | దోడుగాగఁ గొడుకందలి | దోడుగాఁ గొడుకునందలి |
| 56 | 9 | నంగిరస్సుతో | నంగిరుండునున్ |
| 61 | 14 | మారభింప | కంగవింప |
| 61 | 17 | మాంసవసావపా | మాంసవసాశిరా |
| 66 | 11 | మతి తాల్చినావు | దనుపూనినావు |
| 68 | 18 | వరమాలాకర | వరమాలాంతర |
| 70 | 16 | మన్నదా...నడక | మన్నయంతను నొయారముగన్ సుధ వోసినావటన్ |
| 84 | 12 | చల్వచే హరీ! | గాలి చల్వకున్ |
| 85 | 6 | చే | లీఁ |

| | | | |
|---|---|---|---|
| 85 | 7 | లనొ | లను |
| 85 | 7 | శితో | శియున్ |
| 85 | 8 | నన | జన |
| 89 | 8 | వసుదేవదేవకులకు౯ | వసుదేవు దేవకిఁగొనన్ |

95 ౪౦౭ పద్యము తరువాత

శంకింప కంకమెక్కి వి
షాంకమ్మగు తత్కుచమ్ము నామ్రఫలమ్మ
ట్లంకించి కుడిచితివి శిశు
సంకటకారిణి యటంచు చలమూని హరీ!

97 ౪౧౭ పద్యము, తరువాత

బాలుని చూడ్కి నాపయిని బ్రాలెడు నెప్పుడుఁజూడుముద్దుగో
పాలుఁడు నవ్వు నన్నెకని! పాపఁడ! రాయిటు రారయంచు గో
పాలకులాంగనామణులు బాహువు లల్లనసాచినీకునై
హేలగనేమియేమి యొనరింపరు ముద్దులు ముచ్చటల్ హరీ!

| | | | |
|---|---|---|---|
| 100 | 7 | జేర్చినందుఁడ | నందుడందన |
| 100 | 8 | బ్రమ్మగు | వ్యమ్మగు |
| 100 | 8 | బడసి | బడసె నమ్మొయి |
| 101 | 3 | నుంచి...లిడ్డుర | పయినొయ్యన డించి మహా ద్భుతమ్మిదే |
| | | మ్మొకొ,...నొక్కడ... | మొకొ..నుండెను దానిలు |
| | | చుండగ౯ | దీర్చుతొందరన్ |
| 104 | 7 | బాపరక్షక | బాపకర్షక |

116 ౪౯ పద్యము తరువాత

ఆవులు సంచరింపఁదగు నావనసీమల కేగి మందలన్
గావగ వేడ్కఁబూని జతగాండ్రను గూడుక రాముతోడనా
నావిధ లీలలన్ మఱగినాఁడవు వాయుపురాధినాథ ! నన్
బ్రోవర నాదురంత భవరోగ మడంచి యకించనప్రియా !

122 ౧౨౧ వ పద్యముగా :

ఈ విధమై క్షణక్షణము హెచ్చిన హర్షముతో నశేషగో
పావళి లాలనం బడిసి యందరు నీవగుచున్ నటించు నీ
భావము నొక్క వత్సరము పై బలరాముఁడెఱుంగ నేర్చె నా
హా ! విలసించు బ్రహ్మమయులయ్యును మీయెడఁ
దారతమ్యముల్

124 ౧౩౧ వ పద్యము ౧౩౬ వ పద్యముగా చూచుకోవలెను.

127 పుట : ౧౧ దశకము, కాళియమర్దనము

తోటక వృత్తము

అల ఘోరతరమ్మగు నయ్యహి వ్యా
కులుఁ జేయగ నీవును ఘోరవిషా
గ్నుల మాడిన యాకులఁగూడిన యు
జ్జ్వల నీపము నెక్కితి సత్వర మే.

నవపల్లవ సుందర నవ్యపద
చ్ఛవి నించుచు నెక్కివెసన్ దరువున్
దవు దవ్వుల దూకితి దాన మహో
గ్రవిధిన్ దరగల్ గలగంబడగన్.

భువనత్రయమున్ మును బూనిన బ
ర్వావశమ్మయి యాకస మంటగ నం
బువు వెల్ల భువమ్మును ముంచెఁ ద దు
ద్భవభంగ సమూహ మభంగగతిన్.

నదినా సుడిగుండమునన్ ధ్వని య
న్నిదెసల్ నిగుడన్ భయ విస్తులమై
గదలెన్ మఱి యయ్యురగమ్మొద నె
మ్మది లేక గడుంగడు మచ్చరమై

తలలన్ బదివందల దారుణ వ
హ్నులురాల విషమ్ముల నోల్కొ నహిం
గలయం గనుగొంటి వగణ్య శిరః
కలితాంజనశైలము గన్నయటుల్

జ్వాలదక్షి వల ద్విష వహ్ని శిఖా
వళి యూర్పుల జిమ్ముచుఁ బాము మహా
బలు గాటిడె నిన్ బగఁబట్టి వడిన్
నిలు వెల్లను జుట్టుకొనెన్ బెలుచన్.

దరి నిల్చిరి నీదరి దాకక యం
దరు మందలుఁగుందుచు దారి గృహాం
తర సీమ నిమిత్త మదాంత శుభే
తరముం గని చిత్తము తత్తరిలన్

త్వరగాఁజని గోపక వర్గ మహో
హరి ! ప్రాణము లిత్తు మటన్నఁగృపా
స్ఫురణన్• ఫణి బంధనమున్ విడి యీ
శ్వర ! నవ్వుచు వేగమ వచ్చితటన్
ఫణిరాజ ఫణోజ్వల పాదరణ
న్మణినూపుర కింకిణి మంజుల స
న్మణి కంకణ సంక్వణనమ్మగుధో
రణి నర్తన మాడితి రక్తి మెయిన్
వ్రజ వాసులు పొంగిరి భక్తముని
వ్రజ మెల్లరు నిన్ మది బాడిరి ద్యో
ప్రజ పూవులు నించిరి వాతపతీ !
త్రిజగన్నట శేఖర ! తేర్చు ననున్.

| | | | |
|---|---|---|---|
| 130 | 1 | కుండల మండలమ్ము | కుండలమండనమ్ము |
| ,, | 5 | తలయందం దది | తల లంతంతట |
| 140 | 9 | దెయ్యది | దేయది |
| ,, | 20 | గారరసో......టన్ | గారరసోల్బణంబుగ నొకా నొకమాట యొసంగినావటన్ |
| 743 | 8,8 | క. వ్వారల... | కై. వారలఁ బంపినాఁడవట |
| 146 | 5 | రాళ్లకుఁ | వ్రేటులన్ |
| ,, | 10 | వ్వాలనునఁ బాపునట్టి | వ్వాలన హరించునట్టి |
| 155 | | ౬౩౨ పద్యము మార్చు | |

చెలియా! చూచితె పంకజాక్షుఁ డడుగో చేఁజిక్కె నాముందరే
కలడంచున్ నిను భావనా పథమునన్ గంజాక్షి యీక్షించి య
గ్గలమా తాపము నించెనిచ్చెలుల కాకాంక్షించి శూన్యమ్మునన్
కెలువల్ నీకయి యంగలార్చి మరి యన్వేషించి ఘోషింపఁగ

| | | | |
|---|---|---|---|
| 156 | 7 | మిక్కిలిగ | సంతతము |
| 156 | 8 | నాపరితాపమార్పవే | నావలవంత దీర్పవే |
| 158 | 7 | రమ్య | భవ్య |
| 158 | 14 | రేఖికా | చిత్రిత |
| 159 | 4 | జరియించి... | మురిపించి |
| ,, | 18 | నిల్చె......కొని | నిన్ను దానొరసి |
| | ,, | | నిల్చి మైమఱచె నొర్తుకె |
| ,, | 20 | శ్రీవిలాసయై | శ్రీవిలాసయయి |
| 159 | 3 | యున్మదము చొక్కి... నిందిరా | మైమఱపు నిందిరా హృదయమందిరా |
| | 4 | శ్రాంత...... | శ్రాంత విహృతి విశ్రాంతి సుందరుని రాసకేళి యదునందనున్ |
| 159 | 6 | మఱిసేసి......రా | మఱి నృత్యమాత్ర మొనరించి రంగన నెఱుంగరు |
| 159 | 7 | నీవియుఙ్...యుఙ్ | వేగమంబెడలు వేణియున్ విరిసి వీడు పోకముడి పైకయున్ |
| 160 | 11 | మాన్మథోత్సవ...రూ | న్మాదలందరికనంగవైభవ మొనర్చెనా వొకరి కొక్కరూ |
| ,, | 16 | వోకించుకై | వోకింతగా |
| 167 | 4 | రావాటమున్ | రాళిందమున్ |
| 172 | 3 | మ్మవ్విలున్ | మ్మైన విల్ |
| 122 | 16 | సీమన్ హారీ ! | రంగస్థలిఙ్ |
| 186 | 10 | లక్కయిల్...... | లక్కయింట జనుతీరు గ్రహించియ నీవు నేగినఙ్ |

| | | | |
|---|---|---|---|
| ,, | 12 | కూర్చి | కూల్చి |
| ,, | | ౧౧౭ తర్వాత నీపద్యము చేర్చునది. | |

పొక్కుచు సత్యభామ కురుభూములకుం జనుదేర నామెలో
నెక్కొను కుందు వాయ, ఖలునిన్ శతధన్వుని గూల్చినాఁడ పీ
వక్కడ రత్నమున్నదని నట్టుల; రాముఁడుఁగాంచి మైథిలున్
మక్కువతో గదాయుధ సమర్థుని జేసెను గౌరవేశ్వరున్.

| | | | |
|---|---|---|---|
| 190 | 9 | కన్యాలలా | బాణకన్యవ్ బిరా |
| | 10 | మ...... | న |
| 194 | 10 | యముదావశిఖిం...యగ్ని | యము, నాడుదవాగ్ని నిర్మింగి, |
| 191 | | దొంగిలింప | దొంగిలించి |
| 195 | | ౧౫౦ తరువాత నీపద్యము చేర్చునది. | |

చీటికి మాటికిన్ గలిగెఁ జేడియ! మా కరికోటితోడి పో
రాటము; లందుచే నిటకు రాక గడుందండవయ్యె నన్యథా
బోటి! తలంపఁబోకుమని పూని కవుంగిటఁ జేర్చ రాధ య
ప్పాటన లీనయయ్యెను భవత్పరమాద్భుతచిద్ర సాకృతిన్,

| | | | |
|---|---|---|---|
| 204 | 8 | దనయుండ్రడి | దనయుల్ పో |
| 206 | 8 | నన్నట్టిపాన | నన్నట్టి నెపాన |
| 237 | 12 | జేరి | జేర |
| 237 | 29 | లాదరించి | లిచ్చిరంత |
| 237 | 20 | నందుఁ బ్ర... | నాత్మ వి... |
| 238 | 19 | తీశిశు | తిప్రజా |

# ఆర్ష భారతి ప్రచురణలు

వ్యవస్థాపకులు:

విద్వాన్, కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

దుర్గాగ్రహారము - విజయవాడ-2

1. నారాయణీయము. అన్ని లైబ్రరీలకు అప్రూవయినది. Vide. D. P. I. R.C. 287/ M 4/59. D/ 16–8–59. రు. 10–00

2. ఆంధ్రస్కాందము. భా 1. స్కాంద మహాపురాణమునకు తెలుగువచనము. రు. 5–00

3. శివత్రయి. 3 శివస్తుతులు. సంస్కృతము - తెలుగు పద్యములు. రు. 0–25

4. శివమానసపూజ. సదాశివ బ్రహ్మేంద్రుల సంస్కృత శ్లోకములు – తెలుగు పద్యములు. రు. 0–12

కలియుగ స్వరూపము :— వ్యాసులవారు 18 మహాపురాణములలో వర్ణించిన కలియుగ భవిష్యత్తు విశేషములు. (అచ్చగుచున్నది)

అశోక చరిత్రము. తెలుగు కావ్యము. రు. 5–00

కవిత్వవేది : శ్రీ K. వెంకటనారాయణరావు, M. A., Retd. D. E. O. గారు రచించినది. లైబ్రరీలకు అప్రూవ్ అయినది. D. P. I. 993/M. 4/59. D. 26–1–59.



# శుద్ధపత్రము

| పద్యము | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | | మంగళాచరణములో | |
| ౨౯ | 3 | చేనించిన మేలిసరులో | చేయించిన సరులలో |
| ౬౩ | 4 | తమ్ముండు నేనొక్కఁడై | నిష్ఠన్ తమ్ముఁడే నొక్కఁడై |
| | | గ్రంథభాగములో | |
| ౬౯ | 4 | గొనునట్టి దివ్య | గొనులక్ష్మియట్టి |
| ౨౫౩ | 3 | మహా | మహో |
| ౨౬౩ | 3 | రాజు | రాజ్య |
| ౨౭౭ | 4 | వైచె | వైచి |
| ౨౯౪ | 4 | బదింబడి | బదింబది |
| ౩౧౧ | 4 | చరణామృతాపపన | చ....ప్లవన |
| ౩౧౬ | 3 | సుపాద్యంబీయ | యు పాద్యంబీయ |
| ౩౫౧ | 4 | స్పద | స్పదు |
| ౩౫౬ | 4 | ఱెక్కల చల్వచే హరీ! | ఱెక్కల గాలి చల్వకున్ |
| ౩౬౯ | 2 | విగళచ్ఛస్త్రాస్త్రుఁడై | విగళద్బాణాళియై |
| ౩౮౭ | 2 | రంగతృప్తి | రంగత్తృప్తి |
| ౩౮౩ | 4 | భగ.........నెహరా | విలసద్భగవత్పదవాచ్య మాధవా! |
| ౩౯౬ | 2 | దటకున | దటుకున |
| ౪౦౦ | 1 | దపించ | దపించ (వేదా) కలాయ |
| ౪౦౮ | 3 | చదిచూపించెడు | చదిరా చూపెడు |
| ౪౧౩ | 1 | నీ వటు | ఈ వటు |
| ౪౨౬ | 2 | ముక్కుపచ్చలారని.... యిటాడె | రని.... కరమ్మిటులందురు |
| ౪౨౭ | 1 | చిన్న శిశు | చిన్ని శిశు |
| | 4 | ద బ్రమ్మగు... నమ్మెయి | దబ్రమ్మగు....వర్తిలె |
| ౪౨౯ | 3 | శుద్ధసత్వత్త్వ | శుద్ధసత్త్వ |
| ౪౩౦ | 4 | గురువాయ | గురువాయు |
| ౪౩౧ | 2 | భరియింపరాని బరువై | భరియింపరాని గరిమమ్మయి తోఁచిన |
| ౪౩౬ | 1 | పెదబొబ్బలెల్ల | పెదబొబ్బలెల్ల |

| | | | |
|---|---|---|---|
| ౪౪౮ | 1 | బంధుల | గోత్రము |
| ౪౯౪ | 2 | స్వాయంభువ | స్వాయంభవ |
| ౫౦౭ | 2 | విస్తరువై | విస్తరలై |
| ౫౧౦ | 2 | వట | తట |
| ౫౧౭ | 3 | బువ్వల నారగించు | బువ్వములారగించు |
| ౫౩౬ | 4 | వరణుడం | వరుణుఁడం |
| ౫౪౬ | 2 | నిచ్చట | నిచ్చలు |
| ౬౦౪ | 4 | వక్కొనమ్మకు | వక్కొన కొమ్మకు |
| ౬౦౭ | 4 | గారరసోచితమ్ము నొక్కమాట | గారసోక్తి రత్నమొకకాన్క |
| ౬౦౯ | 2 | శిశురుండ | శిశిరుండ |
| ౬౬౦ | 2 | దీనలయి కడుఁ గరుణా | దీనలయి చిక్కదయా |
| ౬౬౫ | 4 | పడఁతుల్ | ముదితల్ |
| ౬౭౧ | 1 | మా హృదయమ్ము దొంగ | మా హృదయైకచోరు |
| ౩౭౨ | 1 | నాముందటే | కానంగదే |
| ౬౭౩ | 1 | త్వద్యాన | త్వద్ధ్యాన |
| ౬౮౪ | 3 | బరనిష్ఠ | బరమనిష్ఠ |
| ౬౮౭ | 5 | మంజు | లక్ష్య |
| ౬౯౩ | 3 | మ్మంతు | మ్మింతు |
| ,, | ,, | చొక్కిపొంది | నిందుఁబొంది |
| ౬౯౫ | 1 | విరమించియా | విరమించితా |
| | 3 | మొనర్చి తొక్కొక్కరి | మొనర్చి యొక్కొక్కరి |
| ౬౯౬ | 3 | వనాంతలీల | వనంతలీల |
| ౬౯౭ | 4 | పాహెపాహె | పాహిపాహి |
| ౭౦౪ | 3 | పజ్కి | పజ్క్తి |
| ౭౨౧ | 1 | పున్మూర్తి | పుంమూర్తి |
| ౭౨౨ | 1 | సంస్పరమ్మునన్ | సంస్పర్శమ్మునన్ |
| ౭౪౫ | 4 | లేనయితినట్లు | లేనగుటనిట్లు |
| ౭౫౭ | 1 | డక్కసుండు | డక్కంసుండు |
| ౭౬౮ | 3 | చిరీతినా | చుందెల్పియా |

# నారాయణీయమ్

౧

సాన్ద్రానందావబోధాత్మక మనుపమితం దేశకాలావధిభ్యాం
నిర్ముక్తం నిత్యముక్తం నిగమశతసహస్రేణ నిర్భాస్యమానమ్
అస్పష్టం దృష్టమాత్రే పున రురుపురుషార్థాత్మకం బ్రహ్మతత్త్వం
తత్తావ ద్భాతి సాక్షా ద్గురుపవనపురే హంత భాగ్యం జనానామ్.

ఏవం దుర్లభ్య[1] వస్తున్యపి సులభతయా హస్తలబ్ధే యదన్య
త్తన్వా వాచా ధియా వా భజతి బత జనః క్షుద్రతైవ స్ఫుటేయమ్
ఏతే తావద్వయంతు స్థిరతరమనసా విశ్వపీడాపహత్యై
నిశ్శేషాత్మాన మేనం గురుపవనపురాధీశ మేవాశ్రయామః.

సత్త్వం యత్త త్పరాభ్యా మపరికలనతో నిర్మలం తేన తావద్
భూతై ర్భూతేంద్రియై స్తే వపురితి బహుశః శ్రూయతే వ్యాసవాక్యమ్
తత్స్వచ్ఛత్వా ద్యదచ్ఛాదిత పరసుఖచిద్గర్భ నిర్భాసరూపం
తస్మిన్ ధన్యా రమంతే శ్రుతిమతిమధురే సుగ్రహే విగ్రహే తే.

నిష్కంపే నిత్యపూర్ణే నిరవధి పరమానంద పీయూషరూపే
నిర్లీనానేకముక్తావలిసుభగతమే నిర్మలబ్రహ్మసింధౌ
కల్లోలోల్లాసతుల్యం ఖలు విమలతరం సత్త్వ మాహు స్తదాత్మా
కస్మా న్నో నిష్కళ స్త్వం సకళఇతి వచ స్త్వత్కలాస్వేవ భూమన్.

నిర్వ్యాపారోపి నిష్కారణ మజ భజసే యత్క్రియా మీక్షణాఖ్యాం
తేనై వోదేతి లీనాప్రకృతిరసతి[2] కల్పాపి కల్పాదికాలే
తస్యా స్సంశుద్ధమంశం కమపి తమతిరోధాయకం సత్త్వరూపం
స త్వం ధృత్వా దధాసి స్వమహిమవిభవాకుంఠవైకుంఠరూపమ్.

---

(1) దుర్లభ్య ఇత్యత్ర దుష్ప్రాప ఇతి పాఠో భవేత్. లేఖకప్రమాదాదాపతితోయం పాఠ ఇతి మన్యే. ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖలు. దుర్లభం, సులభం, ఈషల్లభం ఇత్యేవ భవతి.

(2) అసతికల్పాపి ఇత్యత్ర జీపో హ్రస్వత్వం చింత్యం.

తత్తే ప్రత్యగ్రధారాధరలలితకళా యావలీకేళికారం
లావణ్యస్యైకసారం సుకృతిజనదృశాం పూర్ణపుణ్యావతారం
లక్ష్మీనిశ్శంకలీలానిలయన మమృతస్యందసందోహమంత
స్సించత్ సంచింతకానాం వపు రనుకలయే మారుతాగారనాథ.

కష్టా తే సృష్టిచేష్టా బహుతరభవఖేదావహా జీవభాజా
మిత్యేవం పూర్వ మాలోచిత మజిత మయా నైవమద్యాభిజానే
నోచే జ్జీవాః కథంవా మధురతర మిదం త్వద్వపు శ్చిద్రసార్ద్రం
నేత్రైః శ్రోత్రైశ్చ పీత్వా పరమరససుధాంభోధిపూరే రమేరన్.

నమ్రాణాం సన్నిధత్తే సతతమపి పుర స్తై రనభ్యర్థితాన
ప్యర్థాన్ కామా నజస్రం వితరతి పరమానందసాంద్రాం గతిం చ
ఇత్థం నిశ్శేషలభ్యో నిరవధికఫలః పారిజాతో హరే త్వం
క్షుద్రం తం శక్రవాటీద్రుమ మభిలషతి వ్యర్థ మర్థివ్రజోయం.

కారుణ్యాత్ కామమన్యం దదతిఖలు పరే స్వాత్మద స్త్వం విశేషా
దైశ్వర్యా దీశతేన్యే జగతి పరజనే స్వాత్మనో పీశ్వర స్త్వమ్
త్వయ్యుచ్చై రారమంతి ప్రతిపదమధురే చేతనాస్స్ఫీతభాగ్యా
స్త్వంచాత్మారామఏవే త్యతులగుణగణాధార శౌరే నమస్తే.

ఐశ్వర్యం శంకరాదీశ్వరవినియమనం విశ్వతేజోహరాణాం
తేజస్సంహారివీర్యం విమలమపి యశో నిస్పృహైశ్చోపగీతమ్
అంగాసంగా సదాశ్రీ రఖిలవిదసి న క్వాపి తే సంగవార్తా
తద్వాతాగారవాసిన్ మురహర భగవచ్ఛబ్దముఖ్యాశ్రయోసి.

౨

సూర్యస్పర్ధికిరీట మూర్ధ్వతిలక ప్రోద్భాసి ఫాలాంతరం
కారుణ్యాకులనేత్ర మార్ద్రహసితోల్లాసం సునాసాపుటమ్
గండోద్యన్మకరాభకుండలయుగం కంఠోజ్జ్వలత్కౌస్తుభం
త్వద్రూపం వనమాల్యహారపటల శ్రీవత్సదీప్రం భజే.

కేయూరాంగదకంకణోత్తమ మహారత్నాంగులీయాంకిత
శ్రీమద్బాహుచతుష్కసంగత గదాశంఖారిపంకేరుహామ్
కాంచిత్ కాంచనకాంచిలాంచిత లసత్పీతాంబరాలంబినీ
మాలంబే విమలాంబుజద్యుతిపదాం మూర్తిం తవార్తిచ్ఛిదమ్.

యత్ త్రైలోక్యమహీయసోపి మహితం సమ్మోహనం మోహనాత్
కాంతం కాంతినిధానతోపి మధురం మాధుర్యధుర్యాదపి
సౌందర్యోత్తరతోపి సుందరతరం త్వద్రూప మాశ్చర్యతో
ప్యాశ్చర్యం భువనేన కస్య కుతుకం పుష్ణాతి విష్ణో విభో.

తత్తాదృఙ్మధురాత్మకం తవవపు స్సంప్రాప్య సంపన్మయీ
సా దేవీ పరమోత్సుకా చిరతరం నాస్తే స్వభక్తేష్వపి
తేనాస్యా బత కష్ట మచ్యుతవిభో త్వద్రూపమానోజ్ఞక
ప్రేమస్థైర్యమయా దచాపలబలా చ్చాపల్యవార్తోదభూత్.

లక్ష్మీ స్తావకరామణీయకహృతైవేయం పరేష్వస్థిరే
త్యస్మి న్నన్యదపి ప్రమాణ మధునా వక్ష్యామి లక్ష్మీపతే
యే త్వద్ ధ్యానగుణానుకీర్తనరసాసక్తా హి భక్తా జనా
స్తే ష్వేషా వసతి స్థిరైవ దయితప్రస్తావదత్తాదరా.

ఏవంభూతమనోజ్ఞతా నవసుధా నిష్యంద సందోహనం
త్వద్రూపం పరచిద్రసాయన మయం చేతోహరం శృణ్వతామ్
సద్యః ప్రేరయతే మతిం మదయతే రోమాంచయ త్యంగికం
వ్యాసించత్యపి శీతబాష్పవిసరై రానందమూర్చోద్భవైః.

ఏవంభూతతయా హి భక్త్యభిహితో యోగ స్స యోగద్వయాత్
కర్మజ్ఞానమయాద్ భృశోత్తరతరో యోగీశ్వరై ర్గీయతే
సౌందర్యైకరసాత్మకే త్వయి ఖలు ప్రేమప్రకర్షాత్మికా
భక్తి ర్నిఃశ్రమమేవ విశ్వపురుషై ర్లభ్యా రసావల్లభ.

నిష్కామం నియతస్వధర్మచరణం యత్కర్మయోగాభిధం
తద్దూరే త్యఫలం యదౌపనిషదజ్ఞానోపలభ్యం పునః

తత్త్వవ్యక్తతయా సుదుర్గమతరం చిత్తస్య తస్మాద్విభో
త్వద్రూపమాత్మకభక్తిరేవ సతతం స్వాదీయసీ శ్రేయసీ.

అత్యాయాసకరాణి కర్మపటలా న్యాచర్య నిర్యన్మలా
బోధే భక్తిపథేథవా ప్యుచితతా మాయాంతి కిం తావతా
క్లిష్ట్వాతర్కపథే పరం తవవపు ర్బ్రహ్మాఖ్య మన్యే పున
శ్చిత్తార్ద్రిత్వమృతే విచింత్య బహుభి స్సిధ్యంతి జన్మాంతరైః.

త్వద్భక్తిస్తు కథారసామృతఝరీ నిర్మజ్జనేన స్వయం
సిధ్యంతీ విమలప్రబోధపదవీ మక్లేశత స్తన్వతీ
సద్య స్సిద్ధికరీ జయత్యయి విభో సైవాస్తు మే త్వత్పద
ప్రేమప్రౌఢిరసార్ద్రితా ద్రుతతరం వాతాలయాధీశ్వర.

3

పఠంతో నామాని ప్రమదభరసింధౌ నిపతితాః
స్మరంతో రూపం తే వరద కథయంతో గుణకథాః
చరంతో యే భక్తా స్త్వయిఖలు రమంతే పరమమూ
నహం ధన్యాన్ మన్యే సమధిగత సర్వాభిలషితాన్.

గదక్లిష్టం కష్టం తవచరణసేవారసభరే
ప్యనాసక్తం చిత్తం భవతి బత విష్ణో కురు దయాం
భవత్పాదాంభోజ స్మరణరసికో నామ నివహా
నహం గాయంగాయం కుహచన వివత్స్యామి విజనే.

కృపా తే జాతాచే త్కిమివ నహి లభ్యం తనుభృతాం
మదీయక్లేశౌఘ ప్రశమనదశానామ కియతీ
న కేకే లోకేస్మి న్ననిశ మయి శోకాభిరహితా
భవద్భక్తా ముక్తా స్సుఖగతిమసక్తా విదధతే.

మునిప్రౌఢారూఢా జగతి ఖలు గూఢాత్మగతయో
భవత్పాదాంభోజస్మరణవిరుజౌ నారదముఖాః

చరంతీశ స్త్వైరం సతతపరినిర్భాతపరచి
త్సదానందాద్వైతప్రసరపరిమగ్నాః కి మపరమ్.

భవద్భక్తిః స్ఫీతాభవతు మమ సైవ ప్రశమయే
దశేషక్లేశౌఘం నఖలు హృది సందేహకణికా
నచేద్ వ్యాసస్యోక్తి స్తవచ వచనం నైగమవచో
భవే న్మిథ్యారథ్యా పురుషవచనప్రాయ మఖిలమ్.

భవద్భక్తి స్తావ త్ప్రముఖమధురా త్వద్గుణరసాత్
కిమ ప్యారూఢాచే దఖిలపరితాపప్రశమనీ
పునశ్చాంతే స్వాంతే విమలపరిబోధోదయమిల
న్మహానందాద్వైతం దిశతి కిమతః ప్రార్థ్య మపరమ్.

విధూయ క్లేశాన్ మే కురు చరణయుగ్మం ధృతరసం
భవత్క్షేత్రప్రాప్తౌ కరమపిచ తే పూజనవిధౌ
భవన్మూర్త్యాలోకే నయన మథ తే పాదతులసీ
పరిఘ్రాణే ఘ్రాణం శ్రవణమపి తే చారుచరితే.

ప్రభూతాధివ్యాధి ప్రసభచలితే మామకహృది
త్వదీయం తద్రూపం పరమసుఖచిద్రూపముదియాత్
ఉదంచద్రోమాంచో గళితబహుహర్షాశ్రునివహో
యథా విస్మర్యాసం దురుపశమపీడా పరిభవాన్.

మరుద్గేహాధీశ త్వయిఖలు పరాంచోపి సుఖినో
భవత్స్నేహీ సోహం సుబహుపరితప్యేచ కిమిదమ్
అకీర్తి స్తేమాభూ ద్వరదగదభారం ప్రశమయన్
భవద్భక్తోత్తంసం ఝటితి కురు మాం కంసదమన.

కిముక్తై ర్భూయోభి స్తవహి కరుణా యావదుదియా
దహం తావ ద్దేవ ప్రహితవివిధార్థప్రలపితః
పురః క్ల్పేపాదే వరద తవ నేష్యామి దివసాన్
యథాశక్తివ్యక్తం నతినుతినిషేవా విరచయన్.

౪

కల్యతాం మమ కురుష్వ తావతీం కల్యతే భవదుపాసనం యయా
స్పష్ట మష్టవిధయోగచర్యయా పుష్టయాశు తవ తుష్టిమాప్నుయామ్.

బ్రహ్మచర్యదృఢతాదిభిర్యమై రాప్లవాదినియమై శ్చ పావితాః
కుర్మహే దృఢ మమీ సుఖాసనం పంకజాద్యమపి వా భవత్పరాః.

తారమంత రనుచింత్య సంతతం ప్రాణవాయు మభియమ్య నిర్మలాః
ఇంద్రియాణి విషయాదథాపహృ త్యాస్మహే భవదుపాసనోన్ముఖాః.

అస్ఫుటే వపుషి తే ప్రయత్నతో ధారయేమ ధిషణా మ్ముహుర్ముహుః
తేన భక్తిరసమంతరార్ద్రతా ముద్వహేమ భవదంఘ్రిచింతకాః

విస్ఫుటావయవభేదసుందరం త్వద్వపు స్సుచిరశీలనావశాత్
అశ్రమం మనసి చింతయామహే ధ్యానయోగనిరతా స్త్వదాశ్రయాః.

ధ్యాయతాం సకలమూర్తి మీదృశీ మున్మిషన్మధురతాహృతాత్మనామ్
సాంద్రమోదరసరూపమాంతరం బ్రహ్మరూపమపి తేవభాసతే.

తత్సమాస్వదనురూపిణీం స్థితిం త్వత్సమాధిమయి విశ్వనాయక
ఆశ్రితాః పునరతఃపరిచ్యుతా వారమేమహి చ ధారణాదికమ్.

ఇత్థ మభ్యసననిర్భరోల్లస త్త్వత్పరాత్మసుఖకల్పితోత్సవాః
ముక్తభక్తకులమౌలితాంగతాః సంచరేమ శుకనారదాదివత్.

త్వత్సమాధివిజయేతు యః పున ర్మంక్షుమోక్షరసికః క్రమేణవా
యోగవశ్య మనిలం షడాశ్రయై రున్నయత్యజ సుషుమ్నయా శనైః.

లింగదేహమపి సంత్యజ న్నథో లీయతే త్వయి పరే నిరాగ్రహః
ఊర్ధ్వలోక కుతుకీతు మూర్ధతస్సార్ధమేవ కరణై ర్నిరీయతే.

అగ్నివాసరవళర్క్షపక్షగై రుత్తరాయణజుషాచ దైవతైః
ప్రాపితో రవిపదం భవత్పరో మోదవాన్ ధ్రువపదాంత మీయతే.

అస్థితోథ మహారాలయే యదా శేషవక్త్రదహనోష్మణార్ద్యతే
ఈయతే భవదుపాశ్రయ స్తదా వేధసః పద మతఃపురైవ వా.

తత్రవా తవ పదేథవా వసన్ ప్రాకృతప్రళయ ఏతి ముక్తతామ్
స్వేచ్ఛయా ఖలు పురా విముచ్యతే సంవిభిద్య జగదండ మోజసా.

తస్య చ క్షితిపయో మహోనిల ద్యోమహత్ప్రకృతిసప్తకావృతీః
తత్తదాత్మకతయా విశన్ సుఖీ యాతి తే పద మనావృతం విభో.

అర్చిరాదిగతి మీదృశీం వ్రజన్ విచ్యుతి న్నభజతే జగత్పతే
సచ్చిదాత్మకభవద్గుణోదయా నుచ్చరంత మనిలేశ పాహి మామ్.

౫

వ్యక్తావ్యక్త మిదం నకించి దభవ త్ప్రాక్ప్రాకృతప్రక్షయే
మాయాయాం గుణసామ్యరుద్ధవికృతౌ త్వయ్యాగతాయాం లయమ్
నో మృత్యుశ్చ తదామృతంచ సమభూ న్నాహ్నో న రాత్రేః స్థితిః
తత్రైక స్త్వ మశిష్యథాః కిల పరానందప్రకాశాత్మనా.

కాలః కర్మగుణాశ్చ జీవనివహా విశ్వం చ కార్యం విభో
చిల్లీలారతిమేయుషి త్వయి తదా నిర్లీనతామాయయుః
తేషా న్నైవ వదం త్యసత్త్వమయి భో శక్త్యాత్మనా తిష్ఠతాం
నోచేత్ కిం గగనప్రసూనసదృశాం భూయో భవే త్సంభవః.

ఏవంచ ద్విపరార్ధకాలవిగతా వీక్షాం సిసృక్షాత్మికాం
బిభ్రాణేత్వయి చుక్షుభే త్రిభువనీభావాయ మాయా స్వయమ్
మాయాతః ఖలు కాలశక్తి రఖిలా దృష్టం స్వభావోపిచ
ప్రాదుర్భూయ గుణాన్వికాస్య విదధు స్తస్యా స్సహాయక్రియామ్.

మాయా సన్నిహితే ప్రవిష్టవపుషా సాక్షితి గీతో భవాన్
భేదై స్తాం ప్రతిబింబితో వివిశివాన్ జీవోపి నైవాపరః

